

బుచ్చిబాబు
స్మారక కథా కదంబం 1996
శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్

# భమిడిపాటి జగన్నాథరావు కథలు

శ్రీ
వేదగిరి
కమ్యూనికేషన్స్

# భమిడిపాటి జగన్నాథరావు కథలు



## బుచ్చిబాబు స్మారక కథా కదంబం - 2

*Sole Distributors in Andhra Pradesh*
*Please Send Your Orders to:*
VISALAANDHRA PUBLISHING HOUSE,
4-1-435, BANK STREET,
HYDERABAD-500 001

శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్

1-8-59/1/7, చిక్కడపల్లి,

హైద్రాబాద్ - 500 020

ఫోన్ : 667665, 661116

**BHAMIDIPATI JAGANNADHA RAO STORIE**
*(Butchibabu Smaraka Katha Kadambam - 2)*

Compiled by
Vedagiri Rambabu
For Sri Vedagiri Communications

First Edition :
14, June 1996

*Cover Page Illustration :*
**BAPU**

*Back Wrapper Design :*
**CHANDRA**

Price
Rs. 40/-

*Laser Printing :*
**ESSES GRAPHICS**
104 B, Venkata Ramana Apts.,
A.C. Guards, Hyderabad - 500 004.
Phone : 3320105

*Printed at :*
**PLANOGRAPHERS**
Chirag Ali Lane
Abids, Hyderabad - 500 001.

# ముందుగా మూడు ముక్కలు

ఈ జూన్ 14 బుచ్చిబాబు గారి ఎనభయ్యవ జన్మదినం. ఆ సందర్భంగా ప్రముఖ కథకులు శ్రీ భమిడిపాటి జగన్నాథరావు కథాసంపుటిని, బుచ్చిబాబు స్మారక కథా కదంబంగా తీసుకొస్తున్నాము.

శ్రీ భమిడిపాటి జగన్నాథరావు గారు తక్కువ కథలు రాసినా అన్నీ మంచి కథలే రాశారు. అందుకే మాకీ అవకాశం ఇచ్చిన వారికి ముందుగా మా కృతజ్ఞతలు. అలాగే ఈ పుస్తకాన్ని ఆవిష్కరించడానికి అంగీకరించిన శ్రీమతి బుచ్చిబాబు గారికి మా కృతజ్ఞతలు. ఈ పుస్తక ముఖ చిత్రం ప్రముఖ చిత్రకారులు బాపుగారి బొమ్మ. వారు మాకు అందిస్తున్న సహకారానికి ధన్యవాదాలు చెప్పుకుంటున్నాము.

ఈ పుస్తకాన్ని సకాలంలో తేవడానికి ఎంతగానో సహకరించిన మిత్రులు, శ్రేయోభిలాషులు చంద్ర, రచన శాయి, వి. రాజారామ్మోహనరావు గార్లకు, ఎస్.ఎస్. గ్రాఫిక్స్ వారికి, ప్లానోగ్రాఫర్స్ మురళి గారికి కూడా మా కృతజ్ఞతలు.

భవదీయ

**వేదగిరి రాంబాబు**

14-6-1996

# ఈ సంపుటిలో కథలు

# అడుగుజాడలు

రోహిణీ కార్తె ప్రవేశించి మూడో రోజు. పొద్దుట నుండి వేడి గాలి మొదలై, తొమ్మిదయేటప్పటికే వడగాలి ఎక్కువై, ఎండ నిప్పులు చెరిగేస్తోంది.

ఇంటి దగ్గర పదింటికి బయలుదేరి సాయంత్రం నాలుగింటికి రాజమండ్రి చేరుకున్నాను. స్టేషనుకు వెళ్ళేటప్పటికి నాక్కావలసిన బండి సిద్ధంగా ఉంది. కొవ్వూరు టిక్కెట్టు కొని బండిలో కూర్చున్నాను.

గోదావరి స్టేషనులో జనంతో బండి నిండు గర్భిణిలా బయల్దేరి గోదావరి వంతెన మీద మంద్రంగ, బరువుగ అడుగులు వేస్తోంది. జనం గోదావరిలో రాగి కానులు విసురుతున్నారు. కిటికీ లోంచి తొంగి చూసాను. గోదావరి ఎండిపోయి పెద్ద, పెద్ద ఇసుక మేటలు వేసింది. దూరాన నీళ్ళు ఆకుపచ్చగా కనుపిస్తున్నాయి.

గాలి వీచి చదునుగా, క్రమంలో మెరిసే రేణువులతో ఇసుక తిన్నె పరుచుకుంది - బద్ధకంగా. ఎండపడి ఇసుక బంగారు పొడిలా మెరుస్తోంది.

ఉన్నట్టుండి నా చూపు నిలిచిపోయింది. ఆ ఇసుక తిన్నెలో అడుగు జాడలు. ఎవరో నాకు తెలియని వ్యక్తుల చిహ్నాలవి. ఆ జాడలు నా చూపు నిలిపివేసాయి.

అవ్యక్తమైన వాంఛతో నా మనసు నిండిపోయింది. ఆ వాంఛ నాకు అనుభవమవదు. కాని నా మనసంతా ఆవరించుకొంది..... ఆ తిన్నెపై దిగి, సువిశాలంగా పరుచుకొన్న ఆ ఇసుక మేటలో ముద్రింపబడిన ఆ పాదాల జాడలు తాకాలనీ, వాటిని వదలకుండా వాటిలో కలిసిపోవాలనే నా వాంఛలోని 'అసందర్భం' నాకు తెలుసు. కాని నాలో ఆ కోరిక మధురంగా నిలిచిపోయింది.

మన కోరికలన్నీ తీరవు.... పచ్చటి వరిచేల మీద పడుకొని ఆడుకోవాలనీ, ఎత్తైన పర్వతాల మధ్య గుహల్లో తిరుగాడాలనీ, నీలపు సముద్రపుటంచులు తాకాలనీ - ఈ వాంఛలు తీరనివే. కాని ఆ కోరిక మనని

వీడదు. మనసంతా పొంగిన పాలలా ఆవరించుకుంటుంది. అందుకోలేక పోయినా, ఊహలను మనసులో నిలిపి జోకొడుతుంది. మానవుడు ఆ మత్తులో హాయిగా నిదురించి, మేల్కొని వాస్తవలోకంలో పడతాడు. బతికి మేల్కొన్న ఘడియల కంటే ఆ మత్తే అతనికి ఉత్సాహాన్నిస్తుంది. అందుకోలేని ప్రకృతి, అర్థంకాని, అందీ అందని జీవిత లక్ష్యం - ఇవే అతని మనుగడకు పునాది.

అంచుల్లేని పాల సముద్రంలో, మధుర హాసంతో ఒప్పే రమణితో, శేషపానుపుపై శయనించినట్టు ఆ 'కమనీయమూర్తి' ని చూపించే దృశ్యం - నాకిప్పటికీ, అందుకే అత్యంత మనోహరంగా గోచరిస్తుంది. ఆ 'భావన' గొప్పది. దానిని మానవుడు అందుకుని, అనుభవించ లేకపోవచ్చు. కాని అలాంటి ప్రశాంతమైన, నిర్వికారమైన, నిశ్చలమైన అనుభవం కావాలని మనసు కోరుతుంది. లభ్యం కాదని తెలిసినా నిరాశ లేదు, నిస్పృహ లేదు.

కొవ్వూరులో రైలు నిలిచింది.

బస్సుస్టాండు కొచ్చాను. లాస్టు బస్సు అందింది. జనం అప్పటికే కిక్కిరిసి ఉన్నారు. ఉక్క తగ్గలేదు. బస్సు కదిలేసరికి బస్సు 'పాలవిల్లి' లా తయారైంది. లోపల ఊపిరాడ్డం లేదు.

అప్పుడప్పుడు కాస్త గాలి, అదైనా వేడిగా తగుల్తోంది. దూరాన మబ్బులు పడి కొండలు నీలిరంగులో ఆవరింప బడుతున్నాయి. సూర్యుడు కొండ కిందకు దిగిపోతున్నాడు - కోపంతో ముఖం కందగడ్డలా చేసుకుని. మేఘాల అంచులు రక్త వర్ణంతో మెరుస్తున్నాయి. ఆ కాంతుల్ని అందుకుని వాటి అంచున నిలబడగలిగితే !

ఓ గంటసేపయిన తర్వాత జనం తగ్గారు.

చుట్టూ చీకటి. బస్సులో రొద. ఇంకా వెచ్చగా వీస్తున్న గాలి. దూరాన పొలాల్లో మిణుగురు పురుగులు భూమి మీద నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. కొండలు చీకట్లో కలిసి పోయాయి.

నేను వెళ్ళవలసిన ఊరు చేరడానికి ఇంకా ఓ గంట పడుతుందిట. నా గుండెల్లో రాయి పడింది. ఆ రాత్రప్పుడు ఆ కొత్త ఊళ్లో ఎక్కడకు వెళ్ళను? పొద్దుట నుండీ ప్రయాణంలో, వడగాలితో విసుగెత్తి పోయింది. చివరకు ఈ బస్సు ప్రయాణంలో నాలో ఓర్పు పోయి - చిరాకు, విసుగు చివరి దశకు వచ్చేసాయి.

తొమ్మిదైంది. నేను రావలసిన ఊరు వచ్చిందని చెప్పాడు కండక్టరు. దిగాను. చుట్టూ చీకటి. కొంచెం దూరంలో కిళ్ళీ కొట్టులో పెట్రోమాక్సు లైటు వెలుతురు. పై నించి సామాను అందుకోడానికి కూడా ఎవరూ లేరు. నేనే అందుకున్నాను. చెయ్యి బెణికింది. బస్సు కదిలిపోయింది.

ఈ ప్రయాణంతో వళ్ళంతా నలిగి పోయింది. మనసు ఆలోచించడం అలవాటు లేనట్టుగా మొద్దుబారి పోయింది. ఆ చీకట్లో, కొత్త ప్రదేశంలో కొద్ది క్షణాలు నిలుచున్నాను. కర్తవ్యం గుర్తుకొచ్చింది.

లైటు దగ్గరకు వెళ్ళాను. కిళ్ళీ కొట్టతను కొత్త ముఖం, నా వాలకం చూసి కాబోలు 'ఏమిటన్నట్టు?' చూసాడు.

"నేనీ ఊరికి కొత్త. ఇప్పుడే బస్సు దిగాను. ఇక్కడికి ఉద్యోగం మీద వచ్చాను. ఈ రాత్రి ఏదైనా హోటల్లో గది దొరుకుతుందా?" అన్నాను.

"అబ్బే! ఇది చిన్న పల్లెటూరండీ. గదులు దొరకవు. మీ ఆఫీసు కూడా మూసేస్తారే?" అని కాసేపాలోచించాడు.

"ఇక్కడో అయ్యరు ఓటలుంది. అక్కడ భోంచేయండి. పడకకు నే చూస్తాన్లెండి" అని చప్పట్లు కొట్టి "ఒరే, సుబ్బా!" అని పిల్చాడు.

"ఈరి సామాన్లు అయ్యరు ఓటల్లోకి తీసికెల్లి ఈరికి భోజనం పెట్టించు. కాంత పడుకోటానికి చోటిమ్మను.... 'బుల్లబ్బాయి' పంపాడని చెప్పు"

ఆ మనిషి నా సామాను తీసుకుని ముందు నడుస్తున్నాడు. కళ్ళు కనిపించనంత చీకటిగా ఉంది. ఓ ఫర్లాంగు నడిచాం.

"జాగరతగా నడండి బాబూ!...... ఇక్కడ కాంత లోతు" అన్నాడు సుబ్బన్న ముందు కడుగేస్తూ.

"అలాగే" అంటూ జారి పడబోయి, తప్పించుకు నడిచాను.

"అయ్యరు గోరూ..."

చీకటికి కళ్ళు అలవాటు పడ్డాక ఆ ఇల్లు గడ్డితో నేసిన ఇల్లని తెలిసింది. ఒక పక్క వాటాలో లాంతరు తీగకు వేళ్లాడుతోంది.... పక్కనే పెద్ద త్రాసు - కిరాణా కొట్టని చెపుతూ. ఆ పక్కనుండి ఓ ఆడమనిషి వచ్చి "ఎవరూ?" అంది.

"ఈ అయ్యగోరికి భోజనం పెట్టి ఈ రాతికి కిక్కడ పడుకోనానికి చోటిమ్మని కిల్లీకొట్టు 'బుల్లబ్బాయి' గోరు పంపారండి. అయ్యరుగోరుతో సెప్పండి."

ఆవిడ పక్కవాటాలోకి వెళ్లింది. ఎవరో మూలుగుతున్నారు. ఆ మూలుగుతున్నావిడితో మొదట వచ్చినావిడ ఎవరో భోజనానికి వచ్చారని చెప్తోంది.

" మా లక్ష్మిని కాస్త లేపమ్మా - ఆరికి విస్తరేసి వడ్డించమను" మాట యాసగా ఉంది.

పక్కింటి నుండి వచ్చినావిడ 'లక్ష్మీ' అని ఓ నిద్దరపోతూన్న పిల్లని లేపి, "భోజనం వడ్డించమంటున్నారు అమ్మ" అంది.

ఈ పిల్ల బద్ధకంగా, కళ్ళు నులుముకుంటూ లేచింది. నా సామాను వీధి అరుగుమీద పెట్టి సుబ్బన్న వెళ్ళిపోయాడు.

ఆ పిల్లకి నిద్రలోంచి లేవడానికిష్టంగా లేనట్టుంది. విసుగ్గా వీధి గదిలో విస్తరి వేసింది. ఇంట్లోంచి మూలుగు కర్కశంగా, బాధగా ఆ నిశ్శబ్దంలో అసహ్యంగా ఉంది.

చల్లారిపోయిన అన్నం, వాసన వేసే పచ్చడీ, గొంతులో దిగే ఆ అడ్డాకులోని పుల్లలూ - నాకు వెగటు వచ్చింది.

పక్కింటావిడ అడుగుతోంది "ఏవండీ పిన్ని గారూ! కాలినొప్పి తగ్గలేదా?"

"ఇవాళింకా మోపుజేసి మరీ బాధగా ఉందమ్మా" ఆ మూలగుతున్నావిడ చెప్తోంది.

నాకు వడ్డించే పిల్ల మజ్జిగ పోసి వెళ్ళి పడుక్కోంది.

"ఆరికి పెరుగు పోసావా? వంటింట్లో గూట్లో ఉంది" అని యాసతో, ఆ మూలుగుతున్నావిడ లోపలి నుంచి కేకేసింది.

ఆ పిల్ల విసుక్కుంటూ, గొణుగుతూ లేచింది.

"అక్కర్లేదు" అని లేచి చేయి కడుక్కున్నాను.

పైన పక్క వేసుకున్నాను. నిద్ర పట్టడం లేదు. ఆ నిశ్శబ్దంలో లోపలి నుండి మూలుగు వికృతంగా ధ్వనిస్తోంది. ఆ మూలుగు, దోమలు, గాలి బిగిసిపోయి ఉక్క... ఆ రాత్రి నాకు నరకం కనిపించింది.

మర్రోజు ఆఫీసుకు వెళ్ళి జాయినయాను. ఆ రోజే ఓ వాటా అద్దెకు తీసుకున్నాను. ఊరు చాలా చిన్నది. ఆ హోటల్లోనే భోజనం చేస్తున్నాను. ఆ తొమ్మిదేళ్ళ పిల్ల 'లక్ష్మి' నాకు రోజూ వడ్డిస్తోంది. ఆ మూలుగుతున్నావిడ అయ్యరు భార్యనీ, నేను వచ్చే క్రితం రోజునే అన్నం వారుస్తూంటే, గంజి కాలి మీద పడి బొబ్బలెక్కి బాధపడుతోందని తెలిసింది.

నాలుగు రోజుల పోయాక, ఓ రాత్రి భోజనం చేసి వీధి వసారాలో స్టూలు మీద కూచుని సిగరెట్టు కాల్చుకుంటున్నాను.

నా ముందు పిలకతో, ఎర్రని కళ్ళతో, ఎత్తు పళ్ళతో, మురికి ఓడుతూన్న పంచతో నిలుచున్న అతను నాకేసి చూస్తూ "కొత్తగా భోజనానికి చేరారా? ఎడ్వాన్సు ఇరవై ఇవ్వండి" అన్నాడు.

అతనే అయ్యరని తెలిసింది. రూపాయలిచ్చాను.

"ఎక్కడ పనిచేస్తున్నారు?" గొంతు కర్కశంగా ఉంది.

నే చెప్పేలోగానే ఎటో చూస్తూ ఆలోచనలో పడిపోయాడు.

"మంచి నీళ్ళు కావాలి" అన్నాను.

"నీళ్ళియ్యి" అంటూ ఇంట్లోకి ఉరిమాడు అయ్యరు.

నాకు రోజూ వడ్డించే పిల్ల నీళ్ళు తీసుకొస్తుంటే, కొద్దిగా అతని పంచ మీద వలికాయి.

"బుద్ధి లేదూ? ఏం అంత పరాకు?" అంటూ అయ్యరు ఛట్టున ఆ పిల్లని లెంప మీద కొట్టాడు. ఆ పిల్ల చేతిలోని గ్లాసు దూరంగా పడింది. ఆ లేత కళ్ళల్లో గిర్రున నీళ్ళు నిలిచాయి.

ఎరుపెక్కిన ఆ లేత బుగ్గ మీద తట్లు తేలాయి.

ఆ యజమాని రూపం, అతని ప్రవర్తన, ఆ పరిసరాలు, ఇంట్లోంచి ఆ మూలుగు... ఇవన్నీ ఆ ఇల్లన్నా, ఆ ఇంట్లో వ్యక్తులన్నా నాకు వెగటు కలిగించాయి.

× × × × ×

ఆ హోటల్లోనే భోంచేస్తున్నాను. అయ్యరు భార్య కొంచెం తిరగ గలుగుతోంది. నా భోజనం వాలకం, ఏదీ ప్రత్యేకంగా అడగక పోవటం గమనించిందనుకుంటాను - లక్ష్మితో చెప్పి రోజూ పెరుగు పోయించేది. ఆ పిల్ల లక్ష్మి దిగులుగా తిరుగుతూ ఇంట్లో పనంతా చేసేది. ఆ విషయం కొట్టొచ్చినట్టు కనపడేది. అయ్యరు ఆ పిల్లని చీటికీ మాటికీ అకారణంగా కొట్టేవాడు. ఏదో కారణం కల్పించి ఆ పిల్లని పిలిచి బాధించేవాడు.

.....ఆ రోజు రాత్రి అయ్యరు భార్య వడ్డిస్తోంది. అయ్యరు ఎందుకో గాని ధుమధుమలాడుతూ ఇంట్లో కొచ్చాడు. లక్ష్మి ఆ రోజు కూనిరాగం తీస్తూ గుడ్డ పీలికలతో తాటాకు బొమ్మకి అలంకరణ చేస్తోంది. అయ్యరు దూకుడుగా నడుస్తూ వచ్చి ఆ పిల్ల తాటాకు బొమ్మని తొక్కేసాడు. బొమ్మ ఆకారం పోయి తప్పడగా అయిపోయింది. ఆ పిల్ల 'నా బొమ్మ' అని దీనంగా చూస్తోంది... బిక్క మోహంతో. అంతే! -

అయ్యరు తట్టుతేలేట్టు ఆ పిల్లని కొడుతున్నాడు. భోంచేస్తూన్న నాకు అమితమైన బాధ కలిగింది. కూచోలేకపోయాను.

ఛట్టున లేచి వెళ్ళి 'ఇంకొక్క దెబ్బ పడిందంటే ఊరుకోను' అన్నాను. నా కంఠం నాకే కఠినంగా ధ్వనించింది. ఏమనుకున్నాడో అయ్యరు సణుగుతూ వీధిలోకి పోయాడు.

పక్క తలుపు దగ్గర వెక్కి వెక్కి ఏడుస్తూన్న ధ్వని వేపు నా దృష్టి మళ్ళింది. తెల్లచీరతో, ఓ పాతికేళ్ళ పడుచు గొంతులో కొంగు కుక్కుకుంటూ ఏడుపు దిగ మింగుకుంటోంది.

ఆ ఇంటిలో ఆమె నింతవరకూ నేను చూడలేదు. ఆమె నుదురు విశాలంగా, బొట్టులేక పోవడం చేత కాబోలు - మరీ విశాలంగా ఉంది. ఆ పెద్ద కళ్ళు కన్నీళ్ళతో నిండాయి. ఆమె నన్ను చూసి బెదిరినట్టుగా పక్కకి తప్పుకుంది.

"ఆయనదంతే పిచ్చి కోపం బాబూ! భోజనం మధ్యలో లేచారు. కూచోండి - పెరుగు పోస్తాను" అంది అయ్యరు భార్య.

నాకిక తినాలనిపించక 'రానని' చెప్పాను.

నా మనసంతా కలత బారిపోయింది.

"మీరు భోజనం పూర్తి చేయకుండానే మధ్యలోనే లేచారు. ఇక్కడికి హోటలు మార్చాక భోజనం కూడా సరిగా పెట్టలేక పోతున్నాము" అంటూ అయ్యరు భార్య నొచ్చుకుంది.

"మునుపు ఈ ఊళ్లోనే ఇంకో చోట ఉండేదా మీ హోటలు?"

ఆమె కాసేపు ఏం మాట్లాడలేదు. తర్వాత, "మా రాత బావుండలేదు బాబూ! అంతా చక్కగా జరిగిపోయేది. మా ఇల్లు కాలిపోయి ఇలాటి అవస్థ పడుతున్నాం" అంది.

"ఇల్లెందుకు కాలిపోయింది?"

ఆమె 'ఖర్మ' అన్నట్టుగా నొసట మీద చేత్తో రాసుకుంది.

"ఈ ఊరొచ్చి ఐదేళ్ళయింది బాబూ! ఎక్కడా కలిసిరాంది ఈ ఊళ్ళో కాస్త నిలదొక్కుకున్నాం. ఏదో కాలం గడిచిపోతోంది. సొంత ఇల్లు కూడా - గడ్డితో నేసినదే అనుకోండి - కట్టుకున్నాం. ఆరు నెలల క్రితం భోజన హోటలుతో పాటు కాఫీ హోటలు కూడా పెట్టేరాయన. ఈ ఊళ్ళో అప్పటికే రెండు కాఫీ హోటళ్ళున్నాయి. వాళ్ళకి ఇష్టం లేదు ఈ పోటీ. కాఫీ హోటలు మూసేయమని కొంతమంది చేత చెప్పించేరు

- ఈయన వినలేదు. ఈయనదంతా పట్టుదల. లాభాలు కూడా వచ్చేయి.

'నెల్లాళ్ళ క్రితం ఓ రోజు రాత్రి ఈయనా, వాళ్ళూ మాటా మాటా అనుకున్నారుట. అంతే ! ఆ రోజు అర్ధరాత్రి ఇల్లు కాలిపోతూంటే మెలుకువ వచ్చి చూసుకుంటే అంతా పూర్తి అయిపోయింది. ప్రాణాలతో బయటపడ్డాం. సంపాదించి దాచుకున్న కొద్ది సొమ్మూ కాలిపోయింది. చెమటోడ్చి కట్టుకున్న ఇల్లు కాలిపోయింది. సామాను మసి ఐపోయింది. వీధిలో నిలబడ్డాం.

"ఊరికే అంటుకుందో, ఎవరైనా అంటించారో - నిజం ఆ భగవంతుడికే తెలియాలి బాబూ!"

ఆమె కంఠం రుద్ధమైంది.

ఆమె దుఃఖం నాకు అర్ధమైంది. వాళ్ళ దేశం విడిచి, ఎంతో దూరం పొట్ట కోసం వచ్చి ఎక్కడా కలిసి రాక, చివరికీ ఊళ్లో కాస్తపచ్చగా ఉంటుంటే - మళ్ళా యధాస్థితికి దిగజారడం ఎంత బాధో ఊహించుకుంటేనే గ్రాహ్యమవుతుంది.

....రోజా రాత్రి భోజనం చేసి నేను వీధి వసారాలో స్టూలు మీద కూచుని సిగరెట్టు కాల్చుకుంటూండగా, అప్పుడప్పుడు అయ్యరు భార్య తమ గాథ చెప్పేది.

వాళ్ళది తుళు భాషట. కేరళ రాష్ట్రంలో ఉండేవారట. మళయాళం బాగా వచ్చుట. ఇలా ఎన్నో సంగతులు చెప్పేది. ఎందుకో ఆమె ఒక్కో సమయంలో కొన్ని విషయాలు నాతో చాలా సన్నిహితంగా చెప్తూండేది. ఆపుకోలేని బాధ ఏదో తనలో ఇమిడి ఉన్నట్టుగా మాట్లాడేది.

....ఆ రోజు రాత్రి కేంప్‌కు వెళ్ళి రాత్రి తొమ్మిదిన్నరకు భోజనానికి హోటలుకు బయలు దేరాను. అమావాస్య ముందు చీకటి. పక్క దుకాణం తాలూకు కుటుంబం మూడు రోజులై పెళ్ళికి వెళ్ళారు. అంచేత ఆ వాటా నుండి దీపం వెలుగు లేక అయ్యరు హోటలు ఆ చీకటిలో కలిసి పోయి ఆకృతి లేకుండా ఉంది. తడుముకుంటూ మెట్లెక్కుతున్నాను.

అయ్యరు కంఠం ఆ నిశబ్దంలో వికృతంగా తారాస్థాయిలో పలుకుతోంది. గదిలో అడుగు పెట్టబోయి లోపలి దృశ్యం చూసి ఆగిపోయి వీధి వరండాలోనే నిలుచుండి పోయాను.

అయ్యరు వాళ్ళ భాషలో ఏదో అరుస్తున్నాడు. వేల మీద దెబ్బలతో శోషిల్లి 'లక్ష్మి' మూలుగుతోంది. పెదిమ పక్కన రక్తం చార మెరుస్తోంది. నేనా రోజున చూసిన ఆ పాతికేళ్ళ పడుచు సరి దీనవదనంతో, కట్టెలా, ఎదురుగా వంచిన తలతో నిల్చుంది. ఆమె నుద్దేశించి అయ్యరేదో అంటున్నాడు. ఆమె ముఖం చేతుల్లో కప్పుకొని ఏడుస్తోంది.

ఇంతలో ఉన్నట్టుండి అయ్యరు నేల మీద సొమ్మసిల్లి పడిపోయిన లక్ష్మిని చేతిలోని కర్రతో బలంగా కొట్టడం మొదలెట్టాడు. ఈసారి ఆ పడుచు క్షణంలో పరుగున వచ్చి ఆ పిల్లని వాటేసుకుంది. లక్ష్మిని కొడుతూన్న దెబ్బలు మాని, ఆమెను ఒక్క ఊపులో పైకి లాగి గోడకు తోసేసి, కోపంగా ఏదో అని వీధిలో ఉన్న నన్ను గమనించకుండానే, నన్ను తోసుకుంటూ బైటకు పోయాడు.

ఓ మూల పిల్లిలా భయంలో ముడుచుకు పోయిన అయ్యరు భార్య జీవచ్ఛవంలా ఐపోయింది. ఆమె వదనంలో దుఃఖపు ఛ్ఛాయలు, ఎనలేని వ్యధ కొట్టొచ్చినట్టు ప్రతిఫలిస్తున్నాయి.

ఇంతలో ఆ పడుచు నన్ను చూసింది. బెదిరిన, దెబ్బతిన్న పక్షిలా రివ్వున లేచి లక్ష్మిని అక్కున జేర్చుకొని, పిచ్చిగా లోపలికి వడిగా పోయింది.

అప్పుడు అయ్యరు భార్య నన్ను చూసింది. తెల్లబోయినట్టుగా కాసేపు ఉండిపోయింది. రెండు నిమిషాల్లో లేచి, ముఖం కడుక్కొని నిశ్శబ్దంగా పీట వేసి విస్తరి వేసింది.

"నేనీ పూట ఏం తినను" అంటూ వీధి వసారాలో స్టూలు మీద కూర్చున్నాను.

ఆమె ఓ గ్లాసు మజ్జిగ తీసుకొచ్చింది. తాగాను. సిగరెట్టు కాల్చుకుంటున్నాను.

సిగరెట్టు ఐపోయింది. లేచాను.

"వెళ్తున్నారా"?....

ఆ పిలుపులోని వేదన నన్ను నిలిపి వేసింది. ఆమె ముఖం సరిగా కనబడకపోయినా ఆమె స్వరంలోని దీనత్వం నన్ను కదిలించి వేసింది. ఆపుకోలేని, తనలో ఇముడ్చుకోలేని వ్యధతో ఆమె అల్లాడి పోతోంది.

"నాకు కాస్త విషం సంపాదించి ఇవ్వండి. నాకింకేమీ వద్దు. నేనీ బాధ భరించలేను". అంది ఆమె నాకేసి జీవం లేనట్టు చూస్తూ.

"మీకెంత మంది పిల్లలు?" అన్నాను నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ.

ఆమె కాసేపాలోచించి "ముగ్గురు - ఇద్దరమ్మాయిలు, ఓ అబ్బాయి" అంది.

"అయ్యరు గారికి కోపమెక్కువ. మీరు ఎలాగో అలవాటు పడాలి. ఆయన కోపానికి, మూర్ఖత్వానికీ మీరే తల్లడిల్లిపోతే - పిల్లలు బెంగపడిపోరా? మీ పెద్దమ్మాయి ఎంత బాధపడుతోందో గమనించారు గదా! మీరు కలగ జేసుకోవడంతో మీ పెద్దమ్మాయి చెల్లెలు లక్ష్మిని ఆదుకోవలసి వస్తోంది. ఇలాంటి సమయాల్లోనే మీరు ధైర్యంగా ఉండాలి" అన్నాను.

ఆమె మాట్లాడలేదు. స్థాణువులా ఉండిపోయింది.

"పిల్లల్ని ఏదో విధంగా మీరే పైకి తీసుకురావాలి. చిన్న పిల్ల పెళ్ళి, అబ్బాయి చదువు ముఖ్యం గదా! అందులో పెద్ద పిల్లని దేవుడే అన్యాయం చేశాడు. ఆమె మీద పిల్లల భారం వేసి మీ దారి మీరు చూసుకోడం ధర్మం కాదు. పోనీ ఆమెకు మళ్ళా వివాహం చేయలేకపోయారా? మీ దేశంలో ఆ ఆచారంలో మార్పు వచ్చి, మళ్ళా వివాహాలు జరగడం లేదా?" అన్నాను విషయం మార్చాలని.

ఆమె నోట మాట లేదు.

చివరికి నేనే, "ఎన్నాళ్ళయింది మీ పెద్ద అమ్మాయికి వైధవ్యం వచ్చి" అన్నాను.

అంతే! ఛట్టున ఆ నిశబ్దంలో అదిరిపోయేట్టు ఆమె వెర్రిగా అరిచింది. అది కేకో, బాధో, ఆక్రోశమో, వేదనో నాకు తెలియదు గానీ - నా నిలువెల్లా కంపించిపోయింది.

ఉన్నట్టుండి ఆమె చేతులు 'కాదు - కాదు' అన్నట్టుగా ఊపుతూ, గూడు కట్టి, ఘనీభవించిన శోకాన్ని ఇక ఆపుకోలేక ఆ చీకటి రాత్రి వెర్రిగా, వికృతంగా, భయానకంగా, ఏడ్వ నారంభించింది.

ఆమెను ఓదార్చడం సాధ్యం కాని పనని నాకు పది నిముషాల్లో తేలిపోయింది.

ఒక అరగంటకు ఆమె కన్నీరు కట్టింది.

"భర్త పోవడం ఆమె తప్పు కాదు. ఆమెకు నిరంతర వైధవ్యం కల్పించింది..." అంటూ సర్దబోయాను.

ఆమె గొంతు పెగల్చుకొని, ఎలుగు రాపడిన గొంతుతో అంది - "అంత మాటనవద్దు, మిమ్మల్ని వేడుకుంటున్నాను. మా అమ్మాయి విధవ కాదు. నేనా మాట భరించలేను. ఆ మాట అని నన్ను బాధించవద్దు."

ఈసారి నాకు ఆశ్చర్యమైంది. ఆమె తెలివిలో మాట్లాడుతోందా అన్న అనుమానం కలిగింది.

మొహాన బొట్టు, చేతుల్ని గాజులు లేవు - ఆమె వైధవ్యం అనుభవిస్తోందనడం నా తప్పా?

నేనేమీ అనదలుచుకోలేదు.

అయ్యరు భార్య లేచి నాకు కొంచెం దగ్గరగా వచ్చి కూర్చుంది.

"నేనిక ఈ రంపపు కోత నాలోనే పెట్టుకుని భరించలేను. ఎన్నాళ్ళ నుండో నన్ను దహించివేస్తున్న ఈ విషయం ఎవరితోనైనా చెప్పుకుంటే గాని నాకిక ఉపశమనం లేదు."

ఆ రాత్రి, చుక్కలు ఆకాశాన్న మినుకు మినుకుమంటూండగా, ఆ నిశబ్ద వాతావరనంలో ఆమె జీవిత గాథ నాకు చెప్పింది. ఆ గాథలో ఇమిడి ఉన్న కఠోర సత్యం నన్ను దిగ్భ్రాంతిలో ముంచింది. ఆమె అర్ధోక్తిలో ఏడుస్తూ చెప్పింది. ఆ మాటలు గుదిగుచ్చితే, ఆమె చెప్పిన గాథ :

మాది కేరళ దేశంలో చిన్న పల్లెటూరు. మాకు పెద్దలు సంపాదించింది ఓ ఐదెకరాలు ఉంది. ఆయన వ్యవసాయం చేయించేవారు. మాకు ఏ విధమైన లోటూ లేదు. చుట్టూ కొబ్బరి, పోక మొక్కలతో కనుచూపుమేర పచ్చగా, కనుల పండువుగా ఉండేది. మా ప్రథమ సంతానాన్ని ఎంతో అభిమానంతో పెంచి పెద్ద జేశాము. ఆమె బుద్ధిలో, చదువులో చురుకైనది. ఆమె స్కూలు ఫైనలు చదువుతూండగా మా రెండోవాడు పుట్టాడు.

మొదట నుండీ ఆయనకు కుటుంబ గౌరవం మీద గురి ఎక్కువ. చచ్చి స్వర్గాన ఉన్న వాళ్ల తాతగారిని ఏదో నీచంగా అన్నాడని మా పక్కింటి ఆయన్ని కొట్టి, కోర్టుల దాకా వెళ్ళారు. పట్టుదల, కుటుంబ గౌరవం కోసం వల్లమాలిన తాపత్రయం తప్ప ఆయనలో చెప్పుకో దగ్గంత చెడు ఏమీ లేదు.

మా పెద్ద పిల్ల అల్లారు ముద్దుగా పెరిగింది. ఆయనే దాన్ని పెంచారు. అదంటే ఆయనకు పంచప్రాణాలు. పిల్లని డాక్టరు చదివిద్దామని ఆయన ఊహ. కుటుంబ గౌరవం మీద ఎంత గురో, ఆ పిల్ల మీద అంత ఆపేక్ష ఆయనకు. ఈ రెండే ఆయన జీవితాన్ని నడిపించేవి. మా పిల్ల చిలకలా పలుకుతూ, పెరిగి, పెద్దదై చక్కగా చదువుకునేది. అలాటి పచ్చని సంసారంలో ఉన్నట్టుండి పిడుగు పడింది. ఆయనకు మతిపోయి, మానవత్వం మరిచిపోయారు.

మా పిల్ల కాలేజీలో చేరిన రెండవ సంవత్సరంలో మా ఇంట్లో గొడవలు ప్రారంభం.

అన్నీ నే సరిగా చెప్పలేను.

మా పిల్లకి 'మూడో మాసం' జరుగుతూండగా నా కంతకు ముందే తట్టిన అనుమానం నిజమని తేలింది. ఆయనకు తెలిస్తే దాని కంఠానికి ఉరి పోస్తారని నాకు తెలుసు. ఇంకో మాసం గడిచింది. దానికోరోజు వంట్లో నలతగా ఉంటే, నాతో చెప్పకుండా, ఆయన ఎంతో ఆదుర్దాతో డాక్టరును తీసుకొచ్చారు. డాక్టరు పరీక్ష చేసి వెళ్ళిపోతూ అసలు సంగతి ఆయన చెవిన వేసి పోయాడు.

'ఆ' సంగతి తెలిసిన రోజున ఆయన పడిన వేదన, దాన్ని చూసిన చూపు నే మరువలేను.

ఆయన ఎన్ని విధాల అడిగినా, ఎన్ని చేసినా అది 'ఎవరో చెప్పలేదు. సిగ్గుతో కుంగి పోయింది. తల్లినైన నాతో కూడా అది మనసు విప్పలేదు.

ఆయనకు పిచ్చి కోపం బయల్దేరి, పెరిగిపోయింది. రోజులు గడిచిన కొద్దీ అందరికీ ఈ సంగతి తెలిసిపోతుందని ఆయన ఆదుర్దా. కుటుంబ గౌరవం మంట కలిసిపోయిందని ఆయన ఆవేదన. ఏమీ చేయలేని ఆ పరిస్థితులలో నా బాధ. చివరకు నాటు వైద్యం చేసి 'అది' తప్పిద్దామని ఆయన ఆలోచించారు. ఆ సమయంలో అలా చేస్తే తల్లి ప్రాణానికే ముప్పని నేను అహర్నిశలూ దాన్ని కాపాడి అలా చేయనీయ లేదు. ఆ రోజుల్లో ఆయన పిచ్చెత్తినట్టు తిరిగే వారు.

ఓ రోజున జేబులో రూపాయ నోట్ల కట్టలతో ఇంటికి వచ్చారు. ఉన్న ఐదెకరాల పొలం అమ్మేసారట. ఆ ఊళ్ళో ఉంటే తనింక తలెత్తి తిరగలేరుట. అది తెలియక అమాయకత్వంలో చేసిన తప్పుకు స్వదేశం విడిచి, ఎక్కడో దూరంగా, కొత్త భాష , కొత్త జనం మధ్య కలిసిపోయి ఈ మచ్చ దాచుకోవాలని ఆయన ఊహ. ఎక్కడికో తెలీకుండా బలవంతాన మమ్మల్ని ప్రయాణం చేయించి 'నెల్లూరు' తీసుకొచ్చారు.

మా పెద్దమ్మాయికి అక్కడే ఆడపిల్ల పుట్టింది.

ఆ రోజుల్లో ఆయన చేసి పనిలోని క్రౌర్యం నాకీనాటికీ గుర్తుంది.

పిల్ల పుట్టిన పదమూడవ రోజున దాని బొట్టు చెరిపించేసారు. చేతి గాజులు బద్దలు కొట్టి, తెల్లచీర దానిచేత కట్టించారు.

ఆయన ఘోరమైన ఊహ నాకు కొంత వరకూ అర్థమైంది. ఆ పని ఆపబోతే పుట్టిన పిల్లని పీకి పిసికి చంపేస్తానన్నారు. దాంతో ఊరుకోవలసి వచ్చింది.

వయసులో ఉన్న పిల్లకి పెళ్లెందుకు చేయలేదన్న ప్రశ్న ఎక్కడున్నా వస్తుంది. ఆ అనుమానం ఎవరికీ కలగకుండా దాని జీవితం శాశ్వతంగా పాడుచేద్దామని ఆయన సంకల్పమనిపించింది. అలా చేస్తే అది చేసిన తప్పుకు తగిన శిక్ష అని ఆయన ఉద్దేశం కాబోలు.

ఆ పుట్టిన పిల్ల 'లక్ష్మి'. లక్ష్మిని మాకు పుట్టిన పిల్లగానే పెంచాలనీ, పెద్దమ్మాయి శాశ్వత వైధవ్యం నటిస్తూ తనకి పుట్టిన పిల్ల వేపు చూడనైనా చూడకూడదని - ఇవీ ఆయన ఆంక్షలు. ఆ ఆంక్షలు ఆయన అక్షరాలా అమలు జరిపారు.

లక్ష్మికి నెల నిండుతూండగా ఊరు మార్చి ఇంకో ఊరికి తీసుకొచ్చారు.

లక్ష్మిని నా పిల్లగా పెంచాను. ఓ పక్క పక్క గదిలో అసలు తల్లికి పాలు చేపుతూండగా, ఆయన ఆంక్షకు లోబడి, ఆ చిన్న కూనని పోత పాలతో నేనే పెంచాను. లక్ష్మికి తల్లిని అక్కగా జేసాం. కాని ఆ మాతృ హృదయంలో పొంగుతూన్న ప్రేమని ఆపగలమా?

తన దేశం విడిచి, తన ఆస్తి అమ్ముకుని, పరాయి దేశంలో కడుపు కోసం అన్నం అమ్ముకునే స్థితికి ఆ పిల్ల చేసిన ఆ నేరమే కారణమని ఆయన విశ్వాసం. దాంతోనే కక్ష సాధించారు - సాధిస్తున్నారు.

ఊరు నుండి ఊరు మార్పించేవారు. ఏ పనీ చేసేవారు కాదు. ఉన్న డబ్బు మూడేళ్ళల్లో ఐపో వచ్చింది. ఊరు మార్చి హోటలు పెట్టుకున్నాం. కాని ఎన్ని చోట్ల హోటలు పెట్టినా కలిసి రాలేదు. ఈ ఊళ్ళో కాస్త పచ్చగా ఉన్నాం. కాని ప్రజలు మమ్మల్ని చూడలేకపోయారు.

భగవంతుడు, కూతురు, ప్రజలూ - అందరూ కూడా తనకి అన్యాయం చేసారనే ఆయన కక్ష కట్టారు. అది కాస్తా లక్ష్మి మీదకు తిరిగింది. దాన్ని కాల్చుకు తినేవారు. కొట్టి బాధించేవారు.

ఇక ఇవాళ జరిగిన సంగతి : 'అక్కయ్యా నీకు బొట్టు బాగుంటుందని' అది వద్దంటూన్నా వినకుండా లక్ష్మి దాని మొహాన కుంకుమ బొట్టు దిద్దుతోంది. బొట్టు దిద్దుతూండగా ఆయన వచ్చారు. ఆయన కోపానికి అవధులు లేకపోయాయి. ఆ బొట్టు చెరిపి, పెద్దమ్మాయిని నానా మాటలూ అని, లక్ష్మిని చచ్చేట్టు కొట్టారు.

మానవుడు విధించిన శిక్ష - అందులోనూ నిర్దయతో కన్న తండ్రి విధించిన ఆ శిక్ష - భరిస్తూ అది శాశ్వత వైధవ్యం నటిస్తూ, తన పిల్లని చూసుకుని, పాలిచ్చి, ఆడించుకొని, పెంచి పెద్ద చేసే అవకాశం లేకపోతే - ఆ తల్లి మనసు ఎంత విలపిస్తుంది?

అంతా చూస్తున్న నా మనసెంత కాలం ఈ బాధ భరిస్తుంది?

ఆమె నిట్టూరుస్తూ ఆగింది.

'ఇంత ఘోరమా?' అన్నట్టుగా దూరంగా కుక్క ఎలుగెత్తి పెడుతూన్న రోదన.

ఈ కఠోర దుఃఖ గాథ తనలో ఇముడ్చుకోలేనన్నట్టు ఆకసం మబ్బుల్తో మూసుకుపోతోంది. ఒక స్త్రీ తెలియక చేసి తప్పిదానికి, పరువు కోసం తండ్రి విధించిన ఆ జన్మాంత శిక్షని విని కాబోలు నక్షత్రాలు వెల వెల బోయాయి.

ఈ విషాద సత్యం నామీద ఎంత తీవ్రంగా పని చేసిందో నే చెప్పలేను.

ఆ రాత్రి ఇంటికి వెళ్ళి పడుకున్నా నిద్ర లేదు.

పాపం! కుటుంబ గౌరవ ప్రతిష్టల కోసం, తప్పు చేసిన ముద్దుల కూతురిని క్షమించలేక, సొంత ఊరు, పొలం తెగనాడుకుని, ఎన్నో వేల మైళ్ళు ప్రయాణించి సత్యాన్ని మార్చి జీవిస్తూన్న అయ్యరు!

మోసమంటే తెలియని వయసులో మోసగింపబడి, తండ్రి చండశాసనానికి బద్ధురాలై, జీవన

నందనవనాన్ని శాశ్వతంగా ముళ్ళ కంపగా మార్చుకుని బతుకుతూన్న ఆ పడుచు!!

కూతురి వ్యథ సహించలేని ఆ తల్లి !!!

దుఃఖ భాజనమైన కుటుంబం.

దుఃఖ చిహ్నంగా లక్ష్మి.

పిలకతో, జిడ్డు ఓడుతూన్న ముఖంలో కోపం తప్ప మరేమీ లేని ఆ అయ్యరు మనోవల్మీకంలో ఇంత బాధ దాగి బుసకొడుతూందని ఎవరికి తెలుసు ?

మొదటసారిగా అయ్యరు మీద జాలి కలిగింది.

× × × × ×

పొద్దుటే పోస్టుమాన్ లేపాడు. టెలిగ్రాము అందించాడు. ఆత్రుతతో తీసుకుని చూసాను. 'మావగారికి బావుండలేదు. రమ్మ'ని ఉంది. శలవు పడేసి బయలుదేరి వెళ్ళాను. నేను వెళ్ళిన నాలుగు రోజులకు ఆయనకు బాగా కులాసాగా ఉంది. వచ్చేటప్పుడు భార్యా, పిల్లల్నీ తీసుకొచ్చాను. మంచి రోజూ అదీ చూసుకుని బయలు దేరేటప్పటికి పదిహేను రోజులు పట్టింది మళ్లా నా ఉద్యోగపుటూరు జేరేటప్పటికి.

ఆ రోజు ఇంట్లో భోజనం చేస్తూంటే అయ్యరు హోటలు జ్ఞప్తికి వచ్చింది. మొదట్లో ఆ భోజనం, ఆ ఇల్లు, ఆ వ్యక్తులంటేనే అసహ్యం. ఆ కుటుంబంలో దాగి ఉన్న రహస్యం, ఆ వ్యక్తుల హృదయాల్ని కలచి వేస్తూన్న వ్యథ అర్థమయ్యాక ఆ కుటుంబం మీద నాకు కలిగిన సానుభూతి - అన్నీ ఆలోచనల్లో కలిసి పోతున్నాయి.

రాత్రి భోజనం చేసి అయ్యరు హోటలు కెళ్ళాను. పక్కవాటా కింకా తాళం వేసి ఉంది. వీధి వసారాలో ఓ మూలగా తుండుగుడ్డ నెత్తిన వేసుకుని, నెత్తిన చేతులు పెట్టుకుని గొంతు క్కూర్చున్నాడు అయ్యరు. దైన్యానికి ప్రతిబింబంగా ఉన్నాడు. నన్ను చూసి ఇంట్లోకి చూస్తూ కళ్ళ నీళ్ళు తుడుచుకున్నాడు.

ఇంట్లోకి వెళ్ళాను. మంచం మీద బల్లిలా అంటుకుపోయి పడుకునుంది అయ్యరు పెద్దకూతురు. ఏ పది రోజుల నుండో ఆహారం లేనట్టుగా వాడిపోయి ఉంది వదనం. నిద్ర పోతోంది. కళ్ళ పక్కల నుండి నీళ్ళు కారుతున్నాయి. పక్కన కూచున్న లక్ష్మి చుట్టూ ఓ చేయి వేసి, రెండో చేత్తో లక్ష్మి రెండు చేతులూ పట్టుకునుంది. నిద్రలో కూడా ఆ బంధం విడవలేదు.

నన్ను చూసి అయ్యరు భార్య వెక్కి వెక్కి ఏడ్చింది. నేను వెళ్ళిన మూడు రోజుల తర్వాత నుండీ

పిల్ల జ్వరంతో, కలవరింతలతో వళ్ళు తెలీకుండా ఉందిట.

"ఎందుకొచ్చింది ఇంత జ్వరం?" అన్నాను.

"ఏం చెప్పమంటారు బాబూ! ఆ రోజున ఆయన అన్న మాటలు, చేసిన పని దాన్ని హడల కొట్టేసాయి. పైగా మమ్మల్నీ ఊరులో ఉండకుండా కూడా చేయాలని చూస్తున్నారు కొంతమంది. వెర్రి తల్లి! అసలే తండ్రి ఆ రాత్రి అన్న మాటల్తో కుమిలిపోతూంటే - అదే దొరికిందా వాళ్ళకి!" అని ఊరుకుంది దుఃఖంతో మాట రాక.

"ఏం జరిగింది?"

"వీధిలో వెళ్తూ ఈలలు, పిల్ల కనిపిస్తే చేయెత్తి పిలవడం, పనిగట్టుకు భోజనానికి వచ్చి, 'మీ పెద్దమ్మాయిని వడ్డించమనటం -' అన్నం అమ్ముకుంటున్నా పరువు అమ్ముకోలేదు కదా బాబూ! ఇవన్నీ చూసి ఆయన పిచ్చి కోపం....అన్నీ కలిసి దాని మనసు విరిచేశాయి. ఓ రోజు పెళ్ళున జ్వరం వచ్చి ఏక కలవరింతలు 'నాన్నా!' లక్ష్మినేం చేయక - తప్పంతా నాది, 'అమ్మా!' నేను మంచిదాన్నని వాళ్ళతో చెప్పి గొడవ చేయొద్దని చెప్పు' అంటూ, ఆఖరికి ఊళ్ళో ఉన్న పెద్ద డాక్టర్ని కూడా రానీయకుండా చేసారు. ఆయన రెండు రోజులొచ్చి మానుకున్నాడు. ఊళ్లో ఆచారి గారి మాత్రలు వాడుతున్నాం."

పక్క ఊరి నుంచి మంచి డాక్టరును పంపుతానని చెప్పి వచ్చేసాను. పంపాను కూడా. ఆయన రోజూ వచ్చి చూసేవాడు. పరిస్థితి ప్రమాదమేనని కూడా అన్నట్టున్నాడు.

నెల్లాళ్ళు గడిచిపోయాయి. ఆమె కోలుకుంటోందని విన్నాను. నా ఉద్యోగం, కాంప్‌లు, సంసారం వీటివల్ల ఈ మధ్య అట్టే వెళ్ళడం పడలేదు.

ఆ రోజు కేంప్‌కు వెళ్ళి బస్సు దిగాను.

ఎండ మండి పోతూంది. పన్నెండయింది. అయ్యరు ఎదురుగా వచ్చి నమస్కారం పెట్టాడు.

"సెలవు బాబూ! వెళ్ళొస్తాం" అన్నాడు.

"ఏమిటి సంగతి?" అన్నట్టు చూసాను.

"ఈ ఊరు విడిచిపోతున్నాం! ఇంకో ఊళ్ళో హోటలు పెట్టుకుంటాం."

"ఏ ఊళ్ళో!" అన్నాను. అన్నాక నా తప్పు తెలిసింది.

"ఒక ఊరనేమిటి బాబూ! ఏదో ఒకటి. మమ్మల్ని కాస్త పరువుగా బతకనిస్తే చాలు".

"అందరూ వెళ్తున్నారా?'' అన్నాను.

ఓ మూలకేసి చూసాడు అయ్యరు.

అయ్యరు కుటుంబం అక్కడ కూచున్నారు. ఆ పడుచుతో లక్ష్మి నవ్వుతూ దాగుడుమూత లాడుతోంది. అయ్యర్ని చూసి ఆ పడుచు లక్ష్మిని వదిలేసింది.

ఇంతలో అయ్యరు వెళ్ళే బస్సు వచ్చినట్టుంది.

అతను తొందరపడుతూ హడావిడిగా సామాను కేసి పరిగెత్తాడు. ఆ తొందరలో పంచ కాలిలో చిక్కుకుని ముందుకు పడబోయి ఆపుకొన్నాడు. అడ్డొచ్చిన కూలీ వాళ్ళని తోసేస్తున్నాడు. ఆయాస పడుతూ సామానంతా తెచ్చుకొని బస్సు మీద వేసుకున్నాడు. చెమటతో చొక్కా వంటికి అంటుకు పోయింది. భార్యనీ, పిల్లల్నీ తొందరగా ఎక్కమని తొందర చేస్తున్నాడు.

అతని ఆత్రుత చూస్తుంటే నాకు అనిపించింది - ఎంత వింత ఈ జీవితం? ప్రతి జీవితం ఓ రహస్యం. ఆ రహస్యపు గూడులో ఎన్నో ఆశలు, ఆశయాలు, మిగిలిపోయిన కలలు, అందుకోలేని బంగారు ఊహలు - అన్నిటితో జీవితం వింతగా పయనిస్తుంది.

కష్టాలకు, అడియాలకు రూపాంతరమైన అయ్యరు జీవితంలో నిత్యం సంఘర్షిస్తూ, ఓడిపోతూ, మనసులోని వ్యధ ఆపుకోలేక కుటుంబాన్ని బాధిస్తూ....ముందుకు పోతున్నాడు, దేన్నో వెతుక్కుంటూ.

ఎక్కడికో పోయి మళ్లా కొత్తగా జీవితం ప్రారంభించాలని ఆశ. అలా చేస్తే మాత్రం అతని లోని బాధ తగ్గుతుందా? అయినా అతడు పోరాడుతూనే ఉన్నాడు - పోరాడి ఏం నెగ్గాలో సరిగ్గా తెలీకపోయినా.

బస్సు బయల్దేర బోయింది.

నాకు నమస్కరించి అయ్యరు బస్సు ఎక్కాడు.

అతను నిలుచున్నచోట అతని వికృతమైన పెద్ద పాదాలు ఆ దుమ్ములో అడుగు జాడల ముద్ర వేసాయి.

జీవితంలో కనిన బంగారు కలలు మసి అయిపోగా, తాను ఊహించుకున్న పాలరాతి మందిరం చిన్నాభిన్నమై కూలిపోగా - నిత్య జీవితంలో కావలసిన వాళ్ళను రాసి రంపాన పెడుతూన్న వ్యక్తి విడిచి వెళ్ళిన అడుగులవి.

అయితేనేం? వాటి విలువ ఎనలేనిది.

గమ్యం ఆకళించుకోలేకుండా, ఏదో గమ్యానికి పోతున్నామనే ఊహతో ముందుకు పోతూన్న నిత్య ప్రయాణీకుని ముద్రలు అవి.

అతడు నిరంతర అన్వేషి. అన్వేషణ ఫలించడం కాదు ధ్యేయం, కనబడనిదాన్ని అన్వేషిస్తూ బతకడమే ఈ నిరంతర యాత్రికుని తాపత్రయం.

మానవుని తాపత్రయం తాలూకు చిహ్నాలైన ఈ అడుగు జాడలు పృధివంతా ఆవరించుకొన్నాయి.

*(ఆంధ్ర సచిత్ర వార పత్రిక : 7-2-1964)*



# లౌక్యుడు

కూతురి పెళ్ళి చేశాడు కిష్టమూర్తి.

ఎవరైనా సరే ఆడపిల్ల పెళ్ళి చేస్తే, 'పోనీలే, ఏదో వొహటి, మొత్తానికి చేసేశాడు,' అని అందరూ అనుకునే 'ఈ' రోజుల్లో చాలా మంది అలా అనుకోలేదు.

చాలా మంది చాలా ఆశ్చర్యపడ్డారు.

ఎందుకంటే కిష్టమూర్తి పిల్లని చేసుకున్న వాళ్లకి ఆస్తి మరీ బొత్తిగా ఎక్కువగా ఉంది. బోలెడంత భూమీ, పుట్రానూ.

అంచేత చాలా మందికి ఆశ్చర్యం - కిష్టమూర్తిలాటి 'సంసారి' అలాటి సంబంధం ఎలా తేగలిగాడా అని.

నిజానికి కిష్టమూర్తి 'సంసారి' కాడు. పెళ్ళాం, పిల్లలూ ఉన్నవాడు తప్పక సంసారేనంటే ఏం చెప్పలేను.

అతనికో భార్య ఉంది. అది అందరికీ తెలిసిన విషయమే.

ఆమె కాకుండా అతనికి వేరే ఓ 'మనిషి' ఉంది. ఇది చాలా మందికి తెలీదు.

వీళ్ళిద్దరూ కాకుండా అతనింకా చాలా మందితో గుట్టుగా గుడుపుకొస్తున్నాడు.

అతన్ని నిందించి ప్రయోజనం లేదు.

సంపెంగకి ఆ సువాసనెలా అబ్బిందో, గులాబీ రేకులకి ఆ అందం ఎలా వచ్చిందో, కొంతమందికి మజ్జిగ పులుసంటే ఎందుకంత ఇష్టమో... అలాగే ప్రకృతి సిద్ధంగా అతనూ అంతే!

- ఇది కిష్టమూర్తి అనుకున్న విషయం.

వచ్చిన చిక్కెక్కడంటే అతని భార్య అలా అనుకోలేకపోయింది.

అతగాని భార్య మన వాళ్ళ మాటల్లో కొంచెం 'సత్తెకాలం మనిషి'.

కిష్టమూర్తి నలుగురికీ తెలుస్తుందని అనుకోండి, మరెందుకైనా అనుకోండి, తన పనులు నిశ్శబ్దంగా రగడ లేకుండ జరుపుకొస్తున్నాడు.

కథాకాలం నాటికి అతనికి పదిహేడేళ్ళ పెళ్ళి కాని పిల్ల సరోజ, ఇద్దరు మొగపిల్లలు - చిన్నవాళ్ళే లెండి, ఓ ముప్ఫై నాలుగేళ్ళ పెళ్ళాం నిక్కచ్చిగా ఉన్నారు.

ఓ రోజు రాత్రి మూడింటికి నరసమ్మ - అంటే కిష్టమూర్తి నిజ భార్య - పొరిగింటి వాళ్ళ నూతి దగ్గర బాదం చెట్టు నీడలో, వెన్నెల వెలవెలబోతూన్నప్పుడు, కిష్టమూర్తి వొళ్ళో పొరుగింటి సావిత్రి చాలా సుఖంగా పడుకునుండటం చూసింది.

అంత సుఖంగానూ కిష్టమూర్తి ఆమెనానుకుని వున్నాడు.

రాత్రివేళ పెరట్లోకొచ్చిన నరసమ్మ దొడ్లో మొండిగోడ దగ్గర్నించి చూసిన ఈ దృశ్యం మొదట్లో నమ్మలేకపోయింది. కన్ను చెదిరిపోయింది.

'వెన్నెల్లో నీ చెక్కిలిగుంట ఎంత బావుందనీ!' ఇవి సాక్షాత్తూ కిష్టమూర్తి మాటలు.

ఇలా రోజూ అంటూనే వున్నాడు. అతనికి ఇవాళేం కొత్త లేదు.

గోడ మీద వొరిగి చూస్తున్న నరసమ్మకి చాలా కొత్తగానూ, ఎంతో బాధగానూ తోచాయి ఆ మాటలు.

'పోదురూ...' సావిత్రి బొంగురు గొంతు ఆ నిశ్శబ్దంలో వెగటుగా తోచింది నరసమ్మకి.

ఇక చూళ్ళేక పోయింది.

ఇంట్లోకొచ్చి లైటు వేసి అద్దంలో మొహం చూసుకొంది. ఎవరి మీద కోపగించాలో తెలీలేదు పాపం ఆ సత్తెకాలం మనిషికి.

ఆమె కళ్ళు చాలా తీక్షణంగా మెరుస్తున్నాయి. అద్దానికి పక్కగా తనూ, భర్తా చిన్నప్పుడు తీయించుకున్న ఫోటో.

అప్పటి అందం, మెరుపూ ఇప్పుడు నరసమ్మలో లేవు...అది ముందు గ్రహించిన వాడు కిష్టమూర్తి.

తనలో మార్పు వచ్చిందనుకొంది నరసమ్మ.

తను కోరి మారిపోలేదే?

తను ముగ్గురి బిడ్డల తల్లి.

- కిష్టమూర్తితో పంతొమ్మిదేళ్ళ సంసారం.

... తనిలా ఐపోయింది.

- కారణం కనిపిస్తూనే వుంది.

'తన్ని నాశనం చేసి సావిత్రితో కులుకుతున్నాడు'. మండిపోయింది నరసమ్మ.

అసలు గొడవెక్కడంటే నరసమ్మ భర్త 'కృష్ణ లీలలు' ఇన్నేళ్ళూ చూళ్ళేదు సరిగదా వినలేదు గూడానూ.

పొద్దుటే చేతిలో చిన్నసంచీతో 'అబ్బ! వెధవ ప్రయాణం, వెధవ రైలూనూ, హుస్సు!' అంటూ దిగాడు కిష్టమూర్తి.

"కాఫీ ఐందా?"

"అదేం చేస్తుంది. వెళ్ళిన ప్రయాణమేమైందీ?" నరసమ్మ కంఠస్వరం అంత సుముఖంగా లేదని గ్రహించాడు.

"ఆ...మరే...వెధవది, మనం వెళ్లినప్పుడే ఆ రామయ్యగారు వూళ్ళో ఉండకపోవడం" అంటూ మొదలెట్టాడు.

"అలా సావిత్రి చెప్పిందా?"

ఉలిక్కిపడలేదు కిష్టమూర్తి. ఇలాటి సందర్భాల్లో అతనికి కొట్టినపిండే - భార్యతో ఇదే మొదటిసారైనా.

"రామయ్యగారి పెళ్ళాం పేరు సావిత్రా ఏవిటీ?"

"రామయ్యగారి పెళ్ళాం పేరు సావిత్రో, దమయంతో నాకేం తెలుసు. రాత్రంతా మీతో గడిపినన పక్కింటి సావిత్రి మాట నేననేది."

"భలేదానివే మన పక్కింట్లో వున్న పిల్ల పేరు సావిత్రా?"

"మరే. పిల్లే అది - కూచి, ముప్ఫై ఏళ్ళు వచ్చి... ఇంకా పిల్లే, మీరూ బాలా కుమారులే."

"ఏమిటి నీవనేది...?"

"నా ఖర్మ! నేననేవేవి బావుంటాయి? దాని మాటలు బావుంటాయిగాని. లేకపోతే దానికేం పొయ్యేకాలం...పండంటి సంసారంలో నిప్పులొయ్యడానికి. ఐనా దాన్నని ఏం ప్రయోజనం - మన బంగారం మంచిది కానప్పుడు. ఇంట్లో ఈడొచ్చిన పెళ్ళికాని పిల్ల ఉందాయె - దాని పెళ్ళీ పెటాకులూ లేవు కాని....హవ్వ!" అంటూ నోరు నొక్కుకుంది నరసమ్మ.

"పిల్ల దాని పెళ్ళి మాటేనా? సరోజ పెళ్లి నిమిషాల మీద చేసేయనూ" మాట తప్పించబోయాడు.

"ఏవిటా దాగుడుమూతలు, అసలు సంగతి వదిలేసి. ఇన్నేళ్ళొచ్చి మగాడికి ఆ మాత్రం బుద్ధి నిలవలేనప్పుడు...." ఆయాసపడుతూ ఆపేసింది.

కిష్టమూర్తి ఒకందుకు సంతోషించాడు. భార్యకు ఇరత సంగతులు తెలీవు. ఇదే ప్రథమం.

'వెధవది! పక్కిల్లే గదా; సావిత్రి ఆ మాత్రం చూసుకోవద్దూ' అని సావిత్రి మీద చిరాకు పడ్డాడు కిష్టమూర్తి మనసులో.

అసలు కిష్టమూర్తి భార్య దీనికింత రాద్ధాంతం లేవదీస్తుందని గ్రహించి ఉంటే తన జాగ్రత్తలో తను ఉండేవాడు.

తన సంగతి ఆమెకు పూర్తిగా తెలీకపోయినా చూచాయగా తెలిసే ఊరుకుంటోందన్న దురభిప్రాయంలో వున్నాడతగాడు ఇన్నాళ్ళూ.

భోజనాలవేళ "అదికాదు నరుసూ..." అంటూ ఏదో సర్దబోయాడు.

"ఇంకా ఆ పిలుపెందుకూ? ఇన్నాళ్ళు సంసారం చేసి ఆ మాత్రం బుద్ధి సరిగాలేని మనిషి దగ్గర నేనుండలేను. మా పుట్టింటికి పోతా. కాకపోతే మరీను...ఇంట్లో పెళ్ళి కావలసిన ఈడొచ్చిన పిల్ల ఉండగా, దాని ఇది ఇదైపోనూ, రామ రామ, దాని చెక్కిలి గుంటట, వెన్నెల్లట....ఇదంతా దాని మీద ప్రేమే కాబోలు, ప్రేమ 'సడాగం' బాగానే ఉంది" వెటకారంగా అంటూ నరసమ్మ తారాపథానికి లేచింది.

కిష్టమూర్తి భార్య మాటలు వినడం లేదు. ఊరికే నవ్వాడు.

ఇంట్లో ఉన్న 'ఈడొచ్చిన' పిల్ల సరోజ వింటోంది. కాని సరోజకి తల్లి చివరి మాటలేం రుచించలేదు.

అమ్మ అలా అంటుందేవిటీ?

అమ్మకేం తెలుసు మహా అలా అనెయ్యడానకి, ప్రేమట! ప్రేమ అని వెటకారంగా.

తనతో సుందర్రావు ఏమన్నాడు మొన్న చీకట్లో చెయ్యి నొక్కుతూ. 'ప్రేమకి కులం, డబ్బు వీటితో సంబంధం లేదు. హృదయం ప్రధానం. నువ్వు నా జీవితానికి పూలబాట - అబ్బే, అది కాదు ఇంకా ఏదో ఎంతో చక్కగా అన్నాడమ్మా అనుకుంటోంది 'ఈడొచ్చిన' సరోజ.

అన్నట్టుగానే నరసమ్మ మొగపిల్లలిద్దర్నీ తీసుకుని పుట్టింటికి బయల్దేరింది., "ఇక ఈ ఇంట్లో అడుగు పెట్ట"నని నోటీసిస్తూ.

నరసమ్మ పుట్టింటికి వెళ్ళినందుకు ఎవరూ అట్టే విచారించలేదు - ఓ నెల్లాళ్ళ తర్వాత నరసమ్మ తప్ప.

సరోజ ఎగిరి గంతేసింది.

సావిత్రి పెద్దది కాబట్టి గంతులెయ్యలేదు.

సరోజ ఎగరడానికి బోల్డు గ్రంథముంది. సుందర్రావూ తను చాలా ప్రేమించుకున్నారు...అలా సుందర్రావు చెప్పలేదూ?

కాని చిక్కేక్కడంటే, నరసమ్మ ఉండగా సుందర్రావుకు సరోజని కలుసుకోడానికి అట్టే వీలుండేది కాదు.

ఇప్పుడో? .... లైన్ క్లియర్.

× × × × × ×

అకస్మాత్తుగా పిల్లల్తో దిగిన నరసమ్మని చూసి తల్లి ఆశ్చర్యపడింది. అన్నగారు ఆశ్చర్యపడినా ప్రకటించలేదు. భోజనాలయాక సావకాశంగా కూచుని, "ఉత్తరం ముక్కేనా రాయకుండా వచ్చేశావేమే, అన్నయ్య వచ్చునుగా స్టేషన్కి" అంది సుబ్బమ్మ కూతురు నుద్దేశించి.

తల్లి సామాన్యంగానే అన్న ఈ మాటల్లో 'ఉత్తరమేనా రాయకుండా రాడంలో అంతరార్థం ఏమిటి?' అని ధ్వనించింది నరసమ్మకి.

తల్లి అలా అనడంలో సబబుంది. మొన్న నరసమ్మ అన్నగారు వచ్చి తీసుకువెళ్తానంటే 'ఆయనా, పిల్లా ఉండలేరు; పండక్కి వస్తా'నని నరసమ్మే సాగనంపింది అన్నగార్ని.

అది జరిగి నిండా పదిహేను రోజులవలేదు.

'ఏవమ్మా వొదినా, మొన్న ఆయనొొచ్చినప్పుడు అన్నగార్ని వదిలి రాలేనన్నావుటగా?' అంది సాగదీసుకుంటూ నరసమ్మ అన్నగారి భార్య.

సాయంత్రం దొడ్లో బియ్యం కడుగుతూన్నప్పుడు గోడవతలనించి రత్తమ్మ కేక : 'ఏవమ్మోయ్ నరసమ్మా!.... ఎప్పుడొొచ్చావ్? - విశేషంతో ఏవైనా వచ్చావా?'

ఎవరికీ సమాధానం చెప్పదల్చుకోలేదు నరసమ్మ.

'వెధవ పల్లెటూరు. అందరి గొడవా వీళ్ళకే కావాలి!' విసుక్కుంది.

రోజులు గడుస్తున్నకొద్దీ నరసమ్మ చిరాగ్గా ఉంది. అందరి మాటకేం గాని, తల్లికి సమాధానం చెప్పలేకపోతోంది.

"మాటా మాటా వస్తే మాత్రం!....కోపంతో వచ్చేస్తే మనకే నష్టం! మాట పట్టింపులకి పోతే సంసారం నడవడమెలా?"

"మాట పట్టింపు వచ్చిందని ఎవరు చెప్పారే?"

"అదికాదే వేరే చెప్పాలీ? ఏదో మనమే సర్దుకుపోవాలి గాని."

"అబ్బ! వూరుకోవే..." విసురుగా లేచిపోయింది నరసమ్మ.

ఏవిటోగాని నరసమ్మకి రాను రాను ముళ్ళ మీద కూచున్నట్టుగా ఉంది. ఎవరూ ఏమీ కష్టంగా అనకపోయినా అందరి మాటల్లో ఒకటే ధ్వని. తల్లిగాని, ఆఖరికి అన్నయ్యగాని తన్నిక్కణ్ణించి పొమ్మనడం లేదు - అది నిజం.

అయితేం? - అందరి భావం తనా సంసారం జరుపుకోవాలనే.

'వచ్చే పున్నంకి రెండు నెలలు దాటి పోతాయి వచ్చి,' అనుకుంది.

మధ్యాహ్నం చుట్టుపక్కల అమ్మలక్కలంతా నరసమ్మ ఇంట్లో గళ్లు గీస్తున్నారు పచ్చీసు ఆడటానికి.

"అవును కానీ, సుబ్బమ్మత్తా, వెనక వీధి సూరమ్మ కూతురు..." అని ఆపేసింది. శేషమ్మ, 'ఆ కూతురెవరో తెలుసా' అన్నట్టు.

"ఊఁ. సుబద్రమ్మ గదూ"

"మడే. సుబద్రమ్మే" అని మెటికలు విరుచుకొని, "ఏం చేసిందో తెలుసా?" అని పూర్తి చేసింది

శేషమ్మ.

చాలా జతలకళ్ళు ఆమె వంక 'ఏం చేసిందో' వినడానికి ఆత్రంగా చూస్తున్నాయి.

కొంచెం దగ్గరగా జరిగి, "ఏం చేసిందో, శేషమ్మొదినా!" అంది ఒకావిడ.

"మీకు తెలీదూ? నాచేత వాగించడానికి గాని, నేనేదో మహా తెలిసినట్టు మొదలెట్టబోయాను," అని ఊరుకొంది శేషమ్మ.

ఈ దెబ్బతో 'సుభద్రమ్మ ఏం చేసిందో' అన్న విషయం - చెప్పడానికి తగ్గ 'క్లైమాక్స్' పూర్తిగా అందుకొంది.

"చెబుదూ శేషమ్మత్తా!" అన్నాయి రెండు కంఠాలు.

'ఏం లేదర్రా! మొగాడు తిరిగి తిరిగి వస్తాడా; ఏ కళ్ళనున్నాడో ఓ రోజు రెండు బాదాట్ట - అంతే పుట్టింటికి వచ్చేసింది. మగాడన్నన తర్వాత ఆ మాత్రం కొట్టడా, మనం తినగూడదా? చోద్యం మరీను.'

"కాదు మరీ?" అని సాగదీసింది. మొగుడు చేత తెల్లవార్లూ దెబ్బలు తిన్న పేకాట రాయుడు నారాయణ పెళ్ళాం.

"అవునా మరి. దాన్తో లేచి వచ్చేయడమే! హవ్వ! మొన్న మా కోడలు చూసిందిట.... ఆ సూరయ్యగారి పత్తెంతో ఏక గుసగుసల్ట అది - అబ్బ! ఈ నోటితో చెప్పలేను బాబూ" అంది శేషమ్మ అంతా ఆ నోటితోనే చెప్పేసి.

ఆటలో కూచున్న నరసమ్మకి బల్లెం గుచ్చుకున్నట్టుగా ఉంది.

సుభద్రమ్మని తనెరుగు. దాని మొగుడు తాగుతాడని అందరూ ఎరుగుదురు.

మొదట్లో ఈ వూళ్ళో వాళ్ళే 'మొగుడు తాగి కొడ్తాట్ట' అని విడ్డూరంగా చెప్పుకుని, సుభద్రమ్మ మీద చాలా సానుభూతి చొలకబోశారు.

సుభద్రమ్మ మొగుడు తాగుడుకి పెళ్ళాం వస్తువులన్నీ అమ్మేశాడు.

పెళ్ళాం వంటి మీద వస్తువులయిపోవడంతో తాగి వచ్చి కొట్టే మొగుడు, తాగడానికి డబ్బులేక వస్తువుల్లేని 'అర్ధాంగి' వంటి మీద పట్టించాడు. 'వస్తువులు చేయించుకు మరీ రమ్మని' పుట్టింటికి తోలేశాడు.

ఆ తర్వాత రెండు రోజులకి చెరువు గట్టున నరసమ్మతో చాటుగా చెప్పుకుని ఏడ్చింది సుభద్రమ్మ: కొడుక్కి కాస్త పాఠం చెప్పమని ఆ 'సత్తా'న్ని అడిగిందట. ఆయనా రెండురోజులొచ్చి తర్వాత మానేశాట్ట.

ఇదీ జరుగుత. ఇంతకు మించి ఏం జరిగినా మళ్ళీ జన్మలో పురుగుల్లో పుట్టా' అని.

ఈ జన్మలో 'ఇంత' సుఖపడ్తూన్న సుభద్రమ్మ ఏడుపులో కూడా పునర్జన్మ కోరుకుంది. భారత స్త్రీ మరి!.... వాసన పోదుగా!

'సుభద్రమ్మ నిప్పులాంటి మనిషి. ఎవరిక్కావాలి నిజానిజాలు,' అనుకొంది నరసమ్మ.

'కొన్నాళ్ళుపోతే నన్నూ....' ఆలోచన సాగలేదు నరసమ్మకి. వొళ్ళంతా జెర్రులు పాకినట్టయింది.

"అమ్మా! సాయంత్రం బండికే ప్రయాణమేవ్!" అరిచింది నరసమ్మ.

ఎంత సడెన్‌గా వచ్చిందో అంత ఇదిగానూ వెళ్ళిపోయింది.

'కాస్త చలిమిడీ, మిఠాయీ చేసిస్తానుండవే, రేపటి దాకా,' అన్న తల్లి మాటలు కూడా వినలేదామె.

× × × × × ×

"అంతా కులాసా...?" అన్నాడు కిష్టమూర్తి భార్యని చూసి.

"ఆ..."

"నరుసూ!..." అంటూ రాత్రి దగ్గర జేరిన భర్తని ఇట్టే క్షమించగల్గింది నరసమ్మ. ఏదో కాలు జారాడని సద్దుకొంది.

కాని వచ్చిన రెండు రోజుల్లోనే పరిస్థితి చాలా దూరం వెళ్ళిందని గ్రహించింది.

ఈసారి కిష్టమూర్తి విషయం కాదు.

కూతురు సంగతి అర్థం కాలేదు. కూతురి ఏ పుస్తకంలో చూసినా ఉత్తరాల కట్టలూ, కింద సుందర్రావు సంతకాలూనూ.

'ఎవడీ సుందర్రావు?;' అనుకొంది.

"ఏవిటే ఈ ఉత్తరాలు?" అంది కూతురితో.

"సుందర్రావు రాశాడు లేవే..." అంది యాధాలాపంగా సరోజ.

"సుందర్రావెవడే? ఎందుకు రాయాలి?"

కిటికీలో కూచుని సుందర్రావు గురించి మధుర స్వప్నాలు కంటూన్న సరోజ ప్రపంచంలో పడింది.

"ఆ...మరే...అబ్బే, సుందర్రావేనా..." ఎలా పూర్తి చేయాలో తెలీలేదామెకు.

అసలు తల్లి ఇంట్లో లేకపోవడంతో సరోజ, సుందర్రావూ అసలైన, సిసలైన 'ప్రేమ'లో మునిగిపోయారు.

ముద్దుగా ఉత్తరాలూ, తియ్యగా కబుర్లూ.....

'నా జీవిత చక్రానివి నువ్వు' అనేవాడు సుందర్రావు.

జీవితానికి 'చక్రమేవిట'న్న అనుమానం తట్టినా ఊరుకునేది సరోజ.

'మన ప్రేమకి అడ్డులే,' దన్నాడు సుందర్రావు.

సరోజ చూసిన సినీమాల్లో ఈ మాట చాలా సార్లు వింది కాబట్టి అర్థం కాకపోలేదు.

కొంత ప్రేమ కవిత్వం చదివి వినిపించాడు. తనూ అల్లబోయాడు.

ఆరోజు రాత్రి నరసమ్మ, " ఆ సుంద్రావెవడండీ? ఆ వుత్తరాలేవిటి? - ఏవిటో ' నా జీవిత చక్రమా, పూలరథమా, గులాబీలన్నీ పోగు చేస్తే నువ్వు మొలిచావు', అంటా దేవిటి ఉత్తరాల్లో?" అంది.

"అదంతా కవిత్వం లేవే! అతను మన ఎదురింటి నరసింహంగారి అబ్బాయి", అని నవ్వాడు కిష్టమూర్తి.

"నవ్వుతారేవిటండీ? దాన్ని కాస్త అదుపులో పెట్టండి. అంత పట్టించుకోకుండా కళ్ళు మూసుక్కూంచుంటే ఎలా?"

నిజానికి కిష్టమూర్తి కళ్ళు మూసుకు కూర్చోనూ లేదూ - పట్టించుకోకుండానూ లేదు.

భార్య పుట్టింటికి వెళ్ళినప్పటి నుండి వాళ్ళిద్దరి సంగతీ పూర్తిగా తెలుసు అతనికి.

కిష్టమూర్తిది చాలా 'కాలుక్యులేటింగ్ బ్రెయిన్.'

మొదట్లోనే 'ఉష్' అంటే సుందర్రావు లాంటి బంగారు పిచ్చుక ఎగిరిపోతుంది.

ఐతే - అది సుతరామూ కిష్టమూర్తికి ఇష్టం లేదు.

కూతురి పెళ్ళికి ఓ మోస్తరు సంబంధానికైనా ఐదారు వేలు గుమ్మరించాలి.

అలా వేలు గుమ్మరించాలనీ లేదు కిష్టమూర్తికి.

ఇదంతా సత్తెకాలం మనిషి నరసమ్మకేం తెలుసు?

ఓ రోజు కూతురు చెవిలో ఏదో ఊదాడు కిష్టమూర్తి.

కూతురు ఊహు సిగ్గుపడి పోయింది. - కథా నాయకిలా.

అర్థరాత్రి ఎదురింటి నరసింహంగార్ని సుందర్రావు తండ్రిని - కిష్టమూర్తి లేపాడు.

"ఏవండీ?" అంటూ వచ్చారు నరసింహంగారు.

"మీతో ఓ విషయం మాట్లాడాలి..."

కిష్టమూర్తి శాంపిల్‌గా ఓ అరడజను ఉత్తరాలు ఓపిగ్గా చదివ్వినిపించాడు.

నరసింహంగారు ఓ విషయానికి చాలా ఆశ్చర్యపడ్డారు: 'తెలుగులో సరిగ్గామాట్లాడ్డమైనా రాని మావాడికి ఇంత కవిత్వమెలా అబ్బిందా?' అని. పైగా ఆ ఉత్తరాలు చూశాకే ఆయనకి ఓ పిల్లని అన్నిరకాలుగా ముద్దుగా పిలవ్వొచ్చన్న విషయం మొదటిసారిగా తెలిసొచ్చింది.

"ఇంతకీ ఏ వంటారూ?" కొంచెం చిరాగ్గా అన్నారు నరసింహంగారు.

"నేనేమీ అనను. మీవాడనేదే వినండి." అని కిష్టమూర్తి ఊరి బయట దేవాలయం ప్రక్కనున్న గంగరావిచెట్టుదగ్గరకి తీసుకెళ్ళాడు.

అక్కడ చాలా సౌఖ్యంగా కూచున్నారు సుందర్రావూ, సరోజ.

"వెధవ్వేషాలు! వెధవ!" అంటూ ముందు కురకబోయారు నరసింహంగారు.

సుందర్రావు చాలా ధీమాగా అంటున్నాడు - "నిన్ను తప్ప ఇంకోళ్ళని చేసుకోను. నువ్వు కావాలి నాకు.........."

"మీ వాళ్ళు ఒప్పుకోకపోతే....." మధ్యలో మృదువుగా అడిగింది సరోజ.

"ఎదిరిస్తాను. అప్పటికీ ఒప్పుకోకపోతే, ఇదిగో ఈ సీసాలో ఏం వుంది-విషం! ఇది తాగి ఇద్దరం వీరస్వర్గం...కాదు కాదు.... ప్రేమస్వర్గం చూరగొందాం. అక్కడ కలుసుకొందాం. అక్కడ మనల్ని అడ్డే చట్టాలుండవు......"

గుండె బాదుకున్నారు నరసింహంగారు. "వీణ్ణి తల్లి పోయిన్నప్పటినించీ కంటికి రెప్పలా చూసుకుంటున్నాను. అందరూ పోయి వీడొక్కడూ మిగిలాడు...వీడి మీదే నా ప్రాణాలు. ఇప్పుడు వీడు విషం, స్వర్గం, చట్టాలూ అంటాడేవిటీ?"

ఆయనకి మతిపోయినంత పనైంది.

"నేనేం కాదన్నానండీ కిష్టమూర్తిగారూ! వాడిష్టం. వెధవ-విషమంటాడేవిటీ?..... అది ముందు లాక్కుందురూ వాడి దగ్గర్నించి" అని ఇంకా చాలా కంగారుపడ్డాడాయన.

కిష్టమూర్తి సన్నగా నవ్వుతూ, "కంగారెందుకండీ. ముందు అతనిష్టం కనుక్కుంటే...." అంటున్నాడు.

"ఇంకా కనుక్కోడమెందుకండీ... కనపడుతూవుంటే. వాడిష్ట ప్రకారమే కానిద్దాం."

× × × × × ×

**కి**ష్టమూర్తి కూతురి పెళ్లి సుందర్రావుతో 'ఫెళ్ళు'మని చేసేశాడు-కానీ కట్నం లేకుండా.

పెళ్లయిపోయాక సరోజ, సుందర్రావుతో, "నాన్న భలే ప్లాను వేశాడు. మీ నాన్నగారు మీ చేతిలోది నిజంగా విషమేమోనని... ఇంక చూసుకో ఆ కంగారూ... నాన్న చెప్పాల్సిందే" అని విరగబడి నవ్వింది.

కూతురి పెళ్లయాక కిష్టమూర్తి స్వవిషయంలో చాలా జాగ్రత్తగా వుంటున్నాడు.

గమ్మత్తేమిటంటే నలభై ఏళ్ల కిష్టమూర్తి మళ్ళా ఏడు ఒక్కసారే తండ్రీ, తాత కూడా ఐవూరుకున్నాడు.

అతను లౌక్యుడు........సంసారి మరి!

*(ఆంధ్ర సచిత్ర వారపత్రిక : 8-4-1959)*



# వంతెన

రోడ్డు కిరువైపులా అర్థంలేని గడ్డిపూలు, పసుపుపచ్చని గడ్డిపూలు. ఏ ప్రక్క చూసినా ఎత్తు పల్లాలతో పెద్ద కొండలు. దూరానికి నున్నగా కనిపించే రాతి బండలు. ముందర నల్లని తివాసీ పరిచినట్టుగా తారు రోడ్డు ఎండకు పదునెక్కి మెరుస్తూన్న తళతళలాడే రోడ్డు. ఆ రోడ్డుని నలభైమైళ్ళ వేగంతో దాటే 'జీప్'. ప్రక్కన సిగరెట్ కాలుస్తూ, యోగ ముద్రలో వున్న మౌనిలా శంకరం. ఉన్నట్టుండి అతని పెదవుల చాటున మెరిసి మాయమైన చిరునవ్వు. రోడ్డుకు ప్రక్కగా చెట్టు నీడను ఊసులాడుకుంటూన్న 'ఎంకీ, నాయుడు బావ'లు. సరసమాడుతూన్న నాయుడు బావని గోముగా చూస్తున్న ఎంకి. డ్రైవరు రాజు కళ్లల్లో చిలిపితనం. అంతలో బ్రహ్మజెముడు డొంకలో మెరుస్తూన్న అరచేయంత పెద్ద పువ్వు. జీప్ అపుజేసి, ఆ పువ్వు కోసుకోవాలని నా ఆరాటం. నా కోరిక తెలిస్తే శంకరం నవ్వుతాడేమోనని సంశయం.

ఆ కోరిక మనసులోంచి చెరిపేసి చుట్టూ చూశాను. అన్ని వైపులా కొండలు. ఆ కొండలు దగ్గరవుతూన్నట్టు, అవి అన్ని వైపుల నుండీ ముట్టడిస్తున్నట్టు అనుభూతి. అవి నన్ను బిగించివేస్తున్నట్టుగా ఆధారం లేని నా ఆలోచన.

ఈ ఆలోచనలూ, ఆరాటాలూ నన్ను వదలవు. నా అర్థంలేని కోరికలు నన్ను వెంటాడుతాయి. ?ిలవనివ్వవు. ఏది కావాలో తెలీని అసంతృప్తి. మేలుకువూ సుషుప్తి. మనసులో మూర్ఛ.

శంకరం నవ్వగలడు. డ్రైవరు రాజు కళ్లలో చిలిపితనం తొణకిసలాడుతుంది. నాయుడుబావ, ఎంకీ లోకాన్ని మరిచి ఊసులాడుకోగలరు. గడ్డిపూలు కూడా పచ్చగా మెరిసి ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. బ్రహ్మజెముడు డొంక కూడా పచ్చని, పెద్ద పూవులను సృష్టించి హసిస్తోంది.

నాలోనే ఈ చీకటి, ఈ వ్యధ, ఈ అసంతృప్తి.

వెంటనే ఏదైనా చేసి ఈ అసంతృప్తినీ, నిస్సహాయతనూ తొలగగొట్టాలి.

జీప్ అపుచేయించాను. ఆశ్చర్యపోతూ రాజు వెనక సీట్లోకి చేరేడు. స్టీరింగ్ ముందు కూచుని, ఒక్క

మాటుగా స్టార్టు చేసి, వేగంగా, అతి వేగంగా నడిపేను. రాజు ముందుకు తూలి అపుకొన్నాడు. శంకరం నా కేసి ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

అరవై మైళ్ళ వేగంతో ఇంటికి తీసుకొచ్చాను.

నుదుటి మీద చెమట తుడుచుకుంటూనే సోఫాలో ఒరిగాను.

ఆ వేగం, ఆ సంచలనం, నాకేమీ సంతుష్టిని కలిగించలేదు.

శంకరం నా 'మూడ్' కనిపెట్టినట్టున్నాడు. 'టై' విప్పుకుంటూ "రాత్రి 'షికార్' వెళ్దాం. ఏర్పాటు చేయమని రెడ్డికి కబురు పంపుతాను" అన్నాడు.

"వద్దురా. నాకు ఇంటికి వెళ్ళి పోవాలని ఉంది. సాయంత్రం బయలుదేరుతాను."

ఓ క్షణం ఆగి "ప్రయత్నం మీదనైనా మనసు మార్చుకోవాలన్నయ్యా. ఎన్నాళ్ళని ఆ స్మృతులతో బాధపడతావ్? ! శకుంతల వదిన నిన్నింత ఒంటరివాణ్ని చేసేసి, అలా వెళ్ళిపోవడం చాలా దురదృష్టం" అన్నాడు శంకరం.

శంకరం కేసి చూశాను. వాడు తల దించుకొని ప్రక్క గదిలోకి వెళ్ళిపోయాడు. వాడు మా పినతండ్రిగారబ్బాయి. నాకంటే చిన్న వాడు నన్ను గురించి అంతా అర్థమయినట్టు మాట్లాడుతున్నాడు.

శకుంతల హఠాన్మరణం నాలో ఈ 'వాయిడ్' సృష్టించిందని వాడి నమ్మకం. మా బంధువులందరి నమ్మకం కూడా అదే. కాని అది నిజం కాదని నాకు తెలుసు. అయినా ఆ విషయం ఈనాడు అందరికీ నేనెందుకు పైకి చెప్పాలి?

శకుంతలకూ, నాకూ మధ్య చాలా అగాధం వచ్చేసింది. కావాలని ప్రయత్న పూర్వకంగా ఎవ్వరూ సృష్టించక పోయినా, ఆ అగాధం పూడ్చలేమని ఇద్దరికీ తెలిసిపోయింది.

రానురాను ఆమె నాకు అందమైన శిల్పంలా కనిపించేది. ఆర్ద్రత లేదు, అలరింపు లేదు. ఆమెను ముట్టుకుంటే పాలరాతి శిల్పాన్ని తాకినట్టుగా, ఆమె నాకు చల్లగా, అతి చల్లగా తగిలేది.

నవ్వితే, చిరుగంటను మోగించినట్టుగా కాదు-కంచు ప్రతిమ అతి బింకంగా నోరు తెరచి, అంతలో సన్నగా చైతన్యంలేని నవ్వు నవ్వి నట్టుండేది.

కాని ఆమె నా భార్య కాని రోజుల్లో ఆమె కోసం నేను విలవిలలాడేను. ఆమె మా మేనమామ రెండవ కూతురు. మేనమామ పెద్ద కూతురు సరళను నా కిద్దామని మామయ్యకూ, చేసుకోవాలని మా వాళ్ళకూ

బాగా వుండేది. అప్పటికి కాలేజీలో చదివే మామయ్య పెద్ద కూతురు నన్ను చూసినప్పుడల్లా సిగ్గుపడేది. కాఫీ అందించి ఇంట్లోకి పారిపోయేది. సరళ చూపే ఆ సిగ్గు నాకు వెగటుగా వుండేది.

కాని ఎత్తు పీటపై కూచున్న దేవిలా, నిండుగా, తొణక్కుండా వుండే శకుంతల నన్ను నిలవ నిచ్చేది కాదు.

నేను శకుంతలనే చేసుకుంటానని పట్టుపట్టినప్పుడు మా ఇళ్ళల్లో రేగిన అలజడి మూడేళ్ళదాకా సర్దుకోలేదు. ఈలోపుగా సరళ పెళ్ళి చేసుకోనని చెప్పేసి, మెడిసిన్‌లో చేరింది. నేను మా నాన్న వ్యాపారంలో స్థిరపడిపోయాను.

నాలుగేళ్ళకు నా కోరిక నెరవేరింది. శకుంతల నాదైంది.

నాదైన శకుంతల నా కాళ్ళకే కాకుండా, ఆలోచనలకు కూడా బంధమైపోయింది. ఎత్తున అకాశంలో విహంగంలా విహరించే నా ఊహలను ఆమె తన చుట్టూ మలుచుకోవాలని సూచించి, పట్టుపట్టే సరికి మా మధ్య మొదలైన చీలిక, ఒక సంవత్సరంలోనే వారధి కట్టలేని అగాధమైంది. మా చేతుల్లోంచి సుఖజీవితానికి ముఖ్యమైనదేదో జారిపోయింది..... ఎప్పుడు జారిపోయిందో, తెలీకపోయినా. ఆ యథార్థం ఇద్దరికీ స్పష్టంగా మూడేళ్ళల్లోనే తెలిసిపోయి స్థిరపడిపోయింది.

అసలు నావల్ల ఆమె ఎండిపోయిందేమో? ఏమో! నేనా ప్రశ్నకు సరియైన జవాబు ఏనాడూ చెప్పలేను.

ఆమె మరణం నా అసంతుష్టికి కారణం కాకపోయినా, ఆమె మరణం నన్ను విచలితుణ్ణి చేసింది. ఆమె మరణం గొప్ప 'షాక్' నాకు. ఆ షాక్ నుండి తేరుకున్నాక చనిపోయిననాటి శకుంతలని చూసి నేను నిలువెల్లా చలించిపోయాను. నిద్రలో ఉన్నంత ప్రశాంతంగా వుంది ఆమె. ఆ అమితమైన ప్రశాంతి నాలో వణుకులాటిది కలిగించింది. నాకు ఆధారం లేని ఓ అనుమానం. నిద్ర మాత్రలు రోజూ కంటే ఆ క్రితం రాత్రి ఆమె ఎక్కువ వేసుకొందని నా మనసు నమ్మిన సత్యం.

మా బంధవుల దృష్టిలో మాది ఆదర్శ దాంపత్యం. శకుంతల హఠాత్మరణం మా వాళ్ళందర్నీ నిశ్చేష్టులను చేసింది. ఆ షాక్ నుంచి తేరుకోలేక నేను ఇలా అయిపోయానని వాళ్ళ ఊహ.

....శకుంతల ఏనాటికీ తల్లి కాలేదని డాక్టరు చెప్పిన రోజున ఆ విషయాన్ని ఆమె అతి మౌనంగా వింది. తనకి పట్టనట్టుగానే వుంది. దూరాన కనబడే ఎర్రటి, వాసనలేని పువ్వును చూస్తూ. కాని ఆ కఠోర సత్యం ఆమెలో బడబానలాన్ని సృష్టించి ఆమెను దహించివేసింది.

దానికితోడు ఆమెను నేను అంటిపెట్టుకు వుండాలన్న విషయంలో ఆమెకు చాలా పట్టుదల.

తనకు అందం వుంది. అలంకరణ చేతనవును. లాలించి, మెప్పించగలదు. తల్లి కాలేనంత మాత్రాన తను స్త్రీ కాకపోదు.

ఆమె ఆ విధంగా ఆలోచించేది. 'ఆ కారణంగా నేను మరీ దూరంగా వెళ్ళిపోతున్నానని ఆమె అభిప్రాయపడింది. అది నిజం కాదనీ, ఆమె నాకు ఆరాధ్య అనీ చెప్పినా, ఆమె ఏనాడూ నమ్మలేదు.

చిన్ననాటి నుండీ మక్కువ పెంచుకొని, పోషించుకుంటూ వచ్చిన ఇష్టాల్ని నేను ఆమె కోసం వదులుకోలేక పోయాను.

చిన్నతనంనలోనే 'స్పోర్ట్స్' అంటే ఏర్పడిన మక్కువ, వివిధ క్రీడా రంగాలలోని ప్రపంచ ప్రముఖుల పేర్లు చెప్పుకుంటూ, వల్లిస్తూ తిరగడం, ఆ సరదా, యౌవన ప్రాదుర్భావంలో నాటుకుని, ఈనాటికీ నాలో నిల్చి, నన్ను నిలవనివ్వని సౌందర్యారాధన, సాహిత్యం అవలోధనం చేస్తూ మిత్రులతో ఆనందం పంచుకుంటూంటే కలిగే తృప్తి, కొత్త ప్రదేశాలు చూస్తూ, ప్రకృతి వింత అందాలు అనుభవిస్తూ, ఆ ప్రకృతే నా కోసం సృష్టించబడినట్టు ఆనందించడం.... ఇవన్నీ ఒక్క శకుంతల కోసం ఎలా వదులుకోగలను?

వదులుకోలేనని చెప్పేను. ఆ మాట విని ఆమె మ్రాన్పడిపోయింది. తరువాత ఆమె పోయింది.

ఆమె పోయిన ఈ మూడేళ్ళ నుండీ నేను అతి వెర్రిగా తిరిగాను.

అమె నాకు బంధమనుకున్నాను. బంధం తొలిగినా, విశృంఖలత్వంలో నాకు కావలసినది దొరకనూలేదూ, తెలియనూలేదు. అశాంతి పెరిగిందే కాని తగ్గలేదు.

వారం రోజులై శంకరం దగ్గరకు వచ్చాను. నాగరికతకు దూరంగా కొండలూ, అడవుల మధ్య వుంటున్నాడు వాడు, ఉద్యోగరీత్యా. నేనంటే అభిమానం, సానుభూతీ వున్న వాడు. నా దిగులు పోగొట్టడం కోసం, లంబాడీల డాన్స్ ఏర్పాటు చేశాడు. రెండు రాత్రిళ్ళు 'షికార్‌కి వెళ్ళాము. స్వర్గద్వారాల సన్నిధికి తీసుకుపోతాయని భ్రమించి, నమ్మే ఘాటైన ద్రవాల్ని నా కోరికపై రోజా ఏర్పాటు చేశాడు.

ఇవన్నీ నా దిగులునీ, అశాంతినీ, ఒంటరితనాన్నీ పెంచాయే కాని, తగ్గించలేదు. నా ఈ అసంతృప్తికి ఎవరైనా కారణం చెప్పి సరిదిద్దితే బావుండును.

ఆ సాయంత్రం ఇంటికి బయలుదేరేను. మళ్ళా ఒంటరితనం. ఒంటరిగా వుంటే నలుగురి మధ్యా ఉండాలని తపన. చుట్టూ నలుగురూ వుంటే వాళ్లనందర్నీ చూస్తే విసుగు. దీనికేదీ విరుగుడు?

మర్రోజు ప్రొద్దుట రైల్లో రంగయ్య కనిపించేడు. యూనివర్సిటీలో సహాధ్యాయి. తొమ్మిదేళ్ళ తర్వాత కలిశాం. వాణ్ణి చూడగానే ఆశ్చర్యమైంది నాకు. మనిషి అతి సన్నగా అయిపోయాడు. బట్టతల కన్పిస్తోంది.

పెద్దవాడిలా అయిపోయాడు. కానీ వాగుడు మాత్రం తగ్గలేదు, మారలేదు.

వాడి వాగుడు నాకు ఇష్టం. వాడు ఏది మాట్లాడినా అసలు విషయం చుట్టూ వలయం అల్లి మాట్లాడతాడు. నేను మాట్లాడవలసిన అవసరం వుండదు. వాడి వలయంలో చిక్కుకోకుండానే, వాడి సంభాషణని నేను ఆనందించగలను.

అందుచేత రంగయ్యని బలవంతం చేసి మా వూళ్ళో దింపేశాను.

ఇంటికివచ్చి రంగయ్యకు గది చూపించి, లోపలికి వచ్చాను.

గదిలో సరళ, మెడలో స్టెతస్కోప్‌తో కళ్ళు మూసుకొని సోఫాలో కూచుని వుంది. జుట్టు ముడి వేసుకొంది. అతి సాదా చీర.

సరళ తల ఎత్తింది.

"ఇలా వచ్చేవేం?" అన్నాను.

"అత్తయ్యకు వంట్లో బావుండలేదు. ఇంజక్షనిచ్చాను. నిన్న నీకు బయలుదేరమని టెలిగ్రామ్ ఇచ్చాను. అందలేదా?" అంది.

'లే' దంటూ అమ్మ గదిలోకి వెళ్ళాను. నిద్ర పోతోంది.

"ఇప్పుడు డిస్టర్బ్ చేయకు ఇప్పుడే నిద్ర పట్టింది" అంది సరళ. ఆ కంఠంలో ప్రొఫెషనల్ టచ్ వుంది. ఇది నాకు చురుక్కుమని తగిలింది.

గదిలోంచి వచ్చేసి, "ఎన్నాళ్ళనుంచి జ్వరం?" అన్నాను.

"నాలుగు రోజులైంది. రేపు నార్మల్‌కు వస్తుందిలే. మళ్ళా సాయంత్రం వచ్చి ఇంజక్షనిస్తాను" ంటూ వెళ్ళిపోయింది సరళ.

ఒక్కతే కారు డ్రైవ్ చేకుంటూ వెళ్ళిపోయింది సరళ.

రంగయ్య స్నానం చేసి వచ్చాడు. భోజనమయ్యాక కబుర్లు మొదలెట్టాడు.

"సావిత్రి ఇప్పుడెక్కడుందో తెలుసా?" అన్నాడు.

'తెలీ' దన్నాను.

"నెల్లూరులో లెక్చరర్."

అలా ఎంతోమంది పాత మిత్రుల్ని జ్ఞాపకంచేసి వాళ్ళ పుట్టు పూర్వోత్తరాలూ, ప్రస్తుత పరిస్థితి అంతా చెబుతున్నాడు.

ఆ చెప్పేటప్పుడు విషయమేదైనా వాడిలో ఉద్వేగం లేదు. చాలా సాధారణంగా మాట్లాడుతున్నాడు. మనకి తెలీని వ్యక్తుల్ని గురించి మాటాడుకుంటున్నట్టు.

ఈ రంగయ్యకు ఇంతమంది విషయం ఎలా తెలుసో?

"రామనాధం తెలుసుగా?"

"జ్ఞాపకముంది కవిత్వమంటే ప్రాణం విడిచేవాడు" అన్నాను.

"వాడే! క్రితం ఏడాది ఉరిపోసుకు చచ్చిపోయాడు".

"అయ్యో! పాపం... ఎందుకట?"

"ఎందుకేవిటీ? వాడికేదో నిరాశగా వుందిట. అలా అని ఓ చీటీ వ్రాసివుంచి ఆ పని కాస్త చేసేశాడు, చేతకాని వాజమ్మ."

"శివరామ్ ఏం చేస్తున్నాడు? బావున్నాడా?"

"వాడికేం? నిక్షేపంలా వున్నాడు."

"చదరంగం ఆడుతున్నాడా? ఆ రోజుల్లో రష్యన్లని మించిపోతాననే వాడు"

"వాడిప్పుడు చదరంగం ఆడటమా? ఇంకా నయం. వాడికిప్పుడు ప్రయివేట్లు చెప్పుకోడానికే టైమ్ చాలడం లేదు".

"మేష్టరీ చేస్తున్నాడా?" అన్నాను.

"బి.ఇడి. అయ్యాడుగా. ఐదుగురు పిల్లలు వాడికి-తెలుసా?"

నాకు మతిపోయింది. నాతోపాటు చదువుకున్న వాడికి ఐదుగురు పిల్లలా?

"అప్పుడే ఐదుగురు పిల్లలా?" అన్నాను.

"ఏం? వాడికి ముప్పై అయిదేళ్ళు. క్రిందటేడు 'వేసెక్టమీ' చేయించుకున్నాడు. నాకు మాత్రం... నలుగురు. మా ఆవిడ కింకో కుర్రవెధవ కావాలని వున్నా, క్రితం కాన్పులో దానికి ఆపరేషన్ చేయించేశాను"అని నవ్వుతున్నాడు.

"అయినా అంతమంది పిల్లలవి(టా? మనం ఇంకా చిన్నవాళ్ళం కదా".

"బావుందిరోయ్! ఇంకా ఎన్నాళ్ళు చిన్నవాళ్ళమంటావ్? శివరామ్ పెద్ద కూతురికి సంబంధాలు చూస్తున్నాడు. రెండు, మూడేళ్ళల్లో వాడు తాత కూడా కావచ్చు".

నాకీ సంగతి మరీ నమ్మశక్యం కాకుండా వుంది.

"అలా చూడకు. వాడి పెద్ద పిల్లకి పధ్నాలుగేళ్ళు. మంచి సంబంధం కుదిరితే చేసేస్తాడట. నన్ను సంబంధమేదైనా చూడమన్నాడు కూడానూ."

"ఏదైనా మీరంతా ఇంత ఊబిలో దిగబడిపోవడం నాకు నచ్చలేదురా" అన్నాను.

"అబ్బాయ్! నే చెప్తున్నా విను. పాతరోజులు పోయాయి. ఆ సమయం దాటి పోయింది. ఏదో ఇక ఇప్పటికైనా కాస్త కుదురుగా 'సెటిల్' కావాలోయ్! ఎప్పటికైనా తప్పదుగా. వాడు ఇల్లు కట్టాడు. పిల్ల పెళ్ళి చేయబోతున్నాడు"

"ఇల్లు కట్టాడా?"

"మొన్న వైశాఖంలో గృహప్రవేశం కూడా అయిపోతే? చిన్నదే అనుకో...."

శివరామ్ సొంతంగా ఇల్లు కట్టాడని వినగానే నాకేదో కొత్త విషయం కంటి ముందు మసగ్గా కదిలింది.

రంగయ్య ఇంకా చెబుతున్నాడు : "(ప్రైవేట్లు ఉన్నాయిగా. డబ్బు సంపాదించాడులే. నేను కూడా సైట్ కొన్నాను. వచ్చేఏడు ఇల్లు కట్టేస్తా.........."

ఈసారి నా కళ్ళ ముందు మసక కరిగిపోయి విషయం అర్థమయిపోతోంది. మిగిలిన సందిగ్ధత, కాస్తా రంగయ్య ఆ సాయంత్రం వెళ్ళిపోతూ అన్న మాటల వల్ల పూర్తిగా చెరిగిపోయి, అంతా కరతలామలకం అయిపోయింది.

"ఒరేయ్ వెంక(టావ్! వచ్చే ఏళ్లే కాని వెనక్కి వెళ్ళేవికాదు గదా! అందరం ముప్పయి దాటి నలభయ్యో పడిలో పడినవాళ్ళమే. ఎన్నాళ్లంటావ్ దాగుడుమూతలు? ఈ జీవితానికి అర్థం, గమ్యం ఉన్నాయో, లేదో కాని-ఉన్నా మనకు తెలియనూ తెలియదు, కనబడనూ కనబడదు. చదువుకొనే రోజుల్లోని కలలన్నీ ఎంత మధురమైన వైనా, కాలం గడిచినకొద్దీ, అవి కొన్ని కరిగిపోకా తప్పదు, మరికొన్ని రూపం మార్చుకోకా తప్పదు. అది రూల్. ఆ రోజుల్లో కలలు కనడం వంటికీ, మనసుకీ ఎంత మంచిదో, ఈనాడు కాస్త 'సెటిల్' అవడం కూడా అంతే మంచిది. నీకు మాత్రం?... ముప్పయి మూడు వచ్చివుంటుంది. లేక

వెళ్ళిందా? అవునా? ఇప్పటికైనా కాస్త ఏదైనా ఊత పట్టుకొని కలల్నీ, నిజాల్నీ కలగలిపి హాయిగా బతికేయ్"

రంగయ్య వెళ్ళిపోయాక అరగంట దాకా ఒక్కణ్ణే కూచుండి పోయాను. వాడు చెప్పిన దాంట్లో 'నీకూ ముప్ఫయి మూడు వచ్చి వుంటుంది" అన్న పచ్చి నిజం నాకు ముల్లులా గుచ్చుకుంటోంది. ఆ సంగతి ఎపాడై ఆలోచించలేదు. నేనింకా చిన్నవాణ్ణనే నా ఊహ.

అద్దంలో చూసుకున్నాను.

రంగు తగ్గలేదు, జుట్టు నెరవలేదు, కళ్లల్లో మెరుపు తగ్గలేదు. కాని కనపడే నా రూపంతో పాటు కనబడని మనసులోని మార్పు అద్దంలో మొదటిసారిగా కనబడింది.

నా కళ్ళ ముందు ఏదో గొప్ప నిజం తెర తొలగించుకొని ఎదురు నిలిచినట్టయింది. కలలూ, ఆదర్శాలూ, ఆలోచనలూ ఆత్మగతం చేసుకుని కూడా స్థిరత్వం సంపాదించేందుకు వలసిన మూల సూత్రం నాకు గోచరించింది. నా మనసు నిండా తృప్తి నిండింది.

సాయంత్రం సరళ వచ్చింది. అమ్మకి ఇంజక్షనిచ్చి 'వెళ్ళొస్తాను' అంది.

'నన్ను వంటరిగా చేశా?' అన్నాను.

నా నుండి అలాటి మాట రావడం కొత్త. ఓ క్షణం ఆశ్చర్యపోయి, అది వెంటనే దాచేసుకొని, "నీకు జబ్బులేదుగా" అంది.

"జబ్బు లేదుగానీ, కాసేపు కూచుందూ."

"పేషెంట్సు నా కోసం ఎదురుచూస్తూ వుండరూ?"

"నన్నూ ఓ పేషెంటే అనుకోకూడదూ?"

"అయితే హాస్పిటల్‌కి వచ్చి, క్యూలో నిలబడు" అంది నవ్వేస్తూ.

"పేషెంట్‌గా తప్ప నన్ను మామూలు మనిషిగా చూడలేవా?"

"నువ్వు నన్ను ఆ విధంగా చూడమన్నదెప్పుడు? అవకాశమే లేదుగా" అంది.

ఆమె కంఠంలో జీర.

వెళ్ళిపోడానికి లేచింది.

ఆమె చేతులు పట్టుకొని అన్నాను. "నా మనసంతా దిగులు. పెద్దవాడి నయిపోతున్నాను. వయసు మళ్ళిన తల్లి తప్ప నాకింకెవరూ లేరు. నీ దగ్గర చోటిచ్చి, నాకు కాస్త విశ్రాంతి ఇయ్యి.'

ఆమె అప్రతిభురాలై చూసింది. కాని 'ఇది నిజమా?' అన్న అనుమానం ఆ కళ్ళల్లోంచి పోలేదు.

"నన్ను నమ్ము సరూ. నాకు కావలసిన దేమిటో నాకీనాడు తెలిసింది. నా జీవితం పరిభ్రమించే పరిధి చిన్నది. ఓ నలుగురు ఆత్మీయులైన స్నేహితులు, అందమైన సాయంకాలాలు, నచ్చిన కొద్ది పుస్తకాలు, ప్రశాంతంగా వుండే ఇల్లు, నా ఇల్లాలు - ఈ పరిధి చిన్నదే. కాని నా చూపుకు అవధి లేదు. లోకమంతా పరిభ్రమిస్తుంది. అన్నీ అవలోకిస్తుంది. పరిమితిలేని నా చూపుకూ, చిన్నదైన నా జీవిత పరిధికీ సరియైన వంతెన ఎలా కట్టాలో, సరియైన పునాదుల మీద నిలచిన ఆ వంతెన మీద జీవితం ఎంత ఆనంద దాయకమో నాకు తెలిసివచ్చింది. నిన్ను నేను ఆర్థిస్తున్నాను, నన్ను నమ్ము'

ఆమె నా కన్నీళ్ళు తుడిచింది.

మరో పది నిమిషాల్లో ఆమె తన కారులో నన్ను పక్కన కూచుండబెట్టుకొని, కారు నడిపిస్తూ తీసుకువెళ్ళింది.

*(జ్యోతి మాసపత్రిక : మే 1967)*



# చేదు నిజం

"మిమ్మల్ని చూస్తుంటే ఆ పిల్లని తీసుకుని ముద్దులాడేట్టు వున్నారే"

మౌనంగానే నవ్వాడు రాజు - దూరంగా తల్లి పక్కన ఇసుకలో ఆడుకుంటూన్న పాపని లాలనగా చూస్తూ.

"మీకు చిన్న పిల్లలంటే అంత ఇష్టమెందుకో కొంచెం చెబుదురూ - బుద్ధ విగ్రహంలా కూచుని ఆ అలల్నీ, పాపని చూస్తూ కూచోక"

సుధ వైపు తిరిగాడు రాజు.

"నువ్వంటే 'ఎందుకంత ఇష్టమో' చెప్పగలిగానా, పిల్లలంటే ఎందుకంత మమతో చెప్పడానికి?"

విశాలమైన ఆమె కళ్ళు బరువుగా వాలాయి. చెక్కిళ్ళలో అరుణిమ అలుముకుంది. కాసేపటికి సర్దుకుని, కంటి కొస నుండి చూసింది. అతని గాంభీర్యం చూసి ఆమెకు నవ్వొచ్చింది.

"ఆ నీ వాలు కళ్ళు చూసి నీ వెంట తిరుగుతున్నాను అని చెప్పకూడదా? - నీలో ఆ మాత్రం 'రొమాన్స్' లేకపోతే ఎలా?" అంది గల గలా నవ్వుతూ.

"ఆ మాత్రం 'రొమాన్స్' చేతనయిన వాడినయితే, ఎన్నాళ్ళ నుంచో నీతో చెప్పాలనుకుంటున్నది ఇలా చెప్పలేకుండా వుందునా?"

అతని నిజాయితీ అర్థమైనా పోల్చుకోనట్టే నటించింది.

"అది కాస్త అడిగి ఔననిపించుకున్న తర్వాత 'రొమాన్స్' కాస్త చల్లారిపోతుందటగా? - అని విజ్ఞులన్నారులే" అంది తేలిగ్గా నవ్వుతూ.

ఇంటికి తిరిగి వెళ్తూ రాజు ఉన్నట్టుండి మొదటిసారిగా ఆమె చేతులు తన చేతుల్లోకి తీసుకున్నాడు.

అతని వదనంలో నిలిచిన నిశ్చయానికి ఆమె విచలితురాలైంది.

"నీ కభ్యంతరం లేకపోతే..."

"నా కభ్యంతరం లేదని నీకు తెలీదా రాజా? కాని ఇది చాలా లోతుగా వేళ్ళు పాతుకున్న అతి సున్నితమైన విషయం; మనం వున్న పరిస్థితులు కొంచెం మనసులో వుంచుకోవాలి. కావలసిన వాళ్ళ ఆశలను, ఆచారాలను... నువ్వు సున్నితంగా నడుచుకోవాలి. నీ మీద నాకు విశ్వాసం వుంది. నీకు తెలీని విషయం చెప్పడం లేదు" అంది సుధ మృదువుగా తన చేతులు విడిపించుకుంటూ.

"అనుకోని పరిణామాలు అతి స్వల్ప కాలంలో వస్తున్నాయి. మన చుట్టూ వున్న మనకు కావలసిన వ్యక్తులు వారు పుట్టి పెరిగి, జీవిస్తూన్న వాతావరణం నుండి విడివడి ఆలోచించడం కష్టమేమో! మా వాళ్ళకీ సంగతులు చెప్తాను. కాదనరనే నా నమ్మకం. రేపే మా వూరు వెళ్తాను" అంటూ వెళ్ళాడు రాజు.

ఆమె తన చేతులు చూసుకుని సిగ్గు పడింది. ఆ రాత్రి ఆమె మనసులో ఎన్నో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.

రాజు మనసు తనకు తెలుసు. అంత కన్న ఎక్కువగా అతని ఆలోచనా క్రమం తెలుసు. అతని వ్యక్తిత్వం తెలుసు. పెద్ద, పెద్ద విషయాలు మాట్లాడడు. ఆదర్శం కోసమని కుప్పిగంతులు వేసి న సాహచర్యం కోరడం లేదు. అసలు ఆశయాలు, సంఘం అంటూ వాటి జోలికి పోయి కబుర్లు చెప్పడు. అయినా అతని నిండు హృదయంలో నిండిన విలక్షణమైన ప్రకృతి తనకు అనుభవమే. అతని ద్వారా అతని కుటుంబం, తల్లి దండ్రులు ఆలోచనా క్రమం తను విన్నది. చదువుకొని ఉద్యోగం చేసే కోడలంటే వారికున్న అభిప్రాయాలు తెలుసును కాని అతడు మరీ పట్టుబడితే, తమ 'అడ్డు' తాత్కాలికంగా తొలగించి అతని కోరిక కాదనక పోవచ్చు! కాని ఆ 'అడ్డు' తామిద్దరూ ఒకటైన తర్వాత కూడా నిలిచి, ఛేదింపలేని అడ్డు తెరలు ఆసాంతం మిగిలితే, అతడు ముందు ముందు ఏనాడైనా, తను చేసింది 'ఒప్పా?' అని ఆలోచిస్తే, తనకు బాధ కాదా?! ఆ బాధ స్త్రీ సహజమైన ఓర్పుతో తాను ఇముడ్చుకోగలదా? అసలు ఇముడ్చుకోవాలా? అసలు ఆ ఓర్పు తనలో వుందా? తనని వాళ్ళ వాళ్ళు 'దూరంగా' చూస్తే తన తప్పు లేకపోయినా వ్యధా భరితమయిన జీవితం గడపాలేమో! అది త్యాగమనిపించుకుంటుందా?

ఏమో! తనకి 'త్యాగం, సహనం' - ఈ పెద్ద మాటల అర్థం అంతగా తెలియదు.

ఆలోచనల నుండి తప్పించుకోవడానికి 'సుమిత్ర'కు ఉత్తరం రాస్తూ కూచుంది.

చివరన వ్రాసింది : "ఈ మధ్య 'రాజు' గురించి ఏం రాయలేదని రాశావు - ఏం వ్రాయను? అంతా మామూలే - అలా కాదులే. ఈ రోజు కొంచెం తేడా కనిపించింది. ఎందుకయినా మంచిదని కొంచెం

హితోపదేశం చేశానులే. మన కుటుంబాల ఆలోచనలు కూడా కొంచెం మననం చేసుకుని నిర్ణయిస్తే మంచిదని చెప్పాను.

"నువ్వు మరీ చిలిపిగా రాశావు - అతను చాలా బుద్ధిమంతుడు తెలుసా? మీ శ్రీవారిలా అద్భుతంగా 'కోర్టింగ్' చేయలేడనుకో, మీలాగా పెళ్ళికి ముందే ఫోటోలు, బీచి షికార్లు, పిక్నిక్స్ - మాకివే లేవు. నేను కూడా చాలా కుదురైన పిల్లని - నువ్వే మనుకుంటున్నావో కాని నువ్వు వూహించినంత రసవత్తర ఘట్టాల్లోకి దిగలేదులే.

"ఇదిగో చెప్తున్నాను - నువ్వు చిలిపిగా వ్రాయడం మానేయకపోతే నాకు చాలా సిగ్గుగా, ఇబ్బందిగా వుంటుంది. నేను పెళ్ళి కాని బుద్ధిమంతురాలైన పిల్లనని జ్ఞాపకముంచుకొని వ్రాయి."

పన్నెండవ రోజున సుమిత్ర జవాబు చదువుకొని నవ్వుకుంది.

"పెద్ద 'సుమతి' కబుర్లు నా దగ్గర తీసెయ్. నువ్వెంత దాద్దామనుకున్నా మీ 'రాజా' గారి మీద నువ్వు పెంచుకుంటూన్న మమతలు నీ ఉత్తరంలో గుబాళించాయిలే. ఆ రోజున కొంచెం మారి ఏదో చేసేడన్నావు. అది కొంచెం చెబుదూ... విని ఆనందిస్తాను. దాచుకుంటే ఊరుకునేది లేదు. నాకొక్కసారి నీ దగ్గరకొచ్చి, నువ్వు ఆ రాజాగారి గురించి ఆలోచిస్తూంటే, ఎరుపెక్కిన ఆ చెక్కిళ్ళు చూసి నీ సంగతి తెలిసిందని ఉడికించాలని వుంది. ఎలాగూ నీ ఊహ తెలుస్తోంది. కనుక ఓ అమృతంగారూ - కాస్త యికనైనా 'ఆయన గారు' అని వ్రాయడం, అనడం అలవాటు చేసుకో ఇప్పట్నించీ".

'అల్లరి పిల్ల' అనుకుంది సుధ ఉత్తరం పూర్తిచేసి.

రాజు ఇంటికొచ్చి తన ఉద్దేశం చెప్పాడు. తండ్రి అంతా విని, ఏం మాట్లాడక, చివరన మాత్రం 'నీ ఇష్టం' అన్నాడు. ఆ అనడం ఆయన మనస్ఫూర్తిగా అనలేదని అనిపించింది రాజుకు. తల్లి మాత్రం బయటపడిపోయింది.

"మన దగ్గరవాళ్ళల్లో పిల్లలు లేరనా ఆ సంబంధం? అయినా అంత చదువుకుని ఉద్యోగం చేస్తున్న పిల్లతో నువ్వు సుఖపడతావన్న నమ్మకం నాకు లేదు."

రాజు విడమరచి చెప్పబోయాడు తల్లికి. : "మీరు ఊహించనైనా ఊహించని మార్పులు పది సంవత్సరాలలో వచ్చాయి. ఈ పరిస్థితులు కాదనలేము. చదువుకోకపోవడమే సుఖం ప్రసాదించే లక్షణమైతే మన అత్తయ్య సంసారం ఈ నాడింత ఊబిలో ఉండేదా? ఉద్యోగం చేయడమే తప్పయితే ఆడ పిల్లల్ని చదివించడమెందుకు? చెల్లాయి కాలేజీలో చేరలేదా? అది పుట్టినప్పుడు అది కాలేజీలో చదువుతుందని

నీకు తెలిస్తే, నీకారోజు 'ఫిట్టు' వచ్చినంత పని అయివుండేది. ఈ రోజున 'మా అమ్మాయి కాలేజీలో చదువుతోందని', నీవే చెప్తున్నావు. దేశంలో వచ్చిన మార్పుల్ని కాదనడం మూర్ఖత్వమే అవుతుందమ్మా!"

"పాప చదవడం వేరు. అయినా ఈ ఏడు దాని పెళ్ళి చేస్తాము. పైగా నాకు దాన్ని 'బి.ఏ.'లో చేర్పించడం సుతారామూ ఇష్టం లేకపోయినా మీ నాన్నే చేర్పించారు" అంది ఆవిడ తన 'అడ్డు' కొనసాగిస్తూ.

"పిల్లల సుఖం కోరే మీరు, వాళ్ళ ఊహల్ని మన్నించలేనప్పుడు, మాకూ మీకూ బాధే మిగులుతుంది. నేను తీసుకున్న నిర్ణయం మంచిదనే నా నమ్మకం".

అప్పటిదాకా ఊరుకున్న తండ్రి "వాడి మాట నువ్వెందుకు కాదనాలి? వాడికన్నీ తెలుసు. ముందు వచ్చే విషయాలు వాడికే అన్నీ తెలియజేస్తాయి. నువ్వు కాదనకు" అన్నాడు.

ఆవిడ రెండు రోజులు మంతనాలు సాగించి చివరకు ఒప్పుకుంది.

తిరిగి వచ్చిన రాజు సుధతో అన్నీ చెప్పి, "మనం సుఖంగా ఉండగలమనే నమ్మకం నాకు వుంది. నా మీద నమ్మకం వుంచి, నా కోరిక పాటించి, నాతో జీవితం పంచుకునేందుకు నువ్వు అంగీకరిస్తే నేను చాలా అదృష్టవంతుణ్ణి" అన్నప్పుడు ఆమెలో మధురమైన వివశత్వం అలముకొంది.

ఆ రాత్రి ఆమె ఆలోచనలు వింతగా సాగాయి.

.... ముందు రాబోయే జీవితం, రాజుకు తన మీద వున్న ఆప్యాయత, అతనిపై తను పెంచుకున్న మమతలూ - అన్నీ దివ్యానుభూతిని కలిగిస్తున్నాయి. కాని ఎక్కడో దూరంగా, నల్లని చారలా, ఓ అనుమానం ఆమె ఆలోచనల్లో దూరంగా వుంది. తన రాజు నల్లని, చీకటిలాటి ఆలోచనలు దరికి రానీయకుండా ఎత్తున వుండడూ? చదువుకొని ఉద్యోగం చేస్తున్న అమ్మాయిల చుట్టూ తమాషాగా అల్లబడే సాలెగూడు లాంటి కథలు చుట్టూ వున్న వాళ్ళకి సరదా అయినా, అనుభవించే వ్యక్తుల బాధ అర్థం చేసుకోగలదెంత మంది? తన 'భర్త'గా రాజు ఇప్పటిలాగా తిన్నగా సూటిగా చూడగలడా?

తనకు చిన్నప్పటి నుండి అలవాటైన చలాకీతనం, తను గ్రహించేలోపున తనకెంత వ్యధ కలుగజేసింది! అప్పటికీ సుమిత్ర తనని మందలిస్తూనే వుండేది. తను ఆనర్స్ చదువుతూండగా, మిత్రులనుకునే వ్యక్తులు రాసిన ప్రేమలేఖల కెనకాల వున్న 'బోలుతనం' తననెంత గాయపరిచింది!

చదువు అయిపోయి, ఉద్యోగంలో చేరిన తర్వాత మెల్లిగా అన్నీ తెలిశాయి. తనతో కాలేజీ లో పని చేస్తున్న శర్మ ఎంతో మర్యాదగా మొదటి నుండి ప్రవర్తిస్తూ, ఇంటికి భోజనానికి పిలిచి, ఉన్నట్టుంది ఆ రాత్రి చేయిపట్టుకున్నప్పుడు-తను మగవాళ్ళతో స్నేహంగా వుండడమే 'తప్పా' అని వితర్కించుకొంది. ఆనాడు

తన అసమ్మతిని తెలుసుకుని అతనీ నాటికీ కక్షగా వున్నాడు. ఆ తర్వాత ముఖతా మర్యాద కనబరుస్తూ, తన వెనుక తన మీద ఎన్నో కట్టు కథలు ప్రచారంలోకి తీసుకొచ్చాడు. మళ్ళీ అతని భార్య ఎంతో సంస్కారం వున్న వ్యక్తి. తనతో ఎంతో ఎంతో ఆహ్లాదంగా మాట్లాడేది. శర్మలాంటి వ్యక్తుల్ని తలచుకున్నప్పుడు, తనకేమో ధైర్యం చాలడం లేదు.

ఇవన్నీ రాజుతో చెప్పాలనీ, తన ఉద్యోగ విషయం, ఇతరత్రా తన స్నేహితుల విషయం అన్నీ చెప్పాలనీ ఆమె యెంతగా అనుకున్నా అతడు ఆమెను ఏనాడూ చెప్పనీయలేదు.

"నాకవన్నీ అనవసరం. చెప్పాలని వుంటే పెళ్ళయిన తర్వాత వంటరిగా చెబుదూగానిలే. ప్రస్తుతం కాస్త నిన్ను తీరిగ్గా చూడనిద్దూ" అనేవాడు.

పెళ్ళికి వచ్చిన సుమిత్రతో, "కాస్త అధికారరీత్యా చేస్తే మంచిదని మా నాన్నగారి చేత అడిగించాను. ఆ విషయంగా మావగారికి చాలా ఉపశమనంగా వుంది" అంది సుధ.

సుమిత్ర చేసే వేళాకోళానికి చిన్న పిల్లలా సిగ్గుపడింది సుధ.

అడక్కపోయినా ఆడపడుచుకు, తనకూ లాంఛనాలు యిచ్చిన ఆడపెళ్ళివారిమీద గౌరవం కుదిరింది రాజు తల్లికి.

పెళ్లి అయ్యాక "మా బొంబాయి రండి హనీమూన్‌కి" అని ఆహ్వానించింది సుమిత్ర.

"వస్తాంలే. ఇప్పుడు కాదు - కాలేజికి సెలవిచ్చాక" అంది సుధ.

"అవునులే, బొంబాయి ఎందుకు వస్తావులే! నీకసలు ఆయనగారితో జనంలేని ఏ నందనోద్యానవనంలోనో దూరి, మమ్మల్నందర్నీ మరచిపోవాలని వుంది. మమ్మల్ని ఆయనగారి ధ్యాసలో ఓ రెండు నెలలు మర్చిపోయినా, ఆ తర్వాతైనా ఓ ఉత్తరం రాయి."

సుమిత్ర చెప్పినట్టుగానే ఆమె 'రాజు' సాహచర్యంలో, సాన్నిహిత్యంలో మధురమైన, సుందరమైన కలలాటి ఆ మత్తులో ఉండిపోయింది. ఐదారు నెలలు ఆ మత్తులో గడిచిపోయాయి. అయినా కొత్త సంసారంలో, అందులో ఇద్దరూ ఉద్యోగాలు చేసుకునే సంసారంలో వచ్చే యిబ్బందుల్ని సుధ ఒడుపుగా పరిష్కరించి వేసింది. పొద్దుట హోటల్ నుండి కారియర్ వస్తుంది. రాత్రి మాత్రం రాజు వద్దని చెప్పినా వినకుండా సుధ వండుతోంది. సాయంత్రం వీళ్ళు వచ్చేటప్పటికి పనిమనిషి కాఫీ కాచి ఫ్లాస్కులో పోస్తుంది.

ఆరు నెలలు గడిచాయి.

...ఆ రోజు సాయంత్రం సుధ ఎంత తొందరగా వద్దామనుకున్నా వీలులేకపోయింది. తోటి

ఉద్యోగులు, శిష్యుల బృందం ఆ ఫంక్షన్‌కి ఆపేశారు. అసలు ఆరోజు రాజు పిక్చరుకి వెళ్దామన్నాడు. 'పాపం' రాజు వచ్చేసి ఎంత సేపయిందో!' అనుకుంటూ, సుధ ఇంట్లో అడుగుపెట్టింది ఆరున్నరకు.

రాజు బట్టలైనా మార్చుకోకుండా పక్కకి వేళ్ళాడుతూన్న 'టై'తో, చెదిరిన జుట్టుతో, సోఫాలో కళ్ళు మూసుకుని వున్నాడు.

అతని నుదురుపై మృదువుగా స్పృశిస్తూ "తల నొప్పిగా వుందా"? అంది.

కళ్ళు తెరిచి రాజు 'ఊ' అన్నాడు.

ఆ కళ్ళు తెరిచి మూయడంలో, ఆ చూపులో కనబడిన విసుగుదలకు సుధ ఆశ్చర్యపోయింది.

"కాఫీ తాగారా?"

"లేదు"

ఈసారి ఆ కంఠధ్వనిలోని చిరాకు ఆమెకు నచ్చలేదు.

ఫ్లాస్కులోని కాఫీ పోసి ఇస్తూ 'అనుకోకుండా ఫంక్షన్‌కి ఉండిపోవాల్సి వచ్చింది" అంది సుధ.

అతను మాట్లాడలేదు. అతని ముభావం ఆమెకు బాధ అనిపించింది.

తన సంగతి తెలిసుండీ, తననర్థం చేసుకున్నాడనుకున్న రాజు ఈనాటి ప్రవర్తన ఆమెకు కొత్తగా, ఎంతో కొత్తగా వుంది.

పెరట్లోకి వెళ్ళి "నేనాలస్యంగా వచ్చాను కదా అయ్యగారికి కాఫీ ఇవ్వలేదేం?" అంది పనిమనిషితో.

"ఇవ్వబోతే వద్దన్నారమ్మా".

లోపలికి వచ్చేసరికి రాజు కాఫీ తాగి మళ్ళీ కళ్ళు మూసుకు కూర్చున్నాడు.

అతని ప్రవర్తన ఆమెకు చిరాకనిపించింది. అనుకున్న సమయానికి రాలేకపోయింది. నిజమే, కాని అనుకోని పరిస్థితులు వచ్చినపుడు తను మాత్రం ఏం చేయగలదు? మొన్న సాయంత్రం పిక్చర్‌కు వెళదామంటే, తను సాయంత్రానికంతా 'రెడీ' అయితే, ఆయన రాత్రి తొమ్మిదింటికి రాలేదా? ఆ రోజు తానిలాగే భీష్మించిందా? ఇంతలో తేలిపోతారేవిటో ఈ మగవాళ్ళు?

"అనుకోకుండా ఆలస్యమయింది. లేచి స్నానం చేసి బట్టలు మార్చుకోండి."

అతను స్నానం చేసి వచ్చి తర్వాత అమృతాంజనం రాస్తూ "ఈరోజు నేనిస్తే కాని కాఫీ తాగకూడదని

వ్రతం పట్టారేమిటి?" అంది అతని మౌనాన్ని భరించలేక.

"అబ్బే, లేదే" అన్నాడు రాజు.

ఉన్నట్టుండి "పోనీ నేను ఉద్యోగం మానెయ్యనా? నేను చాలా సీరియస్‌గా ఆలోచిస్తున్నాను" అంది.

"అదేవిటీ?" అన్నాడు రాజు మొదటిసారిగా గొంతులో చలనం చూపిస్తూ.

"అబ్బే! ఎంత చెప్పినా ఆడది ఉద్యోగం చేస్తుంటే మగవాళ్ళకి అట్టే సయించదుట లెండి. మీ సంగతి కాదు నే చెప్పేది. మానేద్దామా అని ఆలోచిస్తున్నాను."

సుధని తీరిగ్గా చూడగానే ఆమె వదనంలో గూడుకట్టుకున్న విషాదం అతనికి అర్థమైంది.

"ఇలా దగ్గరకు రా - ఓ మాట చెప్పాలి" అన్నాడు.

దగ్గరగా వచ్చి ఎదురుగా నిల్చుంది సుధ.

... పెదవులు విడిపించుకుని 'ఇలాంటి పోకిరీ పనులు చేస్తే గడుసుతనమనిపించుకుంటుంది కాని' - అని వూరుకుంది, అతని చిలిపి చేష్టలకు నవ్వుకుంటూ.

"ఉద్యోగం మానేస్తాననడం లాంటి మాటలన్నావంటే ఇలాంటి పోకిరీ పనులే చేయాలి మరి."

ఆమె గుండెలో ఓ మధుర తరంగం పొంగింది. 'అయితే తప్పకుండా అలాంటి మాటలంటాను' అనాలనిపించి, మధురమైన లజ్జతో తనలోనే నవ్వుకుంది.

"తలనొప్పిగా వుండి అలా వున్నాను సుధీ! ఇంకేమీ కాదు" అని అతడన్నా ఆమె విశ్వసించలేకపోయిందీ. వంట్లో బావుండకపోతే అతని తరహా వేరుగా వుంటుంది. తనకి తెలుసు... అతడు తన ఆలస్యానికి మథనపడి, చిరాకు పడ్డాడు.

ఇలాంటి విషయాలే కొన్ని తర్వాత రెండు, మూడు నెలల్లో ఆమెకు అమితమైన విషాదాన్ని ప్రసాదించాయి.

... ఆ రోజు సినిమా హాల్లో వెంకటేశం కనిపించాడు. ఎంతకాలానికి? చదువుకునే రోజుల్లో తన శ్రేయస్సును కోరిన నిజమైన స్నేహితుడు. ఆమెను తలవని తలంపుగా, కలుసుకున్న ఆనందం అతని వదనంలో ద్యోతకమవుతోంది. రాజును పరిచయం చేసింది. కాని వెంకటేశం ముక్తసరిగా రాజును పలకరించి, తనతోనే పాత విషయాలు మాట్లాడుతుంటే ఆమెకు అదోలా అనిపించింది. రెండు నిముషాలు చూసి రాజు 'నే టిక్కెట్లు తీసుకొస్తా' అని వెళ్లిపోయాడు. అతడు వెళ్ళిన వేపే చూస్తూ పరధ్యానంగా వెంకటేశం

కబుర్లు వింటోంది. రాజు టిక్కెట్లు తీసుకొని, దూరంగా సిగరెట్టు కాల్చుకుంటూ, 'ఫౌంటెన్' మీద దృష్టి పెట్టి నిల్చున్నాడు. సుధ మనసులోనే వెంకటేశం మీద విసుక్కొంది. కాని చాలా కాలానికి కనబడిన తనతో, పాత విషయాలే చెపుతూ, అమాయకంగా తన బాగోగులు ప్రశ్నిస్తున్న వెంకటేశాన్ని చూసి, మరుక్షణంలోనే ఆమె మనసు ఆర్ద్రమైంది.

సినిమా హాల్లో కూచుని కూడా రాజు మీదుగా వంగి తనతో కబుర్లు సాగిస్తున్న వెంకటేశాన్ని కోపగించుకోవాలో, లేక అతని అమాయకతను భరించాలో ఆమె తేల్చుకోలేకపోయింది. కొంతమందికి అంత తెలీదేమిటో? ఇక రాజును చూస్తే తనకేం సంబంధం లేనట్టు, నిశ్శబ్దంగా సినిమాలో మునిగిపోయినట్టు కూచున్నాడు. కాని అతని తీరు ఆమెకు అర్థమైంది. గంభీరమైన ఆ మనసు బాధ పడుతూంది. సరదాగా గడపాలనుకున్న ఆ సాయంత్రం మూగబాధతో నిండింది.

ఆ రాత్రి రాజు మౌనం ఆమెను చిత్రహింసకు గురిచేసింది.

...మరొకసారి శర్మ వచ్చాడు ఓ సాయంకాలం. అతనికి ఎంత ధైర్యం వుండాలి మళ్ళా రావడానికి! అభిమానం ఉన్నట్టు లేదు. ఇంటికి వచ్చినవాణ్ణి వెళ్ళమని ఎలా చెప్పగలదు తను? అతని రాక ఆమెలో సెగలు రేపుతోంది. సహించి కూర్చుంది - ఇంతలో రాజు వచ్చాడు. అతన్ని చూడనట్టుగానే తనతోనే సంభాషణ సాగిస్తూన్న శర్మ కుత్సితాన్ని ఆమె ఇక సహించలేకపోయింది.

అతని మాట మధ్యలోనే లేచి, రాజు గదిలోకి వెళ్ళి, కాఫీ ఇచ్చి అక్కడే కూర్చుంది. పది నిముషాలు దాటాయి.

"ఆయన నీ కోసం చూస్తున్నట్టున్నారు. వెళ్ళిరా బాగుండదు. నేను స్నానం చేస్తాను" అన్న అతని మాటల్లో వ్యంగ్యం ఎంతవరకూ వుందో అని ఆమె తెల్లబోయింది. రాజు లేచి టవల్ తీసుకుని వెళ్ళిపోయాడు.

"సుధగారూ! మీకో తమాషా చెప్తాను - రావాలి మీరు" అని శర్మ అరుస్తున్నాడు అక్కడ నుండి.

తనతో చాలా పరిచయమున్నట్టు రాజుకు కనబడాలి అరిచే శర్మ కుత్సితం కంటే రాజు తీరే ఆమెను ఎక్కువగా గాయ పరిచింది. ఆ సాయంత్రమంతా 'బోర్' చేసి మధ్యలో వచ్చిన రాజును లెక్క చేయనట్టు సంభాషణ అంతా తనతోనే నడిపిన శర్మ వక్రబుద్ధిని ఆమె ఓర్చుకోలేక అతను వెళ్ళాక దిగాలుపడి కూర్చుంది. దానికితోడు ఆ రాత్రి అంటీ ముట్టనట్టు వ్యవహరించిన రాజు ధోరణి ఆమె భరించలేకపోయింది.

మర్రోజు 'వచ్చే ఆదివారం 'భీమ్లీ' వెళ్దామా? నీకు తీరుబడేనా?'' అన్నాడు రాజు.

"అలాగే" అంది, అతను ప్రశ్నించిన తీరు ఆలోచిస్తూ.

అంతా సిద్ధం చేసుకున్నాక ఆ ఆదివారం పరీక్షకు వెళుతూన్న విద్యార్థులకు ప్రయివేటు క్లాసు పెట్టవలసి వచ్చింది. సులభంగా వదిలించుకోలేని తన ఉద్యోగ ధర్మాలు, తమ 'పిక్నిక్'ని పాడుచేయటమే కాకుండా రాజు ప్రవర్తనా క్రమాన్ని కూడా మార్చాయి. అతని నిశ్శబ్దమైన ప్రవర్తన ఆమెకు ముల్లు గుచ్చుకున్నట్టుగా వుంది.

"ఎన్నో చెప్తారు. ఏదో ఊహలతో సంస్కారవంతులమని అనుకుంటారు. అలాంటి చిన్న విషయాల్లో రాజులాటి వ్యక్తే ఇలా అయిపోతూంటే, ఆ జాతి కసలు మా పురోభివృద్ధి నిజంగా ఇష్టం లేదేమో? లేక నాలోనో, నా ఆలోచనా క్రమంలోనో తప్పు ఏమైనా వుందా" అని వ్రాసుకుంది డైరీలో ఆ రాత్రి సుధ.

... ఆ శలవల్లో బొంబాయి వెళ్ళారు. రాజు కూడా ఆ ప్రయాణానికి చాలా ఉత్సుకత చూపించాడు. ప్రయాణమంతా అతడు అతి ఉత్సాహంగా వున్నాడు. అతని మృదువైన ప్రకృతి, వెన్నెల లాంటి మక్కువ చూసి సుధ మనసంతా ఆహ్లాదంతో నిండింది.

స్టేషన్‌కు సుమిత్ర, మూర్తి వచ్చారు. రాత్రి భోజనాలయాక మగవాళ్ళనిద్దర్నీ డ్రాయింగు రూములో విడిచి, స్నేతురాండ్రిద్దరూ వరండాలో చేరారు. వెన్నెల నిండిన ఆ రేయి సుధని వేళాకోళం చేయడమే తన పని అన్నట్టు మాట్లాడుతోంది సుమిత్ర.

"అతనికి చంటి పాపలంటే ఇష్టమన్నావ్. మని అతని కోరిక కూడా తీర్చేట్టువున్నావా?" అంది సుమిత్ర సుధని చూసి నవ్వుతూ.

"ఏవిటీ మరీను! మరీ చిన్న పిల్లవయిపోతున్నావు సుమీ".

"బాగుంది. పైగా నేను చిన్న పిల్లనయిపోతున్నానా? అయినా అంత పిల్లాడిలా నీ కొంగు పట్టుకు తిరుగుతాడేవిటీ? నీవు మరీ అలా వెంట తిప్పించుకోవడం బాగుండదు సుమీ"

"ఈ మగవాళ్ళు ఎంత కొంగు పట్టుకున్నట్టు వున్నా, వాళ్ళ మనసుల్లో ఏముందో ఎవరికి తెలుస్తుందిలే".

"అందరి మాటా ఎందుకు? అతని చూపులు చూస్తేనే తెలుస్తుంది నీ మీది యిష్టం. పువ్వులతో పూజిస్తున్నట్టుండే ఆ చూపు నీకు తెలియదూ?"

"ఊ" అంది సుధ చిరునవ్వుతో.

"రాజు లాంటి వాడు దొరికాడు కాబట్టి ఎన్ని చిరునవ్వులయినా కురిపిస్తావ్! నిజంగా మీ అన్యోన్యం చూసి నా మనసెంత ఆనందమయమయిందో నీకెలా చెప్పను సుధీ" అంది సుమిత్ర కంఠంలో నిజాయితీ

ఉట్టిపడుతూండగా.

"ఈ మా చిరునవ్వులు చూసి సహించడం చుట్టూ వాళ్ళకెంత కంటకమో నీకేం తెలుసు?" అంది సుధ పక్కకు తిరిగి.

"ఏం? ఏం జరిగిందేవిటే?".

శర్మ రావడం - అన్నీ చెప్పింది.

"సుఖంగా వుంటే వాళ్ళ కసలు అంత అసహనమెందుకో తెలిస్తే నాకు కొంచెం చెప్పవూ?" ఆమె గొంతులో ధ్వనించిన దీనమైన అర్థింపుకు సుమిత్ర ఉలిక్కిపడింది.

"అదేవిటే పిచ్చిపిల్లా! నీలాంటిదే దిగజారిపోతే ఎలా? మనం పై చదువు చదువుకుంటామన్నప్పుడు ఇంట్లో ఎన్ని కన్నీళ్ళు, చుట్టూ అమ్మలక్కలు ఎన్ని గుసగుసలు మనం నెట్టుకొచ్చి ముందుకు పోవాల్సి వచ్చిందో నీకు జ్ఞాపకం లేదా? అన్నీ అధిగమించి యిప్పుడీ దిగులెందుకు?".

"సంస్కారం చదువూ లేని ఆడవాళ్ళ అజ్ఞానానికి నేనంతగా పట్టించుకోను. సంస్కారవంతులమనీ విర్రవీగి తిరిగే ఈ మగవాళ్ల సంగతే నాకు అంతుబట్టకుండా వుంది."

"శర్మ లాంటి వాళ్ళను పట్టించుకోకుండా వుండాలి సుధీ! అది తలచుకొని ఈనాడు బాధపడితే ఎలా? అయినా రాజు లాంటి సజ్జనుడే నీవాడయ్యాక నీవింకా ఆ పిచ్చికూతలు పట్టించుకోవడమేమిటి?' అంది, సుధ నడుం చుట్టూ ఆనందంగా చెయ్యివేస్తూ.

స్నేహితురాలి సాదరమైన అనునయం సుధను కదలించి వేసింది. పక్కకి తిరిగి దూరంగా చూస్తూ కూర్చుంది.

"ఎన్ని చెప్పినా ఈ మగవాళ్ళకు వాళ్ళతో సమానంగా మనం ఉద్యోగం చేయడం యిష్టముండదనుకుంటాను."

"ఎవరో అనుకుంటే నీకెందుకు?" అంటూ సుమిత్ర ఆమె వదనాన్ని చేతుల్లోకి తీసుకొంది.

తెల్లబోయింది. సుధ చెంపల మీద కన్నీళ్ళు ఆమె చేతినంటాయి.

"ఛీ! అదేవిటే సుధీ! ఎన్నో అనుకుంటారు. వాళ్ళ నందర్నీ లెక్కచేయొద్దని ఎన్ని మాట్లు చెప్పాలి? పోనీ రాజు చేత చెప్పించనేవిటీ?" అంది నవ్వుతూ, ఆమె దిగులు పోగొట్టాలని.

సుధ ఏం మాట్లాడలేదు.

"చెప్పవేం? రాజుకు 'రికమెండ్' చేయనా?"

"ఇంకొకళ్ళయితే నేనెందుకంత పట్టించుకుంటాను? పైవాళ్ళయితే బాధపడతానేమోగాని, కావలసినవాళ్ళ సంగతి తల్చుకుంటేనే కన్నీళ్ళు తిరిగాయి" అంది కన్నీళ్ళు తుడుచుకుంటూ.

సుమిత్ర ఆశ్చర్యంగా చూసింది.

"అన్నీ తెలిసినవాడు. అంతకన్న ఉన్నతుడు నాకు తెలిసిన వాళ్ళల్లో లేడు. మనసు నవనీతం. అటువంటి వ్యక్తే నా ఉద్యోగ ధర్మాలు, నాకు ఇష్టమైనవి, అక్కర్లేనివి స్నేహాలు నన్ను చుట్టుముట్టితే - మనసులో ఏ మూలో బాధపడుతున్నాడని తెలిస్తే నాకెంత అయోమయంగా వుంటుంది? అందుకే నాకు అనిపిస్తోంది. మనం పెంచుకున్న ఉద్దేశాలు, వాళ్ళు చెప్తూన్న సంస్కార వాదాలు - వీటన్నిటికి సరియైన పునాదులు లేవేమోనని! అతని ముఖభావం చూశాక నాకేమనిపించిందంటే, వాళ్ళు పెంచుకున్న అభిప్రాయాలు ఈ నాగరికతా ప్రలోభంలో పడి చెప్పినవే కాని వాళ్ళ ఆలోచనా క్రమంలోని అసలు నిజాలు కావేమో నని" అని వూరుకుంది సుధ.

అంతా విని, కాసేపటికి తేరుకొని "రాజు అలా అయేడంటే నాకు నమ్మకం కుదరడం లేదు సుధా" అంది మెల్లగా సుమిత్ర.

"అదే నేననేదీను! అంత ఉన్నతుడే ఇలా ఉన్నాడే - అని తలుచుకున్నప్పుడే నాకు ఆపుకోలేనంత వ్యధ కలుగుతుంది. అప్పుడే నిజమైనదేదో లోపించిందనిపిస్తుంది. నా చదువు, ఉద్యోగం అన్నీ తెలిసి నాకు ప్రోత్సాహమిచ్చి, నువ్వే కావాలని హృదయమంతటితోనూ కోరి తన దానిని చేసుకున్నప్పుడు కూడా - అతనన్నీ ఆలోచించుకోలేదా? ఆ రోజున అతనికి తెలీదా అని?"

సుమిత్రకు ఏమనాలో చప్పున తట్టలేదు. "నీదంతా ఉట్టి అనుమానమేమో?" అంది చివరకు.

"అన్ని సందర్భాలలోనూ అలా వున్నాడని కాదు. అతనితో అతని స్నేహితులెందరో ఇంటికొచ్చేవారు. కాని ఒక్కో సందర్భంలో అతను మధన పడేవాడు. అయినా రాజు సంగతి నాకు తెలీదా? అతను ఎప్పుడు బాధపడుతున్నాడో తెలుసుకోలేనా?"

"ఏమయినా అన్నాడా?" అంది సన్నంగా సుమిత్ర, ఆ ప్రశ్న అడగొచ్చా అని సంశయిస్తూ.

"అదే గదా నన్నింత బాధించేది. అతడు మనసులో దాచుకుని బాధపడుతున్నాడని తెలిసే నాకింత విషాదం. పైకి చెప్పడానికి వాళ్ళు పెంచుకుంటూన్న సంస్కారం ఒప్పదు గదా?"

"పోనీ నువ్వే అంతా చెప్పకూడదా?" అంది సుమిత్ర.

ఓ నిముషం ఊరుకుని, "నా కిష్టం లేదు. నేనేం చేశానని చెప్పడం? 'నాకేం తెలియదు. నేను చాలా మంచిదా"న్నని చెప్పనా? నాకు అలా చేతకాదు. 'నేనే పాపమెరుగను. నన్ను క్షమించాననండి' అని నాయకుని వెడద ఉరముపై తల వాల్చడానికి ఇదేమైనా కథా? నేను కథానాయకినా? అసలు అది పద్ధతి కాదనిపిస్తుంది నాకు" నిశ్చయంగా అంది సన్నగా నవ్వుతూ.

"అదీ! అలా నవ్వితే చూడాలి మా సుధ అందాలు. ఎంత చిన్న విషయానికెంత బాధపడ్డావే? నాకింకా అనుమానమే - తనే మనుకోకపోయినా నువ్వే అనవసరంగా బాధపడ్డావని".

"అదే నిజమయితే నాకింక వేరే ఏం కావాలి?"

"ఏం కావాలా? చెప్పనా?" అని, నెమ్మదిగా "రాజు" అని సుధ చెవిలో ఊది, "సరేలే, మా 'నాని' లేచినట్టున్నాడు. పాలు పట్టాలి" అంటూ సుమిత్ర లోపలికి దారి తీసింది సుధతో.

ఆ తరువాత ఇరవై రోజులు సంతోషంగా, హాయిగా గడిచిపోయాయి.

ట్రెయిన్ ఎక్కించి, "ఉత్తరం రాయి వెళ్ళగానే, అతని ధ్యాసలో మర్చిపోకేం? అనవసరమైనవన్నీ ఊహించుకొని బాధపడకు" అంది సుమిత్ర.

ఆ వెళ్ళడం అత్తవారింటికి వెళ్ళి తిరిగి వచ్చారు.

రెండు నెలలు గడిచాయి.

ఆ సాయంత్రం రాజు చెప్పాడు.... మూర్తి ఉత్తరం రాశాడని.

"ఏవిటి విశేషాలు"? అంది సుధ.

"ఇన్నాళ్ళ నుండి నువ్వు ఆవిడకు ఉత్తరం రాయలేదటగా! అంతలా ఎవరిని చూసుకుని మరిచిపోయిందో ఈసారి ఆవిడకు రాయమన్నారుట".

"రాయాలనుకుంటూనే మర్చిపోయాను. ఏదో కాలేజి వర్కులో వీలులేకపోయిందని రాయండి ఆయనకు."

"అంతేనా? శ్రీవారి సాహచర్యంలో మిగతావి జ్ఞాపకం లేవని అంటావేమోనని ఆశించానే" అన్నాడు ఆమె కళ్ళలోకి చూస్తూ.

"అది ఇంకోళ్ళకు వ్రాసుకోవడమెందుకు? నేనెప్పుడో అది లోపల వ్రాసుకుని పదిలంగా దాచుకున్నాను" అంది సుధ, తన హృదయాన్ని స్పృశించి అతన్ని లాలనగా చూస్తూ.

"ఏదీ! ఎక్కడ? నే చూడవచ్చా" అంటూ ముందుకు వచ్చిన రాజు కొంటె తనానికి ఆమె సిగ్గుపడి "అది మీరు చూసినా అర్థం కాదులెండి. నా హృదయానికి తెలుసు" అంటూ నవ్వి, అతని చేతిలోని చీరచెంగు మృదువుగా విడిపించుకొంది.

ఇంటికొచ్చాక ఆమె మనసు తేలికగా, అతి మనోహరంగా వుంది. ఆరోజు కాలేజీలో శర్మ, వెంకటరెడ్డి తనని గురించి అల్లుతూన్న కథలు విని ఆమె మనసంతా కలత బారింది. బొంబాయి నుండి వచ్చిన కొత్తలో, రాజు ఊళ్ళో లేడని తెలిసి, ఆ రోజు రాత్రి కబుర్లు చెప్పడానికి వచ్చిన శర్మతో, ఓ పావుగంట పోయాక, "ఏదైనా మాట్లాడవలసి వస్తే, అవసరమైతే నేను కబురు చేస్తాను. అనవసరంగా మీరు రావద్దు' ' అని నిష్కర్షగా చెప్పినప్పటినుండి, అతడు పగ పట్టినట్టుగా వ్యవహరిస్తున్నాడు.

.... రోజులు గడచిపోతున్నాయి.

ఆ రోజు రాజు ముభావం ఆమె కర్థమవలేదు. అతని ప్రతి కదలికా తెలిసిన సుధ ఈ రోజు అతడెందుకో బాధపడుతున్నాడని గ్రహించింది. మర్రోజు ఆదివారం పొద్దుటే కాఫీ తాగి, పనుందంటూ వెళ్ళిన మనిషి ఒంటి గంటకు తిరిగి వచ్చాడు. మొహం, చెవులు ఎండలో తిరిగినట్టుగా చెప్తూ, ఎర్రగా వున్నాయి. మళ్ళీ సాయంత్రం 'రామం దగ్గరకు వెళ్ళాలి' అంటూ వెళ్ళిపోయాడు.

పొద్దుట నిజమయిన పనిలేదనీ ఇప్పుడు రామం దగ్గరకు వెళ్ళలేదనీ తెలుస్తూనే వుంది. ఉన్నట్లుండి ఆమెకు తట్టింది - నిన్న సాయంత్రం ఆ ఉత్తరం చూసినప్పటి నుండి అతనలా వున్నాడని.

అతడు రాత్రి వచ్చేసరికి పదకొండు దాటింది. వస్తూనే "ఇంకా మేలుకునే వున్నావా సుధీ! అనుకోకుండా రామంతో పిక్చరుకు వెళ్ళాను" అన్నాడు.

అతడు చెప్పిన పిక్చరు మొన్ననే వెళ్ళిపోయిందనీ ఆమె 'స్టాఫ్ రూం'లో వింది.

ఆమె ఆదరంగా అతన్ని చూస్తూ "భోజనం చేద్దాం" అంది.

భోజనం చేసి వక్క నములుతూ "నిన్నటి నుండి నాకేమిటోలా వుంది సుధీ. బాగుండలేదు" అన్నాడు.

అమాయకంగా వాడిపోయి వున్న అతని వదనం చూసి ఆమె మనసంతా ఆర్ద్రతతో నిండింది. అలసి నిద్రతో తూలుతూన్నట్టున్న అతని కళ్ళల్లోకి చూస్తూ "నిద్రపొండి - విశ్రాంతి మంచిది. నే జో కొడతాను ఏం?" అంది లాలలనగా చూస్తూ, అతని నుదురు తాకుతూ.

అయిదు నిముషాల్లో, ఆమె చేతుల్ని తన చేతిలో వుంచుకొని, చంటి పాపలాగా అతను నిద్రపోయాడు.

ఆ రాత్రి ఒంటి గంటకు సుమిత్రకు ఉత్తరం వ్రాస్తూ వుంది సుధ.

"…. నువ్వారోజున నేనూరికే అనుమానపడి బాధపడుతున్నాననన్నావ్ కదూ? నిజంగా నాది అనుమానమే అయి, అది నిజం కాకపోతే, నాకింకేం కావాలి అన్నానానాడు.

కాని అలా మమ్మల్ని మా జోలికి వదలరుగదా. నిన్న సాయంత్రం నుండీ రాజు అదోలా వున్నాడు. ఆ ఆదివారమంతా ఇంట్లో లేదు ఈ సాయంత్రం అతను బయటకు వెళ్ళిపోయాక, నిన్న వచ్చిన ఉత్తరం చూసినప్పటి నుండి అతనిలా వున్నాడని తట్టింది. 'నిన్న ఎక్కడ నుండి ఉత్తరం' అంటే 'ఇంటి దగ్గర నుండి. విశేషాలేం లేవు' అన్నాడు. కాని ఈ సాయంత్రం ఆలోచిస్తే నాకు నమ్మకం కలగలేదు. ఆ వచ్చిన ఉత్తరం చూడాలనిపించింది. నిన్న విప్పిన అతడి 'పేంటు' జేబులోనే వుంది ఉత్తరం. ఉండలా చుట్టివేశాడు దాన్ని. చూడాలన్ని వున్నా 'అతని ఉత్తరం గదా' తప్పనిపించింది. కాని శర్మ రాత తెలుస్తూనే వుంది. రాజు సంస్కారం చుట్టుపక్కలవాళ్ల స్థాయి మించకుండా యెన్ని చేయాలో అన్నీ చేశాడు శర్మ. రాజు బాధకు కారణం తెలుసుకోవాలన్న ఆత్రుత హెచ్చయి ఆ ఉత్తరం చదవవలసి వచ్చింది. నామీద ఎన్ని అభియోగాలయితే చేయొచ్చునో అన్నీ వున్నాయి. ఉత్తరం చివరన 'మీ శ్రేయభిలాషి' అని వదిలేశాడు శర్మ. అంత 'హితైషి' నా మీద రాసిన అభియోగాలు చూస్తే నాకే ఆశ్చర్యమైంది…. అన్ని కల్పనలు మనిషన్నవాడు ఎలా చేయగలడా అని?

ఈ రోజంతా గ్యమం లేకుండా తిరిగి ఇప్పుడే వచ్చాడు రాజు. నా చేతులు పట్టుకుని ప్రశాంతంగా నిదుర పోయాడు. అంత మమతతో - విశ్వాసంతో నిదురలో కూడా నా చేయి వదలని అతడి నుండి తప్పించుకోడానికి కారణం - నీకీ ఉత్తరం వ్రాద్దామనే.

కొద్ది కాలం నుండి నా కనుమానంగా వుండిపోయిన ఓ విషయం నాకు ఈ రోజే నమ్మకంగా తెలిసింది. నా మనసెంతో తేలికయింది.

ఏవిటో చెప్పనా?

మా పెళ్ళికి ముందు, అతని తల్లి దండ్రులు పెళ్ళయిన తర్వాత ఈ కొత్తకు ఇమడగలరా అని మధనపడ్డాను. నవీన జీవితావసర పరిస్థితులలో వాళ్ళు ఎక్కడో వుండి, మేమిక్కడ స్థిరపడిపోయాము. నేను అనుమానించిన ఆ 'అడ్డు' నేనేనాడు అనుభవించలేదు. ఆ పరిస్థితులూ, కుటుంబ వ్యవస్థ ఇలా మారిపోవడంతో నేను ఊహించిన దానికి ఆస్కారమే లేకపోయింది.

కాని కొత్త పద్ధతుల్ని అవలంబిద్దామని ముందుకు అడుగువేయాలనీ, కొత్త సమాజానికి బాటలు వేద్దామనుకునే ఈ నవీన యువ సంస్కారుల మనసుల్లోనే, వాళ్ళు చెప్పేటంత, నమ్మేటంత సంస్కారానికి

నిజమైన పునాది లేదని నాకీనాడు నమ్మకంగా తెలిసి వచ్చింది. రాజు లాంటి ఉన్నతుడే అలా అయేడంటే వేరే ఇంకేం చెప్పాలి; నా స్నేహాన్ని, సాహచర్యాన్ని, ప్రేమనీ మనసారా కాంక్షించాడు. నా ఉద్యోగాన్ని మనస్ఫూర్తిగా కొనసాగనీయాలన్నాడు. అతనుగా తన స్నేహితులను ఎందరినో పరిచయం చేశాడు. పార్టీలకు, పిక్నిక్‌లకు వెళ్ళాం. కాని.... కాని... వీటి వెనుక ఎక్కడో బలంగా నిలిచి పాతుకుపోయిన ఆ అభిప్రాయాల్లో అట్టే, మార్పు రాక, మనసులు నిజమయిన మార్పుకు తట్టుకుని హర్షించి, వ్యవహరించ లేకపోతున్నాయి.

పాలరాయిలా స్నిగ్ధంగా మెరిసే ఈ నిజం వ్యక్తిపరంగాదనీ, సమాజమంతటా అల్లుకుందని తెలసింది.

అందుకే నాకీనాడు ఈ మగవాళ్ళని చూస్తే అమితమైన జాలి పుట్టుకొస్తోంది. 'ఏమి మగవాళ్ళు!' అన బుద్ధివేస్తోంది.

రాజులాంటి నిజమైన సంస్కారి ఆ ఉత్తరం చదివి అరాయించుకోడానికి ఒకటిన్నర రోజులు ఊరంతా తిరిగి, నన్ను వెతుక్కుంటూ వచ్చి, పైన దొరకని శాంతి నా స్పర్శలో పొంది, నా వడిలో సుఖంగా నిదురించాడు.

నేను ఆర్టిస్టునైతే కొత్త పద్ధతిలో పరిశ్రమించి సృష్టించిన ఓ కొత్తరకం గులాబీని, వదనంలో ఎన్నో ఆశయాలు ప్రతిఫలించగా ఆ పుష్పాన్ని అందుకోబోతున్న యువకుడు ఆ అందుకోడంలో, క్రొత్త సృష్టిలో అనంతంగా వచ్చిన ముళ్ళు గుచ్చుకుంటూంటే, చూసి బాధపడుతూ ఆ గులాబీ నవీనతను, సౌమ్యతనూ, మృదుత్వాన్ని, మాధుర్యాన్ని గుర్తించి వదలకుండా, ఎటూ తేలని మనసుతో మధన పడుతూ ఉన్నట్టు 'జాలిగొలిపే సంస్కారి' అన్న మకుటంతో చిత్రించి వుండేదాన్ని.

కాని నాకు 'ఆర్టు' ఏం వచ్చును?

కనుక నిజ జీవితంలో ఇది అర్థం చేసుకొని, ఆ కళని జీవితంలో పొదిగి నిండుగా, హాయిగా జీవించాలని ఆశిస్తున్నాను. కళ ప్రయోజనమే విశిష్టమైన, సుస్పష్టమైన, కాంతి పథంలో నడిపించే జీవితమేగదా.

అందుకే నేను 'ఆర్టిస్టును' కాదని నాకీ నాడు, విచారం లేదు."

ఉత్తరం పూర్తిచేసి రాజు దగ్గరకొచ్చింది 'నా పిచ్చి రాజు' అనుకుంటూ. నిదురలో నుదిటి మీదకు జారిన అతని జుట్టు మృదువుగా దిద్ది, అతడు ఎంతో మమకారంతో ఫోటో కట్టించిన 'మర్ఫీ పాపాయిని'

చూస్తూ 'ఎలా చెప్పాలి? నాకింత సిగ్గుగా వుందేవిటి అతన్తో చెప్దామనుకుంటే' అనుకుని, మనసెందుకో ఆనంద ప్రపూర్ణమయి, అతని పెదవులు ఎంతో కాంక్షతో ముద్దిడుకొంది.

పెదవుల పైన ఆ స్పర్శే అతనిలో అమృతవాహినులు నింపినట్లు అతడు పులకరించి, ఆ నిద్దర మైకంలోనే ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

అతని కౌగిలిలో సుధ పొదిగింది. అతని శరీరమంతా అమృతమే నిండింది.

*(జ్యోతి మాస పత్రిక : ఫిబ్రవరి 1964)*



# జాజిపూలు

మొత్తానికి ఎలాగైతేనేం ఆ ఆదివారం మూర్తి తలంటు పోసుకున్నాడు. అతను వద్దని 'మారాం' చేసినా సాగలేదు. రాధ అన్న ఆ 'ఒక్క మాట' తోనూ ఆమె చెప్పినట్టు విన్నాడు. ఆమె చేతిలో కీలుబొమ్మై అయిపోయాడు.

ఎన్నో ఆదివారాలు వస్తాయి. ఎంతోమంది తలంటు పోసుకోవచ్చు. అలాంటిది మూర్తి తలంటుకు ఇంత ఉపోద్ఘాతమా అంటారేమో।

కాని,

మూర్తికి తలంటంటే ఎంతో బెంగ.

ఆదివారమంటే ఎంతో మమకారం, ముద్దూనూ.

ఈ పరిస్థితిని రాధ అన్న ఆ 'ఒక్క మాటా' విడగొట్టింది.

ఆదివారాల ప్రొద్దుట చాలా భాగం నిద్రలో తప్ప ఇంకోవిధంగా గడపటం అతనికేమాత్రం సరిపడదు. చదువుకొనే రోజుల్నించీ ఆ అలవాటు ఉంది.

ఇతర రోజుల్లో ఆఫీసు ఎలాగూ ఉంది. ఆదివారమైనా నిద్ర పోనీకుండా శ్రీమతి తలంటంటూ 'రూలు' పెట్టింది.

అది తప్పించుకునేందుకు అతను రకరకాలుగా, చిన్నపిల్లాడిలా మారం చేసేవాడు.

రాధ గోముగా లాలించి ఒప్పించేది.

ఒక్కోసారి మూర్తి నానా హంగామా చేసేవాడు. చివరకు రాజీ కొచ్చారిద్దరూ. ప్రతి పదిహేను రోజులకీ తలంటు.

అంటే ప్రతీ నాలుగు ఆదివారాలకీ రెండు ఆదివారాలు 'రెస్టు', రెండు 'తలంట్లు'.

ఈ ఆదివారం పొద్దుట రాధ లేపింది. తలంటు ఆదివారమని అతనికి తెలుసు. అంచేత సుతారామూ లేవాలని లేదు. మొండికేద్దామని చూశాడు.

"ఏడు అవస్తోంది లేవరూ?"

"అవస్తోంది గదా! ఐపోనీ. చటుక్కున నేనే లేచేస్తాను. నువ్వు మళ్లా రానక్కరలేదు కూడానూ" అంటూ ఇంకో ప్రక్కకి తిరిగాడు.

"నా బాబు గదూ! లేవండీ...పొద్దెక్కిపోతోంది"

"నా తల్లి కదూ! కాసేపు ఉండు. రాత్రి ఆలోచిస్తూ ఒంటి గంట దాకా నిద్ర పోలేదు తెలుసా? ఆ తర్వాతైనా కలత నిద్ర. పడుకోనీమ్మా."

నిజానికి మూర్తికి క్రితం రాత్రి నిద్దుర లేదు. శనివారం ఆఫీసులో ఉండగా జనార్దనం ఉత్తరం వచ్చింది. 'రేపు మూడింటికి వస్తున్నాను. స్టేషన్లో కలుసుకో' అని. చిన్ననాటి స్నేహితుడు. ఎన్నాళ్ళకో వ్రాసిన ఉత్తరం గడచిన గాథల్నీ, పాత సంగతులనూ జ్ఞప్తికి తెచ్చింది. ఆలోచిస్తూ రాత్రి చాలాసేపు గడిపాడు.

"అంత కలత నిద్ర ఎంచేతో? సన్నజాజి పూలు కలలోకొచ్చాయా?" అంది రాధ సన్నగా నవ్వుతూ.

'సన్నజాజిపూలు' అన్న ఆ 'ఒక్కమాట' అతనిమీద 'మాజిక్'లా పనిచేసింది. చటుక్కున కళ్లు తెరిచాడు. అమాయకంగా భార్య వేపు చూసాడు.

"మరింకేం? కళ్ళు తెరిచారుగా...లెండి"

మూర్తి చప్పున లేచి, మౌనంగా నడిచి, ముఖం తోముకుని, ఎంతో నెమ్మదిగా, మరెంతో బుద్ధి మంతుడిలా తలంటు పోసుకున్నాడు.

తల టవల్‌తో అద్దుతూ "మా బంగారు తండ్రల్లే పోసుకున్నారే ఇవాళ" అంది గమ్మత్తుగా నవ్వుతూ రాధ.

ఆ నవ్వు అర్థం అతనికి తెలుసు. పేపరులో తల దూర్చాడు.

"ఫ్లాస్కులో కాఫీ ఉంది. నేనిప్పుడే అరగంటలో వస్తాను" అంటూ జడ విప్పుకుంటూ లోపలికి వెళ్ళింది రాధ.

కాఫీ తాగి, సిగరెట్టు కాలుస్తూ జనార్దనం ఉత్తరం తీసి మళ్ళా చదివాడు.

ఎన్నాళ్ళకు వ్రాసాడు జనార్దనం?!

వీడెప్పుడూ అంతే. దగ్గరున్నంతసేపూ మనసిచ్చేస్తాడు. దూరంగా వెళ్తే ఇక అంతే.

జనార్దనంతో ముడిపడిన బాల్యస్మృతులూ, స్నేహం తలచుకున్నాడు.

ఇద్దరిదీ ఒకే వూరు. కలిసి పెరిగారు. కాని ఇద్దరి ఆలోచనలూ, ఇష్టాలూ చాలా దూరం.

జనార్దనంలో దుడుకుతనం, సాహసం హెచ్చు. ఆటలంటే మక్కువ. మూర్తికి నీలి ఆకాశం, పువ్వులు, పక్షులు ఇవే ప్రపంచం.

జనార్దనం కాలేజీ టీములో హాకీ ఆడుతూంటే మూర్తి పడమటి దిక్కుని వెలిగించే కాంతినీ, జనార్దనం కాలి కింద నలిగి జాలిగా తలెత్తే పచ్చికనూ చూస్తూ కూచునేవాడు.

వారి ప్రవృత్తులు వారి స్నేహానికేనాడూ అడ్డు రాలేదు. కాలేజీ రోజుల్లో ఇద్దరూ ఒక రూములో ఉండి చదువుకునేవారు. మూర్తిని తల్లిలా సాకేవాడు జనార్దనం. కాఫీ కాచి ఇచ్చేవాడు. బట్టలు సర్దేవాడు.

"నీ భార్యగా ఎవరొస్తారో గానీ నిన్ను పాపాయిలా చూసుకోవాలిరా బాబూ" అనేవాడు జనార్దనం.

మెత్తగా నవ్వి వూరుకునేవాడు మూర్తి.

"పెళ్ళాం అంటేనే అబ్బాయి గారికి కులుకుగా ఉందే" అని ఫెళ్ళున నవ్వేశాడు జనార్దనం.

వాళ్ళు ఆనర్సులో చేరిన మూడో సంవత్సరం సెలవుల్లో ఇద్దరకూ వింత అనుభవాలు జరిగాయి. జనార్దనం ఎవరికీ చెప్పకుండా ఎటో పోయి, చివరికి మిలిటరీలో చేరానని చాలా కాలానికి ఉత్తరం వ్రాశాడు.

ఆ సెలవుల్లో తల్లి పట్టు మీద మూర్తి మేనమామగారి వూరెళ్ళాడు.

ఊర్మిళ - మేనమామ కూతురు - రెణ్ణెల్ల పిల్లని చూపించి "ఎవరి పోలికో చెప్పుకో - పెళ్ళిలో ఆయన్ని చూశావుగా" అంది.

"ఇంకొంచెం పెద్దవుతే గాని పోలిక చెప్పడం కష్టం" అన్నాడు మూర్తి నిద్రలో పాప నవ్విన చిన్ని నవ్వుని వివశుడై చూస్తూ.

సాయంత్రం పాపకు "ప్రెజెంటు" కొని ఊర్మిళ గదిలో అడుగుపెడుతూ "మీ పాపకు ప్రెజంటు తీసుకొచ్చాను. ఏమిటో చెప్పుకో చూద్దాం" అన్నాడు. అంటూనే అక్కడే ఆగి పోయాడు.

ఊర్మిళ ప్రక్కనే సోఫాలో ఇంకో అమ్మాయి కూచుని ఉంది. కంఠస్వరానికి చురుగ్గా తల ఎత్తి,

సూటిగా చూస్తోంది. మూర్తి ఖంగారు పడ్డాడు.

"నా ఫ్రెండు సరోజ. పక్కింటి రావుగారు వీళ్ళ బాబాయ్. సెలవలకు వచ్చింది. మా మేనత్తగారి అబ్బాయి మూర్తి" అని ఊర్మిళను పరిచయం చేసింది.

సరోజ "ఏం చదువుతున్నారు?" అంది.

"ఆనర్స్"

"ఎక్కడ?"

చెప్పాడు.

"నేనూ అక్కడే...కాలేజీలో" అంది.

ఆమె అతని కళ్ళల్లోకి చూసి మాట్లాడుతోంది. తొందర, ఖంగారు లేదు. నిబ్బరంగా ఉంది. మూర్తి మాత్రం బెదురుగా క్రిందకు చూస్తూ మాట్లాడేడు. ఆమె వదనంల, కంఠంలో కొట్టుకొచ్చినట్టు కనబడే ఠీవీ, దర్పం చూసి.

సూటిగా చూసే చిన్ని కళ్ళు, పొడుగ్గా కొనదేలిన నాసిక. పసుపు లోకి విరగబోయే చామనఛాయ - ఇవన్నీ ఆ ఖంగారులోనే "నోట్" చేశాడు.

మర్రోజు ఆమె అతన్ని వాళ్ళ బాబాయ్‌గారి ఇంటికి తీసుకెళ్లింది. అక్కడున్న మిగతా రోజులన్నీ అతనికి ఆమె సాన్నిధ్యంలో అతి తొందరగా గడిచిపోయాయి.

సెలవులు అయిపోగానే ఇద్దరూ కలిసే బయలుదేరారు వైజాగ్.

ట్రెయిన్ బయలుదేరేముందు రావుగారు "అమ్మాయి ఒక్కతే ఉంది. ఏదైనా కావలిస్తే చూడండి. కాస్త మా 'సరూ'ని వాల్తేరు దాకా జాగ్రత్తగా తీసుకెళ్ళండి." అన్నారు మూర్తితో.

సరోజ గమ్మత్తుగా నవ్వింది.

"నువ్వు దురభిప్రాయంలో ఉన్నావ్ బాబాయ్! వారినే నేను జాగ్రత్తగా తీసుకెళ్ళాలి. అసలే మెత్తని మనిషి'

ఆయన తేలిగ్గా నవ్వేస్తూ "నువ్వే చెప్పవోయ్! ఆడపిల్ల అంత ధాటీగా మాట్లాడ్డం మంచిది అంటావా" అన్నారు.

ఆమెను సంభ్రమంతో చూస్తున్న అతనికా మాటలు వినబడలేదు.

విశాఖపట్నం చేరే ముందు ఆమె వాళ్లింటికి రమ్మనమని ఎడ్రసు ఇచ్చి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిన వేపే చూస్తూ ఉండిపోయాడు.

వారం తర్వాత వెళ్ళాడు. ఆ వారం రోజులూ ఆమె అతని మనసులో వెలుగుతూనే ఉంది.

"ఇన్నాళ్ళకు వచ్చారా? వెంటనే వస్తారనుకున్నాను" అంది సరోజ.

"ఎందుకలా అనుకున్నారు!" అన్నాడు ఆమె కలుపుగోలుతనానికి ధైర్యం తెచ్చుకుంటూ.

"మీరే చెప్పండి. ఈ వారం రోజులూ మీరు ప్రతి రోజూ అనుకోలేదా?"

అలా అని అంత సూటిగా చూస్తుందేవిటి? ఆ మాట అన్న తర్వాత ఆమె పెదవుల చివర మెరిసిన ఆ చిరునవ్వు కోసం రోజూ రావాలనే అనిపించింది.

అతనక్కడ వున్న ఆ సంవత్సరమూ ఆమెను దేవతా ఆరాధించాడు. అందమూ, దర్పమూ, ఠీవీ ఉన్న ఆ దేవత అనుగ్రహం కోసం అతను వేచి యున్నాడు.

ఆమెకు జాజిపూలు ఇష్టం. అది గ్రహించి మూర్తి ఓ రోజు ధైర్యం చేసి జాజిమాల తీసుకొని వెళ్ళాడు. ఆమెకు ఇవ్వడానికి ధైర్యం లేదు. లాల్చీ జేబులో నలిగిపోతూంది మాల.

"నాకోసమని తెచ్చి జాజులు ఇవ్వడం మరచిపోయినట్టున్నారే?" అంది.

"మీకెలా తెలిసింది?" గొణిగాడు.

"జాజిపూలనైతే దాచారు గాని, సువాసన విరజిమ్మేస్తోంది గదండీ! చప్పున ఇవ్వండి"

అతని హృదయం ఉప్పొంగిపోయింది. ఎంతో భక్తితో ఇచ్చాడు.

ఆ తర్వాత వెళ్ళినప్పుడల్లా జాజిపూలు పట్టుకెళ్ళేవాడు. అమె అభిమానంతో స్వీకరించేది.

చదువు అయిపోయి విడిపోయే రోజులొచ్చాయి. ఆ రోజు బీచ్‌లో అతనికి తొందరగా ఉంది.

ఆమె చేతికి జాజులు అందించి, "చాలా కాలం బట్టి అడుగుదామనుకుంటున్నాను. చదువు అయిపోవచ్చింది గదా! ఏం చేద్దామనుకుంటున్నారు?" అన్నాడు.

"మీరు అడుగుదామనుకుంటున్నది అది కాదు - అవునా?' అన్నది.

అతను తత్తరపడ్డాడు.

"అవును. నిజమే.... నా జీవితానికి తోడు కావాలి..."

"నే ననుకుంటూనే ఉన్నాను. ఏనాడో ఈ ప్రశ్నకు జవాబు చెప్పాలని, నేనూ చాలా ఆలోచించాను. లాభం లేదు. నా తత్వం నీకు సరిపడదు మూర్తీ! నిన్ను ఎంతో జాగ్రత్తగా పసిపాపలా చూసుకోవాలి. నాలో ఆ నేర్పు లేదనిపిస్తుంది. నా తీరు వేరు. నీకు సరిపడదనిపిస్తుంది" అని ఓ నిమిషం ఆగి పూర్తిజేసింది. "మనం మంచి స్నేహితులగానే విడిపోదాం. నువ్వు ఈనాడిచ్చిన జాజిమాల నీకే ఇస్తాను... ఆ జాజుల పరిమళంలా నిలిచిపోనీ మన స్నేహం."

...అలా విడిపోయారిద్దరూ.

ఆ తర్వాత రాధతో వివాహం.

ఓ వెన్నెల రాత్రి రాధతో సరోజ, జాజిపూలు, తన ఆరాధన అన్నీ చెప్పాడు.

చెప్పి నవ్వాడు. ఆ వదనంలో అమాయకత్వం, ఆ నవ్వులో ఇమిడిన స్వచ్ఛత...ఇది రాధకు ఎంతో ఇష్టం.

అంతా విని ఆమె కూడా నవ్వింది. అలా నవ్వుతుందనీ, నవ్వగలదనీ అతనికి రాధంటే అంత గురి.

అప్పుడప్పుడు జాజులు తెచ్చి పెట్టమని అతన్ని ఉడికించేది. అతని ముఖం కందగడ్డలా అయిపోతే, దగ్గరకొచ్చి లాలించేది.

జాజిపూలంటే అతనికీనాటికీ మక్కువ. ఆ మక్కువతో పెనవేసుకున్న అతని తీరు పూర్తిగా ఆమెకు తెలుసు. అతని ఆ ఇష్టం తమకేం హానీ కలుగజేయదనీ ఆమెకు తెలుసు. పైకి మాత్రం అప్పుడప్పుడు ఆ జాజిపూలు పేరు చెప్పి ఉడికించేది.

పెరటిలో జాజిపూల తీగ నాటింది.

× × × × × ×

మధ్యాహ్నం టీ తాగి స్టేషనుకు వెళ్ళే హడావిడిలో వున్నాడు మూర్తి.

గదిలోకి వచ్చిన రాధను చూసి "నేను జనార్దనాన్ని తీసుకు వస్తాను. కాకరకాయ వండు వాడి కిష్టం" అన్నాడు టై నాట్ సరిచూసుకుంటూ.

"ఓ నిమిషం ఆగండి - నేనూ వస్తున్నాను స్టేషన్‌కి. 'సరూ' వస్తోంది...రిసీవ్ చేసుకోవాలి" వస్తున్న నవ్వును ఆపుకొంటున్నట్టుగా మొహం పెట్టి అంది.

అతను బిత్తరపోయాడు.

"వేళాకోళానికైనా సమయముంది సుమీ"

"ఇదేవిటండీ - మా స్నేహితురాలు ఎన్నాళ్ళకో వస్తున్నాను, స్టేషనుకు రమ్మని వ్రాసింది. వెళ్ళడం తప్పంటారా?"

"మరి 'సరూ' వస్తోందన్నావ్?"

"బాగానే వుంది! అందరు 'సరూ'లు మీ సరోజ లేనేవిటీ? వచ్చేది మా సరస్వతి. ఇక పదండి పోదాం"

అతనికంతా ఏవిటోలా ఉంది. స్టేషనుకు వెళ్ళేదాకా అతను ఏం మాట్లాడలేదు.

ట్రెయిన్ రాగానే ఆతృతగా చూసున్న మూర్తిని అంత దూరం నుంచే చూసి పెద్ద, పెద్ద అంగలు వేసుకుంటూ వచ్చి కౌగలించుకున్నంత పనిచేశాడు జనార్దనం.

"ఇంకా మున్నపడ్డావ్! నిన్నింత సుకుమారంగా చూసుకుంటూన్న మా చెల్లిని చూడాలని ఉందిరా' ' అన్నాడు.

రాధ కోసం చూసాడు మూర్తి.

అప్పుడే బోగీ నుండి దిగి ఠీవిగా, రాణిలా నిలుచుని 'సరూ', ఒక నిమిషంలో ఆమె ప్రక్కన రాధ. ఇద్దరూ నవ్వుకుంటున్నారు.

మూర్తికి మతిపోయినంత పని అయింది.

'సరూ', రాధ కలిసి వస్తున్నారు.

ఇద్దరూ దగ్గర కొచ్చారు.

"ఇదిగోనండీ మాస్టరూ ! వస్తోందని చెప్పినా నమ్మలేదుగా మీరు. మా సరస్వతిని చూసైనా నమ్ముతారా?" అంది రాధ. సరోజినిని చూశాడు మూర్తి. అతని నేనాడూ ఎరగనట్టున్నాయామె చూపులు.

"పరిచయం చేసే ఛాన్సు 'ఈవిడెవరో నానుండి కొట్టేసారు. అయినా చెప్తాను. బైదిబై సరోజని

చిన్నప్పుడు హైస్కూలు చదువుదాకా సరస్వతి అనేవారుట. కాలేజిలో సరోజ అయింది. అసలు సంగతి చెప్పలేదు. మై బెస్ట్ హాఫ్. మొన్న వింటర్‌లో పెళ్ళయిందిలే. నీకు ఇన్విటేషను పంపడం జరగలేదనుకుంటాను. అంతా సడెన్ అనుకో. నీకు 'సర్ప్రైజ్' ఇద్దామని ముందుగా వ్రాయకుండా తీసుకొచ్చాను'' అన్నాడు జనార్దనం.

ఈసారి మూర్తి పని మరీ అయోమయమైపోయింది. ఏదో కలలో ఉన్నట్టుగా ఉంది. టాక్సీ ఇంటి దగ్గర ఆగేదాకా అలాగే ఉన్నాడు.

అతని మనసులో ఒకటే ప్రశ్న. రాధకు ఈ 'సరూ' ఆ 'జాజీపూల సరూ'' అనీ తెలుసా?

తెలిస్తే పాత కథ విన్నంత సరదాగా, తమాషాగా, తేలిగ్గా ఇప్పుడు వుండగలదా? గడచిన సంగతులు స్మృతులుగానే భావించి రాధ లాలనతో తను హాయిగా ఉన్నాడు. రాధ ఈ జీవితాన్ని స్వర్గంగా చేసింది. ఆ స్వర్గమే తనకి దూరమై జారిపోతే తను మనిషి కాలేడు. జీవితంలో ప్రలోభమే నశిస్తుంది. చందనం లాంటి రాధ పొందుని తను వదులుకోలేడు. తనకీ రాధకీ మధ్య ఈనాటి వరకూ అడ్డు తెరలు లేవు.

కాని...కాని ఈ విషయం ఆమెకు తెలీకపోతే తనుగా చెప్పకూడదు.

భాధ లేకుండా చూచి సరోజతో ముందుగానే చెప్పాలి. ఇంటి కొచ్చిన దగ్గర నుండీ అతనికి అవకాశం దొరకడంలేదు.

జనార్ధనం ఇల్లంతా అలంగం తిరుగుతూ, మాటలు చెప్తూ, పాటలు పాడుతూ అతనికి ఊపిరి సలపనివ్వకుండా చేస్తున్నాడు. ఇక రాధ, సరోజ వదలకుండా కబుర్లు. ఆ మాటల్లో సరోజ చెప్పేస్తుందేమో!'

అతనికి ముళ్ళ మీద వున్నట్టుగా వుంది. ఇంతలో సావకాశం దొరికింది.

జనార్ధనం బట్టలు మార్చుకుంటున్నాడు. రాధ స్నానం చేస్తోంది.

సరోజ కోసం వెతికి పట్టుకున్నాడు పెరటలో సన్నజాజి పందిరి దగ్గర.

అతని గుండె కొట్టుకుంటోంది.

"మీరు...మీరు...... రాధతో మన సంగతి చెప్పొద్దు. అటే రాధ సంస్కారాన్ని తక్కువ చేస్తున్నానని అనుకోవద్దు. నేనన్నీ చెప్పలేను. నాకు మీరు ఈ స్వర్గాన్ని నిలబెట్టాలి.

ఆమె నవ్వింది, నిండుగా. ఆ నవ్వు అర్థం అతనికి తెలుసు. అతనిలో ధైర్యం పుంజుకుంది. సరోజ మీద అతనికా నమ్మకముంది.

ఆ తరువాత వాళ్ళు వున్న నాలుగు రోజులూ అతి ఉత్సాహంగా గడిపారు.

వాళ్ళువెళ్ళిపోయే రోజువచ్చింది.

జనార్ధనం 'షేవ్' చేసుకుంటున్నాడు. రాధ స్టేషనుకు వెళ్ళే ప్రయత్నంలో గదిలో వుంది.

అంతలో సరోజ వచ్చింది.

"మీ రాధ సాన్నిహిత్యం నాకు దేవుడిచ్చిన వరం. మీరు తొందరపడి ఏం చెప్పలేదు. కృతజ్ఞుణ్ణి" అన్నాడు మూర్తి.

చుట్టుకున్న సిగ చేత్తో సద్దుకుంటూ ఆమె నవ్వింది. అదే నిండైన నవ్వు. ఆ పెద్ద సిగ ఆమె వదనంలోని ఠీవిని ఇంకా పెంచుతోంది.

" నా కృతజ్ఞతకు చిహ్నంగా మీరీ జాజిపూలు" అని జాజులు దొసెట్లో తీసికెళ్లి ఆమె కిచ్చాడు.

ఆమె మాల కట్టింది.

మాలలో కొంచెం తెంచి అతనికిచ్చి "మన స్నేహానికి గుర్తుగా ఉంచండి. నాకు తెలుసు. మా రాధ మీకు తగినదని" అంది.

ఇంతలో రాధ వచ్చింది.

అరగంటలో బయల్దేరి స్టేషనుకు వెళ్ళారు. రాధ, సరోజ పెట్టెలో కూచున్నారు.

మూర్తి, జనార్ధనం ప్లాట్‌ఫారమ్ మీద మాట్లాడుకుంటున్నారు.

సరోజ నవ్వుతూ అంటోంది.

"ఈ మగవాళ్ళ అమాయకత్వం తలుచుకుంటే నాకు నవ్వొస్తోందే రాధా? నిజంగా నీకేం తెలీదనే అతని నమ్మకం. ఈ మూర్తి సంగతి ద్వారానే మీ నాన్నగారికి తెలిసిందనీ, అందుకే మా రాధ తనకి దక్కిందనీ తెలిస్తే అతని ఖంగారు చూడాలనిపిస్తోంది. అన్నీ అతనికి చెప్పనా?"

"ఆ పని చెయ్యకు సుమీ! ఆయనసలే సున్నితం" అంది రాధ.

"అబ్బో! అంత వెనకేసుకు రానక్క లేదులే, అయినా అతని నమ్మకాన్ని నేనెందుకు చెడగొట్టాలి. నాకు తెలుసు. అతనికి ఆ మాత్రం పట్టుకొమ్మలాటి ఆడది కావాలి. నాలో ఆ గుణం లేదని తెలిసి అతన్ని కాదన్నప్పుడు, నీ సంగతి తట్టింది. నీకు వ్రాసి, మీ నాన్నగారికి వ్రాయించాను. - అతని సంగతి"

"అలాటి మనిషిని నాకిచ్చినందుకు నీకు చాలా ఋణపడి ఉన్నాను'' అంది రాధ.

సరోజ జాజిపూలు తీసి రాధకు చూపించి, "మీ ఆయన గారి వీడ్కోలు బహుమానం తెలుసా?'' అంది వెక్కిరిస్తూ.

ఆ మాల తన చేతుల్తో సరోజ సిగలో అమర్చి అంది రాధ.

"మగవాళ్ళల్లో ఆ మాత్రం సన్నటి చీలిక ఉంటుంది. మనం అది అర్థం చేసుకుని, మన్నించగల నేర్పు ఉండాలి. లేకపోతే ఎన్ని ఈ  ఈసులు, ఎన్ని అనర్థాలు''

× × × ×× × ×

ఆ రాత్రి డాబా మీద నిద్ర పోయిన అతని వదనంలోకి తృప్తిగా చూస్తూ అతను భద్రంగా దాచుకున్న 'సరూ' ఇచ్చిన జాజిపూల మాల అతని లాల్చీ జేబులోంచి తీసి ఆమె తన తలలో అమర్చుకుంది.

చల్లని వెన్నెల, అనురక్తయైన ప్రేయసిలా వార్దిదరినీ అములుకొంది.

*(జయశ్రీ మాసపత్రిక : ఏప్రిల్ 1966)*



# పురోగామి

శేఖరానికి పల్లెటూళ్ళంటే ఓ విధమైన అసహనంతో కూడిన ఏవగింపు. ఆ పల్లెటూళ్ళూ, ఆ వాతావరణం, ఆ కక్షలూ, స్పర్థలూ, రచ్చబండ రాజకీయాలూ, శ్కాండల్స్ - ఇవన్నీ అతనికెంతో వెగటు. తన సంస్కారం, చదువు వీటన్నింటికీ ఎత్తున, ఎంతో ఎత్తున వుందని అతని నమ్మకం.

అందుకే అతనికి తల్లి మాటలు రుచించడం లేదు.

ఆఖరిసారిగా చెబుతూన్నట్లు ఆవిడ అంది.

"నువ్వు ఈ విషయంలో ఇంత మూర్ఖంగా వుంటావని ఏనాడూ అనుకోలేదు. నువ్వు అమెరికా నుండి తిరిగి వస్తున్నావని తెలిసిన ఈ రెణ్ణెల్ల నుండి కంట్లో వత్తులు వేసుకు చూస్తున్నట్టుగా వుంది. ఏడెనిమిదిసార్లు ఇప్పటికే కబురు పంపింది. పెద్దది - అమ్మమ్మని చూసివస్తే నీదేం పోతుందో నాకర్థమవడం లేదు."

"అంతలా నన్ను చూడాలని వుంటే ఆవిడే ఇక్కడి ఓసారి రాకూడదూ?" అతని మాటల్లో చిరాకు స్పష్టం.

"నువ్వలాంటి మాటలు మాట్లాడకు. ఎప్పుడైనా ఆ పల్లెటూరు వదిలి వచ్చిందా ఏమిటి? చిన్నతనంలో దేవుడే అన్యాయం చేశాడు. ఈ రోజున నీలాంటి వాళ్ళు ఇలా బాధ పెడితే సహించక ఏం చేస్తుందిలే?"

అతని తల్లి కళ్ళల్లో తడి. సెంటిమెంట్‌కు దూరంగా వుండాలని అతని ప్రయత్నం.

"అంతగా చెబుతోంది గదా ! పోనీ వెళ్ళి అమ్మమ్మనోసారి చూసిరా" అన్నాడు తండ్రి ఆఖరికి.

ఆ మధ్యాహ్నం మృణాళిని నుండి ఉత్తరం వచ్చింది. అతనెంతో ఆతురతతో అందుకున్నాడు నీలం కవరు. లేత నీలంరంగు కాగితం. అందమైన కాగితం. అందమైన అక్షరాలు. మృదువైన పలకరింపులు. ఎప్పుడు వస్తున్నావని ప్రశ్న. చప్పున రావాలి సుమా... అన్న హెచ్చరికతో కూడిన ఆజ్ఞ. ఆఖరున వ్రాసింది 'నీకు మా బెంగాల్ అంతా చూపించాను. మీ ప్రాంతం విశేషాలన్నీ వచ్చినప్పుడు చెప్పాలి !'.

ఆ ఉత్తరాన్ని అంటివున్న మృదువైన సెంటు వాసనలాగే అతని మనసంతా గాలిలో తేలి ఆడింది.

ఆ సాయంత్రం శేఖరం ఆ పల్లెటూరు వెళ్ళి అమ్మమ్మని చూడ్డానికి ఒప్పుకొన్నాడు.

"వచ్చే సోమవారం బయలుదేరి వస్తున్నానని అమ్మమ్మకు ఉత్తరం వ్రాయండి".

ఆ అమ్మమ్మ అతనికి స్వయాన అమ్మమ్మ కాదు. తల్లి పినతల్లి. శేఖరం చిన్నతనంలో, అతని తండ్రి ఉద్యోగరీత్యా, ఐదారు నెలలకోవూరు బదిలీ అవుతూంటే, ఆ అమ్మమ్మ దగ్గర వుండి చదువుకున్నాడు. ఎనిమిదవ క్లాసు దాకా. అతనక్కడ వున్నన్నాళ్ళూ ఆవిడ అతన్ని చాలా ముద్దుగా, మురిపెంగా చూసుకొంది. లాలనతో పెంచింది.

అతనికి తన చిన్నతనం, ఆ వూళ్ళో చదువుకోవడం అన్నీ సగం సగం జ్ఞప్తికి వస్తున్నాయి. ఊరి చెరువులో ఈతలు కొడుతూ స్నానం, విష్ణాలయంలోని ధ్వజస్తంభం చుట్టూ తిరుగుతూ ఆటలూ, ఆలయంలో గన్నేరు పూలు ఏరడం, పూజారి పెట్టే ప్రసాదానికి చేతులు చాచడం, గుళ్ళో గంటలు కొట్టడానికి ఆత్రం, మునసబుగారి తోటలో మామిడి కాయలు దొంగతనంగా తినడం... అన్నీ లీలగా గుర్తుకొస్తున్నాయి. ఆ చిన్నతనంలో ఆ పల్లెటూరు, ఆ వాతావరనం... అన్నీ గొప్పగా వుండేవి. అలా తను చిన్నతనంలో ఫీల్ అయినందుకు శేఖరానికి ఈనాడెందుకో చిన్నతనమనిపిస్తోంది.

శాస్త్రం, విజ్ఞానం పెరిగి, ప్రపంచమంతా అతి వేగంగా మారిపోతున్న ఈ రోజుల్లో కూడా ఆ పల్లెటూళ్ళు ఎదగవని, అతనికి కోపం.

ఆ సోమవవారం రైల్లో హాయిగా మొదటి తరగతి మెత్తలపై జారబడి అతడు మెత్తని మధురమైన ఊహలలోకి జారిపోయాడు. ఈ పల్లెటూరి అనుభవం మృణాళినికి చెప్పాలి. వింతగా చూస్తుంది - ఆ పెద్ద కళ్ళతో. ఆమె వ్రాసిన ఉత్తరం తీసుకొన్నాడు. ఆ నీలం కాగితం, ముద్దొచ్చే ఆ అక్షరాలూ, ఆ కాగితాలు వెదజల్లే సన్నని, హాయైన పరిమళం అతన్ని ఏదో లోకాలలోకి తీసుకుపోతోంది.

ఆ సెంటే మృణాళిని వాడుతుంది. ఏ సెంటు అంటే చెప్పదు. పైగా తన వళ్ళే సెంటుట... ఎంత కొంటెగా చూసిందీ ఆ మాట అని.

అతనికి మెళుకువ వచ్చేసరికి నాలుగైంది. నాలుగున్నరకు అతను దిగే స్టేషను వచ్చింది. ఆ చలిగాలిలో అతను ఆ స్టేషనులో చాలా చిరాకుగా దిగేడు.

ఈ చీకట్లో, చలిగాలిలో ఇంకా ఆరు మైళ్ళు పోవాలి. ఎలాగో?

అతనికి చాలా చిరాకుగా ఉంది. అందుకే ఈ పల్లెటూళ్ళ ప్రయాణమంటే అతనికంత మంట.

"బండి తెచ్చేను బాబు! ఎల్దారేటి?"

చూసేడు. ముసలితనం గూడు కట్టిన ముఖం.

"నాను సుబ్బన్నని బాబూ! మర్చిపోనారేటి? అమ్మమ్మగోరు మీరొత్తున్నారని బండంపారు."

ఎలా వెళ్ళాలా అని మథన పడుతున్న శేఖరానికి ఆ మాట హాయిగా వినిపించింది.

బండిలో సామాను పెట్టి, అతను ఎక్కాక బండి కదిలించాడు సుబ్బన్న. ఊరు దాటాక చలి ఎక్కువైంది. శేఖరానికి వణుకు లాటిది వచ్చింది.

"చలేత్తే ఆ రగ్గు కప్పుకోండి బాబూ! అమ్మమ్మగోరు ఇచ్చారు. ఆ మూల చాప కింద ఎట్టాను. మీకు సుఖంగా వుంటానికి బండిలో పరుపు కూడా ఏయించినారు అమ్మమ్మగారు. మీ కోసం మహా చూత్తుండార లెండి, మీరొత్తున్నారని పెళ్ళంత అడావిడి సేత్తున్నారు" అన్నాడు సుబ్బన్న.

రగ్గు కప్పుకొన్నాడు. వెచ్చగా వుంది. బండి గతుకుల బాట మీద పోతోంది. అతనికి మళ్ళా చిరాకు కలిగింది. సుబ్బన్న మధ్య మధ్య ఎద్దుల్ని అదిలిస్తూ, చిన్నగా ఏదో పాట పాడుతున్నాడు. ఎద్దుల మెళ్ళో మువ్వల చప్పుడు వింతగా వుంది. నక్షత్రాలు ఆకసం నిండా పువ్వులు పరుచుకొన్నట్టుగా వున్నాయి. అవి ఒక్కొక్కటీ కరిగిపోతున్నాయి. క్రమంగా తూరుపున, తెల్లబడుతోంది. అతనికి పైకి చెప్పుకోడానికి ఇష్టం లేకపోయినా ఆ వాతావరణం, ఎద్దుల మెళ్ళో మువ్వల శబ్దాలూ, ఆకాశంలో ఆయాచితంగా లభించిన అద్భుత దృశ్యం అతనికి చాలా మనోహరంగా ఉంది. సూర్యోదయ సమయం ఇంత ఆహ్లాదంగా వుంటుందా అనిపించింది, ఈ మధ్య ఎన్నడూ ఆ అనుభవం లేని శేఖరానికి. నెమ్మదిగా అతడు పరుపు మీద వాలాడు. వెచ్చగా వళ్ళంతా రగ్గు కప్పుకొన్నాడు. మగతగా ఆకసంలో మార్పుల్ని వింతగా అప్రతిభుడై చూస్తున్నాడు. అతనికి నిద్ర పట్టింది. మెలకువ వచ్చేటప్పటికి ఇంటి ముందు బండి ఆగి వుంది. బద్ధకంగా లేచి బండి దిగాడు. ఎదురింటి వాళ్ళు అతన్నే గుచ్చి, గుచ్చి చూస్తున్నారు.

ఇంట్లోకి వెళ్ళాడు. 'కాఫీ' కోసం మారాం చేస్తోంది ప్రాణం, అది తాగితేకాని అతనికి పనులేవీ జరగవు. ముఖం కడుక్కోడానికి వేడినీళ్ళందించి 'అమ్మమ్మగారు పూజలో వుండారు" అన్నాడు సుబ్బన్న. ముఖం కడుక్కొన్నాడు.

"కాఫీ లాంటిదేదైనా దొరుకుతుందా ఈ ఇంట్లో?" అన్నాడు.

"అదేటండోయ్! మీరొత్తున్నారని పట్నం నించి పెసల్ కాఫీ పొడరు తెప్పిస్తే అమ్మమ్మగారు" ఫ్లాస్కు వంచి కప్పులో అందించాడు.

"ఇది ఎంత ఘోరంగా వుంటుందో" అనుకుంటూ తాగేడు. ఒక్క 'సిప్' తోనే అతనికి ఆశ్చర్యం కలిగింది. చాలా బావుంది కాఫీ. రెండో కప్పు పోసుకు తాగేడు. ఆ తర్వాత అతనికి కాస్త ప్రాణం వచ్చినట్టు అనిపించింది. చాలా ఉత్సాహంగా చుట్టూ చూశాడు, ఈసారి మరీ ఆశ్చర్యపోయాడు.

ఆ గది అలంకరణ చాలా 'నీట్'గా వుంది.

"మీరొత్తున్నారని కరణం గోరింట నించి రేడియో తెప్పించారు. చదువుకోనానికి పట్టంలో సదూతూన్న ఎంకట్రాజుగారి చిన్నబ్బాయిగోరి పుస్తకాలు తెప్పించారు. ఆ ఫ్లాస్కో, కుర్చీలు పట్నం నుండి నానే కొని తెచ్చినా" అన్నాడు సుబ్బన్న.

ఎదురుగుండా వున్న గది గుమ్మానికి గాజు పూసలతో కూర్చిన జాలరి వుంది. రకరకాల పూసలు - చాలా బావున్నాయి. ఆ గది దగ్గరకొచ్చి ఆ జాలరి ముట్టుకొన్నాడు. పూసలన్నీ కదిలాయి - కదుల్తూ చిన్న, చిన్న శబ్దాలు. ఎండపొడ పడి గాజు పూసలు మెరుస్తున్నాయి.

ఇంతలో అతని అమ్మమ్మ వచ్చింది. అతన్ని చూడగానే బిళ్ళల్లాంటి ఆ కళ్ళు గప్పున వెలిగాయి.

"వచ్చావా బాబూ!"

మంచి కాఫీ తాగిన ఉత్సాహం అతన్నింకా వదల్లేదు.

"ఇంత బాగా కాఫీ చేయడం ఎప్పుడు నేర్చుకున్నావ్ అమ్మమ్మా?" అన్నాడు, సిగరెట్ వెలిగిస్తూ.

"నాకేం వచ్చురా బాబూ! మన సావిత్రి కాచింది" అంది ఆవిడ.

"అలాగా!"

మధ్యాహ్నం భోజనం చేస్తూండగా అడిగింది ఆవిడ - "నువ్వు ఏదో విదేశాలకు వెళ్ళావుగదా - ఎక్కడకు బాబూ"

"స్టేట్స్ వెళ్ళానమ్మమ్మా"

"మరి మన సావిత్రి నువ్వు అమెరికా వెళ్ళావంటుందేమిటీ? దానికి మాత్రమేం తెలుసులే".

అతను నవ్వుకున్నాడు.

భోజనం చేసి గదిలోకి వస్తుంటే ఆ గది పక్క గుమ్మం నుండి ఎవరిదో చీరకొంగు మాయమవడం చూశాడు. గదిలో ఆకులు, వక్కపొడి సిద్ధంగా వున్నాయి. తాంబూలం వేసుకున్నాడు. ఈల వేసుకుంటూ అద్దంలో చూసుకున్నాడు. పరుపు మీద పాలనురగలాంటి తెల్లటి దుప్పటి ఆహ్వానిస్తోంది. దిండుగలేబు మూలలో కుట్టిన కుందేలు బావుంది, అతను నిద్రపోయాడు.

లేచేటప్పటికి సాయంత్రమయింది. కాఫీ తాగి, పెరట్లోకి వెళ్ళాడు. తులసి కోట గుబురుగా పెరిగింది. తులసి కోటకు నీళ్ళు పోస్తున్న బలమైన, వయసులో వున్న చేతులు. మొహం సరిగా కనబడలేదు. చీరకొంగు దోపుకోవడం వల్ల పచ్చగా, బలంగా కనిపిస్తున్న పాదాలు పై భాగం. అతనికి మృణాళిని సున్నితమైన చేతులు, ఆ చీకటి రాత్రి తన మెడ చుట్టూ పెనవేసుకున్న ఆ చేతులు, ఉద్రేకంతో మెరిసే ఆ కాళ్ళూ, జేగురించిన చెక్కిళ్ళూ, ఆ ఎర్రటి పండులాటి పెదాలపై తన పెదాలు... జ్ఞాపకం వస్తున్నాయి.

"వెళ్ళాలి... వెంటనే కలకత్తా వెళ్ళిపోవాలి. ఆ సున్నితమైన చేతుల బిగిలో వుండిపోవాలి. తల్లీ, తండ్రి, అమ్మమ్మ వీళ్ళంతా 'ఆనాడీ'లు తన విజ్ఞానానికి, శాస్త్ర పరిజ్ఞానానికి పదును పెట్టి మానవ జాతి అభ్యుదయానికి బాటలు వేయాలి."

తులసి కోటకు నీళ్ళు పోస్తున్న ఆమె అటు పక్కగా వెళ్ళిపోయింది. కుతూహలం కలిగింది.

ఇంట్లోకి వెళ్ళి "తులసి కోటకు నీళ్ళు పోస్తున్నదెవరమ్మమ్మా?" అన్నాడు.

"అప్పుడే మర్చిపోయావటరా! మన సావిత్రి. చిన్నప్పుడు నీతో ఈ ఊళ్ళో ఆడుకున్న పిల్ల. మన స్వామిగారి అమ్మాయి...."

సావిత్రి... సావిత్రి... అతనికి ఓ రూపం మసగ్గా జ్ఞప్తిలోకి వస్తోంది... వచ్చేసింది.

ఆ రూపం ఆకారం స్పష్టమవగానే అతని ఊపిరి జ్వరం వచ్చిన వాళ్ళా అయిపోయింది. అతని దేహమంతా మంటలు లేచాయి. బలహీనుడి కోపం లాంటి కోపం అతనిలో రగులుతోంది.

"ఇక్కడెందుకుంది?" అతని గొంతులోని కర్కశానికి ఆవిడ తలెత్తి ఖంగారుగా చూసింది.

"ఇంకెక్కడుంటుందిరా! పెళ్ళా అవలేదు. వాళ్ళ నాన్న పెద్ద కట్నాలు ఇవ్వలేడు. నువ్వు వస్తున్నావని, పక్కిల్లేగదా అని నేను సాయం రమ్మన్నాను. ఇల్లంతా సర్ది, వంటంతా చేసి... అంతా అదే చేస్తోంది. ముసలిదాన్ని నేనేం చేయగలను?"

అతన్ని ఎందుకో చేతగాని, చేవలేని అసహనం చుట్టుముడుతోంది. అక్కడ నిలవలేక గది దగ్గరకొచ్చి గాజు పూసల జాలరి కదిలిస్తూ, ఆలోచన మళ్ళిద్దామని ఎంతో ప్రయత్నించాడు.

అయినా చిన్నప్పుడు తనతో ఆడి, కవ్వించి, గంతులు వేసిన సావిత్రి రూపం కళ్ళ ముందు రూపు కట్టింది. ఆ రూపంతో అతనికి చిక్కులేదు. ఆ చిన్నప్పటి సావిత్రి పెరిగింది.... వయసుతో లావణ్యాన్ని తెచ్చుకొంది. ఓణి వేసుకొని, పెద్ద కళ్ళతో, తనని కవ్వించిన ఆ మోటు పెదాల సావిత్రి... ... ఆ రూపం మాత్రం అతన్ని ఇరుకున పెట్టి, చిరాకు పెడుతోంది. ఏ మూలో అణిచివేసిన, మరిచిపోయిన, ఉపయోగంలేని చిన్నతనపు చేష్ట.. అది జ్ఞప్తికొచ్చి అతని వంట్లో సెగలు రేగుతోంది.

.... చాలాకాలానికి, ఆన్సర్ చదివే రోజుల్లో, వేసవి సెలవుల్లో, మళ్ళా ఆ ఊరు వచ్చాడు. ఓణి బిగించి, సిగ్గుపడుతూ, పట్నవాసపు అలవాట్లని రంగరించుకున్న అతనిని సావిత్రి చూసింది.

రమ్మంటే దగ్గరకు వచ్చింది.

"మర్చిపోయావా?" అన్నాడు.

'లే'దన్నట్లు తల ఆడించింది, చెవి రింగులు గమ్మత్తుగా ఊగాయి.

"అంత భయమెందుకు?" అన్నాడు.

పెద్ద కళ్ళతో చూసి, తల దించుకొంది.

"అంత సిగ్గెందుకు?"

ఆమె బుగ్గలలో లోతుగా పడిన సొట్టలు అతన్ని నిలవనివ్వలేదు. చామన ఛాయ రంగులో మెరుస్తూ, వళ్ళంతా తళుకు అద్దినట్టుగా ఉంది ఆమె. వయసులో ఉన్న ఆ పిల్ల తన కళ్ళకి 'ఆమె'గా కనబడింది.

అక్కడున్నన్ని రోజులు ఆమెను మచ్చిక చేసుకుందామని ప్రయత్నించేడు. ఉండే రోజులు పొడిగించాడు.

మళ్ళా వేసవి సెలవులకు పరిగెట్టుకు వచ్చాడు. ఈసారి ఆమె అతని కళ్ళకి మరీ వింతగా కనిపించింది. చీర కట్టింది... చీరలో మెరిసింది. ఆ కళ్ళని తాకాలని, ఆ చెక్కిళ్ళని నిమరాలని అతనికి వుంది.

ఆమె దూరంగా కూర్చునేది. విహ్వలత్వంతో అతని కబుర్లు వినేది.

రెండు రోజుల్లో అతను వెళ్ళిపోవాలి. ఆ చల్లని సాయంత్రం ఆమె తలంటి పోసుకుని, చల్లని వెన్నెలలా వచ్చింది. దగ్గరకు చేరాడు. కోరికతో ఊగిపోయాడు.

కళ్ళని పొగిడాడు - కళ్ళని తాకాడు. చెక్కిళ్ళు గులాబీ రంగులో మెరుస్తున్నాయన్నాడు. చెక్కిళ్ళు నిమిరేడు - ఆమె బెదిరినట్టుగా దూరంగా వెళ్ళింది.

ఆమె దూరమైన కొద్దీ అతనికి ఆవేశం పెరిగింది. దగ్గరకు వచ్చాడు. ఆమె అధరాలు అదురుతున్నాయ్. మోటుగా కదిలే ఆ పెదాల్ని తన నోటితో మూసివేసాడు. ఆమెను తనలో ఇముడ్చుకొన్నాడు. ఆమె వింతగా వణికింది. ఉన్నట్టుండి తప్పించుకొంది.

"తప్పు కాదా? నువ్విలా... నేనెప్పుడూ అనుకోలేదు" ఆమె కళ్ళల్లో నీళ్ళు.

తనని అర్థం చేసుకోలేదని చిన్నబుచ్చుకున్నాడు. అతనిలో ఆవేశంలాంటిది పెరిగింది.

"ప్రస్తుతం తప్పేనేమో! కాని ... కాని... నిన్ను పెళ్ళి చేసుకుంటాను. ఈ సంవత్సరంతో చదువ పోతుంది" అంటూన్న అతని చేతుల్లోంచి తప్పించుకొని హంసలా గాలిలో తేలిపోతూ పారిపోయింది అతను వెళ్ళే రోజున ఆమె ఒక్క మాట మాట్లాడక పోయినా, ఆ పెద్ద కళ్ళల్లో ఎన్నో భావాలు నింపుకుంది.

వైజాగ్ వెళ్ళి ఉత్తరం వ్రాశాడు. 'ఫస్టు క్లాసులో ప్యాసయ్యాను, నాన్నగారితో చెబుతాను. ఆయన నా కోరిక కాదనరు. త్వరలో ముహూర్తం. ఆ తర్వాత ఎలా పారిపోతావో చూస్తాను. జవాబు రాయాలి!'

అతనికి ఆమె జాబు వ్రాయలేదు. వ్రాసినా అతనికి అంది వుండేది కాదు. ఆ తరువాత అతను పై చదువులకు అమెరికా వెళ్ళాడు. ఏడేళ్ళు ఉన్నాడు. తన 'సబ్జెక్ట్'లో నిధి అనిపించుకొన్నాడు. ఈ ఏడేళ్ళ కాలంలో ఎన్ని అనుభవాలు? ఎందరో యువతులు,ఎన్నో రకాలు, అన్నీ చవి చూశాడు. మనిషే మారిపోయాడు. తన విభాగంలోనే 'రిసెర్చ్' చేస్తున్న మృణాళినితో మూడేళ్ళ క్రితం పరిచయం.

గతం మరుగున పడింది.

ఆ గతమంతా ఈనాడు కళ్ళ ముందు నాట్యమాడుతోంది. అసహనం చెలరేగింది.

ఆ ఉత్తరం ఆమె దగ్గరే వుంది... బ్లాక్‌మెయిల్ - నో, నో అటువంటివి వీళ్ళకు తెలీదు. అమ్మమ్మకు ఈ సహాయమెందుకు? ఇన్నాళ్ళూ ఎందుకు పెళ్ళి చేసుకోలేదు? ఆమెకు పెళ్ళి కాకపోవడం తన తప్పేం కాదు.

కోపంతో ఊగిపోయాడు.

గాజు పూసలతో గుమ్మానికి కట్టిన జాలరి అతని ఊపుకి ఊడి కిందపడింది.

చప్పుడుకు అతని అమ్మమ్మ వచ్చింది. తెగి కిందకి జారిన జాలరి, విసురుగా వీధిలోకి పోతున్న మనవడూ కనిపించారు. ఆమె తెల్లబోయింది. సావిత్రి వచ్చి తెగిన జాలరి సర్ది, విరిగిన పూసల్ని ఏరింది.

"గుమ్మానికి మళ్ళీ కట్టవే సావిత్రీ" అంది ఆవిడ.

"పూర్తిగా తెగిపోయింది బామ్మగారూ- ఇక నిలబడదు"అనేసి సావిత్రి పెరటిలోనికి వెళ్ళిపోయింది.

శేఖరం ఊళ్ళోకి వెళ్ళాడు. తెగ తిరిగేడు. ఊళ్ళో తెలిసిన వ్యక్తులు పలకరించి ప్రశ్నలు వేశారు.

"ఏదో దేశమెళ్ళావటగా? దొరసాన్ని చేసుకుంటావనుకున్నాం! లేదా? నేఫిల్స్ చూశారా? బ్రహ్మచారి ముదరకూడదయ్యోయ్ పంతులూ!"

వాళ్ళ మాటలు అతని మీద అగ్గి మీద గుగ్గిలంలా పనిచేశాయి. బాగా చీకటిపడ్డాక తిరిగి వచ్చాడు.

"అన్నం తినుబాబూ" అని ముసలావిడ వడ్డించింది.

అన్నం తింటూ "మీ సావిత్రి వెళ్ళిపోయిందా?' అన్నాడు.

"బాగా పొద్దోయింది కదూ - వాళ్ళ అమ్మ పిలిచిందని వెళ్ళింది. మర్చిపోయాను. మన సావిత్రి నాన్నగారు స్వామిగారు వచ్చారు ఇందాక."

'ఎందుకు? వాళ్ళ సావిత్రికి నన్ను సబంధం వెతకమంటాడా?'

"అనలేదుగాని, వెతికితే తప్పేం కాదు. ఊరికే వచ్చాడు - నిన్ను చూద్దామని. పక్కింటివాడు, ంచివాడు. నీకు చిన్నతనంలో పాఠాలు చెప్పిన పంతులుగారు కదా- నువ్వు ఎన్నో దేశాలు తిరిగి, పరీక్ష పాసయి ఇంతవాడివయ్యావని నిన్ను చూసి సంతోషిద్దామని వచ్చాడు. రేపో మాపో వాళ్ళింటికి వెళ్ళు."

అతనికీ వెళ్ళాలనే వుంది. వెళ్ళి ఆ సావిత్రిని గాయపర్చాలనీ ఉంది.

మర్రోజు తమ ఇంట్లో సావిత్రిని పలకరిద్దామని చూశాడు. ఆమె తప్పించుకు తిరిగి ఇంటికి వెళ్ళిపోయింది. అతనికింకా మండిపోయింది.

ఆ సాయంత్రం స్వామిగారింటికి వెళ్ళేడు. వీధి గదిలో లైటు చిమ్నీ తుడుస్తోంది స్వామిగారి భార్య.. అతనిని చూసి, కంటి మీద చేయాన్ని పరీక్షగా చూసి, గుర్తు పట్టింది.

"కూర్చో బాబూ!" అంది లేచి నిలబడి.

అక్కడున్న ఒక చేయి విరిగిన కుర్చీలో కూర్చున్నాడు.

"మాష్టారు లేరాండీ?"

"లేరు బాబూ! ఊరెళ్ళారు. రేపు వస్తారు."

అతని తండ్రి, తల్లీ, అక్కయ్యల కుశలమడుగుతోంది. అతను పరధ్యాన్నంగా సమాధానాలు చెబుతూ, సావిత్రి కోసం వెతికాడు.

"కాఫీ తెస్తా"నంటూ ఆవిడ యింట్లోకి వెళ్ళింది.

ఆ సంజె చీకట్లోనే సావిత్రి కాఫీ గ్లాసు తెచ్చి అందించింది. సావిత్రిని చూడాలని అతనికి మహా ఇదిగా వుంది.

"అతన్ని చీకట్లో కూచోపెట్టావా? సంజెవేళ. నాకివతల చేయి తీరికలేదు. హాల్లో దీపం పెట్టు సావిత్రీ!" వాళ్ళ అమ్మగారు వంటింట్లోంచి కేకేసింది.

సావిత్రి దీపం తీసుకొచ్చింది. గది మధ్య వేళ్ళాడుతూన్న తీగకు తగిలించింది. ఆ లైటు వెలుతురుకు రాజుకున్న నిప్పులాగ ఆమె వదనం గప్పున వెలిగింది. చెంప, సగం వళ్ళూ కనబడుతున్నాయి. పక్కకే తిరిగి వుంది.

"నన్ను మర్చిపోయావా?" అన్నాడు.

"కాఫీ తాగండి" అంది ఆమె ఇటు తిరిగి.

కాఫీ తాగుతూ ఆమెను చూస్తున్నాడు. పెద్ద కళ్ళు, మోటు పెదాలు, వాలు జడ, సగం మాసిన చీర, వదులుగా జాకెట్టు, చెంపన మసి - మృణాళిని 'బ్యూటీ స్పాట్' గుర్తుకొచ్చింది.

"నన్ను మరిచిపోయావా అన్నాను?"

లోపలికి వెళ్ళబోతున్నదల్లా ఆగి, వెనక్కి తిరిగి "నాన్నగారు ఊరువెళ్ళారు" అంది.

"అంటే నన్ను వెళ్ళమనా అర్థం?" కోపంతో ఊగిపోయాడు.

"ఎంతమాట? మీరు మా యింటికి రావడమే గొప్ప. మీలాంటి వారిని సరిగా ఆదరించడమైనా చేయలేనివాళ్ళం. వెళ్ళమని చెప్పగలమా?"

"మాటలు చాలా నేర్చావే!"

"మాటలు కాదు. ఉన్న నిజం అన్నాను. మీకు తెలిసిన నాన్నగారు ఊరు వెళ్ళారు. తెలిసిన అమ్మ మాట్లాడి వంటింట్లోకి వెళ్ళింది. ఆమెకు ఓ గంట దాకా ఆ పని తెమలదు. ఇక ఈ సావిత్రి ఎవరో బామ్మగారు గుర్తుచేస్తేగాని గుర్తుకు వచ్చేది కాదు గదా!"

"నువ్వు చాలా మారిపోయావ్ - ఎలా గుర్తు పట్టగలను? పెద్దదానవయిపోయావుగదా!"

"మీ నాన్నగారు ఎక్కడికివెళ్ళారేమిటి?"

"మీరు అన్నీ తెలిసినవారు. వయసు వచ్చి వయసు మీరిపోతూన్న ఆడపిల్ల ఇంట్లో వుండగా ఏ తండ్రయినా ఎండలో, అరిగిన చెప్పులు, భుజాన మాసిన ఖండువా వేసుకుని ఎందుకు ప్రయాణమవుతారో మీకు తెలియదా?".

అర్థమయినా ఆమె నోటి మీదుగానే చెప్పించి హేళన చేయాలని ఉంది అతనికి.

"మీ పల్లెటూరు మాటలు నాకర్థమవవ్. ఎందుకు వెళ్ళారో ఈ పాత స్నేహితుడికి కొంచెం చెబుదూ"

"మా నాన్నగారికో పిల్ల వుంది. ఇరవై నాలుగు సంవత్సరాలు వచ్చేశాయి. ఊళ్ళో వాళ్ళు పెళ్ళి చేయలేదని కాకులు పొడిచినట్టు పొడుస్తున్నారు. ఆ అమ్మాయి బావుంటుందని ఊళ్ళో వాళ్ళందరూ అనుకుంటారు. ఏనాడో ఆ మాట ఆ అమ్మాయికే చెప్పి నమ్మించినవారూ ఉన్నారు. ఆ అమ్మాయికి పెళ్ళి సంబంధం చూడటానికి వెళ్ళారు."

"మరి ఇన్నాళ్ళూ ఆ అమ్మాయికి పెళ్ళెందుకు కాలేదు?".

"మీరు బాగా చదువుకొన్నవారు. సంస్కారం వున్నవారు. విదేశాలకు కూడా వెళ్ళి విజ్ఞాన ధనాన్ని పుష్కలంగా సంతరించుకొన్నారు. ప్రజ్ఞాపారమితులు - కనుక మిమ్మల్ని అడుగుతున్నాను. ఆ అమ్మాయికి కూడా ఆ సంగతే తెలీడం లేదు. కాస్త కారణం ఊహించి చెప్పరూ?".

అతనికి మళ్ళీ కోపం ముంచుకొచ్చింది.

తన చదువునూ, సంస్కారాన్నీ ఎద్దేవా చేస్తోంది. దాగుడుమూతలనవసరం. తిన్నగానే 'ఎటాక్' చేయాలి.

"నీలో అన్నీ లోపాలే, చదువు లేదు. ఈ రోజుల్లో నీవంటిదాన్ని ఎవరు చేసుకుంటారు?"

"నేర్పిస్తే ఆడది నేర్వలేని విద్య లేదనిగా సూక్తి".

"కావ్యాలు చదివావా? ఆ పాత చింతకాయ పచ్చడి ఎవడికి నచ్చుతుంది."

"అయ్యో! ఒక్క కావ్యాలనేమిటి. మీరన్నట్టుగానే ఏడేళ్ళ క్రితం ఓ పెళ్ళికొడుకు వచ్చి చూసి చదువు లేదన్నాడు. ఆ లోటు భర్తీ చేయడానికి నాన్నగారు ఇంగ్లీషు నేర్పించారు. ఒకాయన హిందీ వచ్చా అన్నాడు. హిందీ విశారద ప్యాసయ్యాను. ఒకాయన సంస్కృతం వచ్చా అన్నాడు. సంగీతం, చదువూ, ఇంగ్లీషు చదువు, సినిమా పాటలు, అత్త గారికి ఆధ్యాత్మ రామాయణ కీర్తనలూ అన్నీ నేర్పించారు. ఒకాయన డాన్స్ వచ్చా అన్నాడు. ఈ వయసులో గెంతడం బావుండదని వూరుకొన్నాను. ఏదో మీ దయవల్ల, డాన్స్ తప్ప, అన్నీ వచ్చాయ్".

"చదువు నేర్చినా సంస్కారం ఉండద్దూ? ప్రపంచం ఇంత వేగంగా మారిపోతోంటే, ఈ పల్లెటూరిలో కూపస్థ మండుకంలాగ..."

"మీరు పాపం చాలా కాలంగా దేశంలో లేరు. మీకు తెలీదేమో! ఈ పల్లెటూళ్ళన్నింటికీ రేడియోలు, పత్రికలూ, గ్రంథాలయాలు అన్నీ వచ్చేయి. మా ఊళ్ళో టౌనుకు వెళ్ళి నెలకి ఇరవై నాలుగు సినిమాలు చూసేవాళ్ళూ, ముప్పయిదాకా ఎమ్.ఎ. ప్యాసయిన వాళ్ళూ వున్నారు. అయినా ఏ సంస్కారమైనా ముద్దుతో నేర్పితే నేర్చుకుంటే అలవడదంటారా? విజ్ఞానులు కనుక అడుగుతున్నాను."

అతనికి మాటల్లో ఓడిపోతున్నానని తెలిసింది.

ఆమె బలహీనత మీద దాడి చేయాలి.

"నీకసలు అందంగా కనబడ్డం కూడా చేతకాదు. ఆ వదులు జాకెట్టు, ఆ మాసినా చీరా, జడా అలా వుంటే ఏ పెళ్ళికొడుకూ మెచ్చడు. కోరడు."

"అయ్యో! మీరు పెళ్ళిచూపుల కొచ్చారని తెలీలేదు. మా కుటుంబం హితైషిగా వచ్చి కుశలమడుగుతున్నారనుకున్నాను. పెళ్ళికొడుకుగా 'చూపుల' కొచ్చారని తెలిస్తే... ఒక్క ఐదు నిమిషాలు ఆగరూ? మా అమ్మ పెద్ద చీర, మా అమ్మకున్న ఆ ఒక్క బంగారు గొలుసూ, చెవుల మీదికి జుట్టూ, నుదుట ముంగురులూ... ఒక్క ఐదు నిముషాల్లో 'రెడీ' అయిపోతాను. అలవాటు మూలాన ప్రాక్టీసులెండి. అవమంటారా?"

అతనిలో సెగలు రేగాయి.

టాపిక్ మార్చాలి.

"మీ నాన్నగారు వెళ్ళిన పెళ్ళికొడుకెవరేవిటి? అన్నాడు.

"ఈ ఏడేళ్ళ బట్టీ నలభై ముగ్గురు యువకులు చూశారు నన్ను. వారందరికీ ఏదో ఒక వంక దొరికింది. ఆ వంకల వెనక వాళ్ళ మనసుల్లో పాపం ఎన్ని ఆశలు, ఆశయాలు.... మోటార్ సైకిళ్ళూ, రోలెక్స్ వాచీలు, పార్కర్ పెన్నులు, టెర్లిన్ సూట్లూ చాలా వున్నాయి. ఆ ఆసలు నిజాలు మా నాన్నగారికి మొన్నటి వరకూ తెలిసి రాలేదు. తెలియక ఏదో తంటాలు పడ్డారు. నిజం తెలిసి తొక్కవలసిన బాట తొక్కారు. ఇక్కడికి ఇరవై రెండు మైళ్ళ దూరంలో ఓ యాభై నాలుగేళ్ళ పెళ్ళికొడుకు వున్నారట. వారికి ఈ మధ్యనే భార్యా వియోగమైంది. ఐదారుగురు పిల్లలు. వాళ్ళని సాకడానికి ఓ మనిషి కావలసి వచ్చింది. ఆ మనిషిని భార్యగానే తెచ్చుకోమని హితులు పట్టుబడితే, పాపం వారు చాలా అయిష్టంగానే ఒప్పుకొన్నారుట. ఆయన్ని చూసి, పిల్ల పెళ్ళి స్థిరపరుచుకు వద్దామని వెళ్ళారు."

ఆ మాటలు వినగానే అతని సంస్కారమంతా పైకి వెల్లువలా పొంగింది.

"నువ్వు ఒప్పుకున్నావా?" 'షాక్' అవుతూ అడిగాడు.

"ఈనాడు నేను ఒప్పుకోవడం ప్రసక్తి వుందంటారా? ఓ నాడు, చాలా ఏళ్ళ క్రితం, ఒకరు కోరితే నేను ఒప్పుకున్నాను. వారికీ ఆ విషయం తెలుసు. ఆ కథ చెప్పమంటారా?"

తనని ఎత్తి పొడుస్తోందని అతని మనసంతా కోపంతో ఘూర్ణిల్లింది.

"నీకసలు బుద్ధి లేదు. నువ్వు ఉత్తి ఫూల్‌వి. ఎన్నో చదివి నేర్చుకున్నానంటావ్. ఆ మాత్రం స్వంతంగా, స్వతంత్రంగా ఆలోచించలేవా?"

"అయితే ఈ సంబంధానికి ఒప్పుకోవద్దంటారా?"

"నేనేమీ అనను. నీకు ఆలోచన లేదా అని?"

"అదే నేననేదీను -మీలాటి వారు ఏమీ అనరు. చెప్పరు. ఇక ఏమీ తెలియని, ఓ పల్లెటూరు పిల్ల నిర్ణయించుకోవాలన్నమాట"

"ఇదే విదేశాల్లో అయితే జరుగుతుందా? నీ లాటి పరిస్థితే వస్తే, సంస్కారవంతమైన దేశంలో, ఆ

పిల్ల నచ్చినవాణ్ణి చేసుకుని తీరుతుంది. సాహసం కావాలి. మీ నాన్నగారు ఈ వయసులో ఇలా తిరగడానికి నీ అసమర్థతే కారణం"

"అందుకే కదా మీ వంటి విజ్ఞుల సలహా అర్థిస్తున్నాను. కాని మీరిప్పుడు చెప్పిన సలహా పాటిస్తే ఈ ఊళ్లో దానిని లేచిపోవడమంటారు. ఈ విషయాన్నే మన పట్నాలలో కాస్త నాజూకు పేరెట్టి క్లబ్బులో చెప్పుకొంటారు. కారణం నన్ను మెచ్చిన కుర్రాడు అందరి ముందూ పెళ్ళి చేసుకోడు. నా కళ్ళకి గంతలు కట్టి, ఊళ్లో వాళ్ళ కళ్ళు కప్పి లేవదీసుకుపోడానికి మాత్రం తయారు. పోనీ మీ సలహా పాటించి ఆ పనే చేస్తాను. నన్ను లేవదీసుకుపోయే కుర్రాణ్ణి కాస్త చూసి పెట్టండి"

"మీ ఊళ్లో ఎవరూ లేరా?" అన్నాడు కసి అంతటినీ ఆ మాటల్లో ఇముడుస్తూ.

ఆ అబల పెదవి పంటితో నొక్కి పట్టింది. కళ్ళల్లో ముత్యాలు నిలిచాయి.

అతనికి దగ్గరగా వచ్చింది.

"ఉండకేం? ఉన్నారు. కాని ఎన్నాళ్ళ తర్వాత వదిలేస్తారా అన్న ఆలోచనే తెగకుండా ఉంది. వదిలేయడం తథ్యం. వదిలేసిన తర్వాత ఎలాగూ మెడకు ఓ తాడు బిగించుకోవాలి. దానికి బదులు ఈనాడే ఆ ముసలాయన చేత కాస్త గౌరవంగా మెళ్ళో ఓ తాడు వేయించుకుని మూడు ముళ్లూ బిగించుకుంటే మంచిదేమోనన్న మరో ఆచోచన. ఇంకో ఆలోచన కూడా ఉంది. మా ఇంట్లో బంగారం, కరెన్సీ నోట్లూ లేకపోయినా నా మెడకు సరిపోయే తాడు ముక్కలు చాలా ఉన్నాయి.

"ఊళ్లో పెద్ద చెరువుంది. అలా చస్తే, చావడంలో కూడా పల్లెటూరు మోటుదనం అంటారు మీరు. అంచేత కాస్త నాజూగ్గా చద్దామనుకుంటే మీలాంటి పట్నవాసపు స్నేహితుల్ని ఎవర్ని అర్థించినా నిద్ర మాత్రలో, సైనైడో దయతో తెచ్చి ఇస్తారు..."

ఉన్నట్లుండి ఆమెలో దుఃఖం పొంగింది. ఏడుపు దిగమింగుకోడానికి గొంతులో కొంగు కుక్కుకున్నా ఎగుపులు వస్తున్నాయి.

అతను తెల్లబోయాడు.

"మీరంతా వట్టి మూర్ఖులు, పరిగెడుతూన్న జీవిత విధానంతో, శాస్త్ర పరిజ్ఞానంతో ముందుకు పోతూన్న ఈ ప్రపంచానికి పనికిరారు. అజ్ఞానం మీ సొత్తు" అన్నాడు.

"అజ్ఞానిని కాబట్టే అడుగుతున్నాను. నా సమస్య తేలలేదు. ఓ యువకుణ్ణి చూసుకొని లేచి

పెమ్మంటారా? మా ఇంటి చిన్న గదిలో ఓ తాడు బిగించుకోమంటారా? లేక ఆ ఏభై నాలుగేళ్ళ పెళ్ళి కొడుకు చేత మెడలో తాడు కట్టించుకుని, వారి కొడుకుల్నీ, కూతుళ్ళనీ ప్రేమతో సాకి, భర్తగారిని భక్తితో పూజించి చిరంజీవిగా జీవించి, అందరి చేతా 'ఓహో' అనిపించుకోమంటారా! నా ధర్మమేమిటో చెప్పి వెళ్ళండి"

ఆమె చూపు నతడు తప్పించుకొని లేచి నిలబడ్డాడు.

ఆమెకు ఆవేశం కలిగింది.

అతనిని ఆపి, అతని గుండెపై వేలాన్చి అడిగింది. : "నా ప్రశ్నకు బదులు చెప్పవలసిన బాధ్యత మీ మీద ఉంది. మీ బాధ్యతని విదిలించుకొని పోవడం ఆత్మవంచన, నా ధర్మమేదో నాకు బోధించాలి. శిరసావహిస్తాను."

ఆమె చూపులు నిప్పుల్లా ఉన్నాయి. ఆ సెగ అతన్ని కాల్చింది. అతని పని అయోమయమయి పోయింది. వెంటనే తెలివి తెచ్చుకుని ఆమెను తోసేసుకొంటూ 'ఛీ' అంటూ వీధిలోకి మెరుపులా వెళ్ళిపోయాడు.

ఆ రాత్రే ఆ వూరు నతడు విడిచి వెళ్ళాడు.

x x x x x x

**ప**దేళ్ళ తర్వాత ప్రొఫెసర్ శేఖర్ ఆ అర్ధరాత్రి నిద్రలోంచి ఉలిక్కిపడి లేచాడు. అతనికి భయంకరమైన కల వచ్చింది. అతని నుదురంతా చెమట పట్టింది. గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి.

సావిత్రి కలలో కనబడింది. అతి భయానకంగా కనబడింది. మళ్ళా భయం కలిగింది.

ఎక్కడ వున్నానా అని చుట్టూ చూసుకున్నాడు. పక్క మంచం మీద మృణాళిని పువ్వులా పవళించి ఉంది. ఆ గదిలో నీలి రంగు కాంతిలో మొగలి పువ్వులా మెరుస్తోంది. ఎయిర్ కండిషన్డ్ గది హాయిగా ఉంది. మెత్తటి పరుపూ, కింద కాశ్మీర్ కార్పెట్, అలవాటైన, సుఖప్రదమైన పరిసరాలు అతని భయాన్ని పోగొట్టాయి. పక్క గదిలోకి వెళ్ళాడు. పిల్లలు సునీల్, కౌబితా హాయిగా నిద్రపోతున్నారు.

అతనికి భార్యా, పిల్లల్నీ డిస్టర్బ్ చేయడం ఇష్టంలేక 'స్టడీ' లోకి వెళ్ళాడు. స్విచ్చి నొక్కాడు. పాల వెన్నెలలాటి కాంతి గదినంతా మృదువుగా కౌగలించుకుంది.

ప్రతి విషయం విజ్ఞానపరంగా ఆలోచించే ప్రొఫెసర్ శేఖర్ ఇన్నాళ్ళకు పదేళ్ళ తర్వాత సావిత్రి

ఎందుకు కలలోకి వచ్చిందా అని ఆలోచించాడు. ఈ పదేళ్ళబట్టీ అతను తన వాళ్ళతోనే చాలా వరకు సంబంధం తెంపుకున్నాడు. ఆ వేపుకే వెళ్ళలేదు. మర్యాదకు చిహ్నమైన ఉత్తరాలు మిగిలాయి. ఉన్నట్టుండి అతనికి కారణం తట్టింది. పొద్దుట తండ్రి నుండి వచ్చింది 'మీ అమ్మమ్మ ఫలానా 5వ తేదీ దివంగతురాలైనది. 14వ తారీకున పదవ రోజు, కాన తెలియపరచడమైనది' అని ఉంది ఉత్తరంలో. ఆ ఉత్తరాన్ని గురించి అతను అట్టే ఆలోచించలేదు. అయినా సావిత్రి కలలోకి వచ్చింది.

రేపు మళ్ళా ఫ్రాయిడ్' చదవాలి.

... సావిత్రి కలలోకి వచ్చింది. చాలా భీకరంగా కనిపించింది. సావిత్రి చచ్చి పడి ఉంది. మొహమంతా వికృతంగా మారిపోయింది. కమిలిపోయిన రంగులో ఉంది. ఆ రంగు ఉన్నట్టుండి 'గాడీ' రంగుల్లోకి మారుతోంది. చుట్టూ ముసలి భర్తా, సవితి పిల్లలూ ఉన్నారు.

వంట్లో నలత లేదు, వంటి మీద గాయాల్లేవు.

జబ్బు లేదు, హత్య కాదు అన్నారు వైద్యులు.

కంఠం మీద మాత్రం సన్నని నల్లని చార వుంది. ఆ చార కలలో అతనికి భీతిని కలిగించింది. ఇంకా గమ్మత్తు - ఆ చార ఎవ్వరికీ కనబడ్డం లేదు, తనకి తప్ప.

తాళి కట్టుకున్న పచ్చని పసుపుతాడు తన కంఠం చుట్టూ బిగిసిపోయిందని సావిత్రి ఏడుస్తూనే చెప్పింది. ఆ మాటలూ, ఏడుపూ మిగతావాళ్ళకి తెలీడం లేదు. ఆమె ఏడుపు భీతావహంగా ఉంది. ఈ చావు పదేళ్ళ క్రితమే తానే తెచ్చుకుంటే తేడా ఏమిటంటోంది. తనకి తెలియడంలేదుట. చెప్పమంటోంది.

ఆమె తనతోనే మాట్లాడుతోంది.

ఆమె ఉన్నట్టుండి లేచి కూర్చుని మెడలో తాళి కట్టిన తాడు తీసి, వికృతంగా నవ్వుతూ తన మెడలోకి హారంలాగా విసిరింది. ఆ తాడు తన మెడని చిత్రంగా నొక్కుతూ, కంఠం బిగిసిపోతూ వుంటే సావిత్రి భయానకంగా నవ్వుతూ, నవ్వుతూ ఏడుపులోకి దిగి రోదిస్తోంది. ఆమె రోదన ఎక్కువైన కొద్దీ తన కంఠం చుట్టూ తాడు బిగుసుకుపోతోంది. అతనికి ఊపిరి ఆడనట్టూ, ప్రాణం పోతున్నట్టుగా ఉక్కిరి బిక్కిరి అయ్యాడు.

...అంతలో మెలకువ వచ్చింది.

ఆ కలను అతడిప్పుడు ఖాతరు చేయడు. టైము చూసుకున్నాడు. మణికట్టంతా నిండిన వాచీ

నాలుగు చూపిస్తోంది. వాచీలో తేదీ మారింది. 14వ తారీఖు వచ్చింది.

ఇంకెలాగూ నిద్దుర పట్టదు. మృణాళినిని లేపడం యిష్టం లేదు. రాత్రి క్లబ్బు నించి పాపం ఆలస్యంగా వచ్చింది. లేడీస్ క్లబ్ తరపున చందాలు వసూలు చేసి డస్సిపోయింది.

రేపు సైన్స్ కాంగ్రెస్‌లో అతడు చదవవలసిన పేపరు ఒకటుంది. ఎంతో విప్లవాత్మకమైన థియరీ ప్రతిపాదిస్తున్నాడు దాంట్లో. రేపు కలకత్తాకు మేథావులంతా వస్తున్నారు.

ఆ కాగితాలు ముందు వేసుకుని కూర్చున్నాడు ప్రొఫెసర్ శేఖర్.

నిమిషంలో అతని తీరు మారిపోయింది.

కంటికి జోడూ, వెనక్కిపోతూన్న జుట్టూ, విశాలమైన నుదురూ, సునిశితమైన బుద్ధీ, తీక్షణమైన పట్టుదలా - ప్రతిభావంతుడైన విజ్ఞాని అతడు. అతని చూపూ, ఆలోచనా అంతా ముందే ఉంది. మానవ శ్రేయస్సు కోసం సర్వజనావళి సుఖించేటందుకు నిరంతరం పరిశ్రమించే విజ్ఞానకోవలోనివాడు.

అతనికి జేజేలు, జోహార్లు.

*(జ్యోతి మాసపత్రిక : రజతోత్సవ ప్రత్యేక సంచిక : 1963-'88)*



# పాపం! దీక్షితులు!

దీక్షితులు తెలివైనవాడు.

తెలివైన కొడుకుని 'ఇజనీరింగ్'లో చేర్పించి ఓ పది వేలు కట్నరూపేణా తీసుకుందామని దీక్షితులు తండ్రిగారయిన సీతారామయ్యగారికో సదభిప్రాయం ఉండేది.

కాని దీక్షితులుకి ఇంజనీరింగ్ సీటు రాకపోవడంతో ఆయన మొదట దిగజారినా వెంటనే సర్దుకున్నాడు.

ఇది ఇలా ఉండగా దీక్షితులు బి.ఎస్సీ.లో జాయినయ్యేటప్పటికి అతనిక్కొన్ని ఆశయాలు, ఆదర్శాలు బుర్రలో పాతుకుపోయి, ఆ పళంగా పేరుకున్నాయి.

"కట్నం తీసుకోకూడదు."

ఏది ఎలా వున్నా ఈ ఒక్క ఆదర్శంతో ఆదర్శప్రాయుడవాలని అతను మహా ఉబలాటపడ్డాడు.

అతగాడిలో ఇంతలేసి ఆలోచనలున్నాయని చూచాయగా తెలిసినా సీతారామయ్యగారు కొడుకును వీధిలోకి సాగనంపేవాడే.

చెప్పొద్దూ, దీక్షితులుకి అలా వీధుల్లోకి నడవడానికి ఏ మాత్రం ఇష్టం లేదు.

ఉన్నట్టుండి దీక్షితులు అమాంతం ప్రేమలో పడ్డాడు.

ఆ పడ్డంలో అందరిలా కాకుండా కొంచెం వెనకా ముందూ చూసుకునే పడ్డాడని చెప్పొచ్చు.

అలా మనం అంటే అతనొప్పుకోడు. అతను ఒప్పుకోకపోయినా జనం అనుకోడంమాత్రం.

కాకతాళీయంగానే అనుకుందాం 'ఆ అమ్మాయి' దీక్షితుల కులంలోనే గాకుండా శాఖలో గూడా కలిసి వూరుకుంది.

సంఘం 'ఇనుప సంకెళ్ళు' ఛేదించి సంస్కర్త కాబోయిన దీక్షితులు దీనితో కాస్త నిరుత్సాహపడినా వెంటనే పుంజుకున్నాడు.

అసలు జరిగిన గ్రంథం కొంత చెప్తా.

× × × × × ×

మధ్యాహ్నం క్లాసు ఎగ్గొట్టి నిద్రపోతున్న దీక్షితులికి మెలుకువ వచ్చి ఓ దివ్యమైన ఆలోచన వచ్చింది.

'కాఫీ తాగి సినిమాకి వెళ్తే?'

బద్ధకంగా వళ్ళు విరుచుకొని "సినిమాకి వెళ్తే ఎలా వుంటుందంటావ్?" అన్నాడు రూంమేటు గోపాలంతో.

"భేషుగ్గా వుంటుంది. దానికి ముందు ఓ అర కప్పు కాఫీ పట్టిస్తే అత్యుత్సాహంగా వుంటుంది."

గోపాలరావుకు హిందీ సినీమాలు, కత్తెర మార్కు సిగరెట్లు, స్ట్రాంగ్ కాఫీ బహిఃప్రాణాలు.

"అవును కాని 'రేడియేషన్' మొదలెట్టాడా?"

"ఏదో! మొదలెట్టినట్టే ఉన్నాడు. నే సరిగా విన్లేదు."

"ఏం? అనసూయ వచ్చిందా క్లాసుకి?" నవ్వుతూ దీక్షితులు అడిగాడు.

అనసూయ క్లాసుకు వచ్చిందంటే గోపాలం పాఠం వినడు. అది. ఓపెన్ సీక్రెట్.

"సరే కాని, లే, సినిమాకి పోదాం కాఫీ తాగి."

హోటలుకి పోయారిద్దరూ.

నల్లటి గుడ్డ తీసికొచ్చి ఒక వైపునే వున్న చెత్త నలువైపులా పక్షపాతం లేకుండా సర్దిపోయాడు క్లీనర్.

"ఏం కావాలి?" సర్వర్ ప్రశ్న.

పక్క ప్లేట్లో వున్న వేడి ఇడ్లీ చూసి ఇడ్లీ ఆర్డర్ చేశాడు గోపాలం.

పక్కనున్నాయన వేడి ఇడ్లీ చిదిపి నోట్లో వేసుకుని వేడి పట్టలేక, కిందకి ఉమ్మేయలేక లోపలికి మింగలేక యమ యాతన పడ్తున్నాడు - అపర గరళ కంఠుడిలా.

ఓ పక్క ఫలహారాల లిస్టు దండకంలా చదువుతున్నా డెవరికో సప్లయర్. నల్లటి కుర్రాడు వీధులో పోతున్న ఎఱ్ఱటి పిల్లని తొంగి తొంగి చూస్తున్నాడు.......... కనపడేంతవరకూ. ప్రాక్టీసులేని ప్లీడరు గారు సొంత ఖర్చుతో కాఫీ మాత్రమే తీసుకుంటున్నాడు. ప్రాక్టీసు ఉన్న ప్లీడరుగారి గుమాస్తా పక్కనున్న 'పార్టీ' లకి స్వంతంగా 'లా' విషయంలో కోస్తూ ముప్పావల దాక బిల్లు వేస్తున్నాడు. కారు డ్రయివరు కుర్చీ మీద గొంతుక్కూచుని సాంబారు చప్పరిస్తున్నాడు. తాగుతున్న టీ వదిలేసి వీధిలోకి పోతున్నాడు కిళ్ళీకొట్టు వెంకన్న - సిల్కు జాకట్టులో పోతున్న తన తాలూకు మనిషి కోసం.

హాల్లో అడుగుపెడ్తూనే "ఇంకా పావుగంట దాక మొదలెట్టేట్టు లేదే" అన్నాడు గోపాలం.

"వెధవ హాలు ఏడింటి దాక మొదలెట్టడు."

ఆరంజి తాగుతున్న దీక్షితుల కళ్ళకి నీరెండలో ఇంద్రధనస్సు మెరిసినట్లుగా మెరిసింది ఆ 'పిల్ల' హాల్లోకి రాగానే.

కళ్ళప్పగించి చూస్తున్న దీక్షితులు 'భలే వుందీ పిల్ల' అనుకోలేదు - అనుకోలేకపోయాడు.

అసలు వీలేదీ? ఆ చేతుల నునుపూ, వంటి మెరుపూ చూస్తూ.

నల్లటి చీర మీద పాల నురుగులా తెల్లటి జాకట్టు. తెల్లటి జాకట్టుపై ఎఱ్ఱటి మెడ. ఎఱ్ఱటి మెడపై తెల్లటి వదనం, నల్లటి కళ్ళు.

మెరుస్తోంది తళతళా ఆమె మెర్క్యురీ లైట్ల వెలుగులో.

నవ్వుతోంది కిలకిలా పక్కనున్నామెతో.

లైట్లారిపోయాయి. హాలువాడిమీద తగని కోపమొచ్చింది దీక్షితులుకి.

జీవితమే అంధకార బంధురం అనిపించిన దీక్షితులుకి ఏడుపొచ్చినంత పనయింది.

చీకట్లో మధ్య మధ్య మెడ తిప్పుతూనే ఉన్నాడు దీక్షితులు.

సినిమా ఐపోయింది. ఆ పిల్ల వాళ్ళ వాళ్ళతో కలిసి నడుస్తోంది.

"చాల బావుందేం?" ప్రశ్నో కాదో తెలీకుండా అడిగాడు దీక్షితులు.

"ఏడిసినట్టుగా ఉంది. వెధవ తెలుగు సినిమా చంపి తీసికొచ్చావ్"

"సినీమా మాట" గొణుక్కున్నాడు దీక్షితులు.

ఇప్పుడు చూశాడు ఆ పిల్ల పక్క నడుస్తున్నాయన్ను.

ఆయన పొడుగ్గా ఉన్నాడు. లావుగా గూడ వున్నాడు.

ఎందుచేతనో ఆయన తమ ప్రేమకు ముందు రాబోయే ఓ పెద్ద విఘాతమనుకున్నాడు.

'తమ ప్రేమ' ఏవిటి? ఇంకా ఒక సైడెడ్ గానే వుందిగా!

దీక్షితుల్ని కొత్త సమస్య లెదుర్కొన్నయ్.

ఆమె ఎక్కడ వుంటోందో తెలిసికొని, ఆ తర్వాత కలిసికొని ఎలాగైన సరే ఆమెను తనవేపు లాక్కోవాలి.

అప్పుడు 'తమ ప్రేమ' అవుతుంది.

ఆ తర్వాత, -

ఆ లావుగా, పొడుగ్గావున్నాయన ఎలాగూ వొప్పుకోడు - అలాగ లావుగా, పొడుగ్గా వుండి ఆడపిల్లల వెంటవున్న వాళ్ళు ప్రేమ గట్రా వొప్పుకోరని దీక్షితులకి గాఢంగా తెలుసు.

కనక ఆయన్ను ముందు దాటాలి.

ఇంక తన ఇంటి విషయం. అది చాలా సులభం. అమ్మతో చెప్పిస్తే నాన్న వొప్పుకుంటాడు. లేకపోతే తన కనీసధర్మంగా ఆ పిల్లతో ఓ శుభముహూర్తాన ఎక్కడికయినా లేచిపోవాలి.

"అంతలా ఆలోచిస్తున్నావేమిట్రా దీక్షితులూ."

గోపాలం కేకతో తెలివిలోకొచ్చాడు.

చటుక్కునామె రిక్షాలో వెళ్ళి పోతోంది. ఆమె ఎక్కడకు వెళ్తుందో? ఎలా? ఎలా తెలుసుకోవడం?

రిక్షా వెనకాల పరుగెడుదామన్నంత ఆవేశం కల్గింది దీక్షితులుకి.

"ఏవిట్రో కంగారూ, ఆ పక్కకి అడ్డం పడతున్నావేమిటి. ఇలా వెళ్ళాలి మనం" అని గోపాలం దీక్షితుల్ని రిక్షాలో కూలేసి రూముకు తీసుకుపోయాడు.

× × × × × ×

**ఆ** తర్వాత పాపం దీక్షితులు యమయాతన పడ్డాడు ఆ పిల్ల ఉనికి తెలీక.

ఏ పేదరాశి పెద్దమ్మ ఆ చిన్నదాని జాడ చెబుతూ వుత్తరదిశగా వెళ్ళమని చెప్పలేదు. దాన్తో ఈ చిన్నవాడు మరీ బెంబేలు పడి పోయాడు.

'ఎంత చిక్కిపోయాను' అనుకున్నాడు రెండు పూటలా సుష్టుగా భోంచేస్తున్న దీక్షితులు.

కిటికీ గుండా వీధిలోకి చూస్తున్న దీక్షితులు 'అలా చిక్కిపోతున్నావేమిట్రా?' అని గోపాలమైనా పల్కరించలేదని మహా ఇదయి పోతున్నాడు.

తళుక్కున మెరిసింది 'ఆమె' వీధిలో.

ధడ ధడా లేచాడు కుర్చీలోంచి.

ఒక్కవూపులో వీదిలో పడబోయి రూళ్ళ కర్ర మీద జారి ఎన్నడూ దేవుడిక్కూడా సాష్టాంగ పడనివాడు అమాంతం ఈనాడు సాష్టాంగం పడిపొయ్యాడు.

రెక్క పట్టుకు లేవదీస్తూ "ఏమిట్రా ఆ తొందర. అలా లేచేవేమిటి స్ప్రింగ్‌లాగ" అంటున్నాడు గోపాలం.

"ఆ ...అ..అమ్మాయి" అంటున్నాడు దీక్షితులు వీధిలోకి వేలెట్టి చూపుతూ.

"అవును. ఆ వస్తున్నామె అమ్మాయి గాక నేనేం జంతువో, నరరూప రాక్షసో అనుకోడం లేదుగా. అరెరె! మోకాలు చిప్ప వూడినంత పనయిందే. కొబ్బరి నూనె రాయి."

"అబ్బ! కొబ్బరి నూనె ఏవిట్రా, ఆ అమ్మాయి."

"ఓ మూల మోకాలు రక్తప్రవాహాలవుతుంటే అమ్మాయేవిటి నీ బొంద."

"నన్నాట్టే బాధ పెట్టకురా. ఆ అమ్మాయి యెవరో ఎక్కడుంటోందో..." మాట పూర్తి చేయలేక పోయాడు దెబ్బల మూలాన బాధపడ్తూన్న దీక్షితులు.

"చంపేశావు! అంతేనా! మన వెనక వీధిలో పచ్చమేడ లేదూ ఆ యింట్లో వుంటోందిలే. హైస్కూల్లో చదువుతోంది. సరేనా! పైగా ఆ పిల్లని చూసీ చూడగానే 'హల్లావో' అంటూ అలా లేచి వళ్ళంతా హూనం చేసుకున్నావేమిట్రా. ఐడిన్ రాయనా?"

"కావాలంటే నువ్వు రాసుకో బాబు నన్ను చంపక. కాని నీకిదంతా ఎలా తెలిసింది?" అన్నాడు దీక్షితులు సందేహంగా.

"మన గది వూడుస్తుంది వెంకమ్మలేదూ అది వాళ్ళింట్లో గూడ పనిచేస్తోందటలే. అది చెప్పిందీ పిల్లో

రోజున ఇలా వెళ్తుంటే. ఆ పిల్ల చాలా తెలివయిందనీ, వాళ్ళ యజమాని పీడ్రగోరనీ, ఆయన చాలా లావిటి పుస్తకాలు బోలెడు చదివారనీ, అవన్నీ పది బీరువాల్లో వున్నాయనీ..."

"ఆయన పుస్తకాలూ, బీరువాలూ ఎందుకు మనకి-ఊరికే ఇచ్చినా వద్దవి. ఆ పిల్ల గురించి ఏం చెప్పిందంటే నాన్చి చంపుతున్నావే, చప్పున ఏడవక" దీక్షితులు బాధగా అన్నాడు పగిలిన మోకాలు చూసుకుంటూ.

"ఓరేయ్ అబ్బాయ్ మనకి తెల్సిన విషయాలు చెప్పుకొస్తున్నాం. నీ యిష్టం వచ్చినట్టు భస్తే చెప్పను. కావాలంటే ఆ వెంకమ్మనే అడుక్కో" విసురుగా వీధిలోకి పోయాడు గోపాలం.

వోరి వీడి తస్సాదియ్య ఎంత పొగరుగా ఉంది వీడికి!

ఎంత నిర్లక్ష్యంగా వుంది వీడి పని!

పైగా 'మనికి' తెల్సిన విషయాలు చెప్తున్నాం అంటాడు. వెధవ 'రాయల్ వుయ్' వీడూను!

× × × × × ×

ఆ తర్వాత దీక్షితులు వెంకమ్మకో రూపాయి లంచం పడేసి ఆ పిల్ల వాళ్ళ మేనమామ గారింట్లో ఉండి ఈ ఊళ్ళో చదువుకుంటోందని తెలుసుకున్నాడు.

"పేరేమిటన్నవావ్?" పదో సారడిగాడు దీక్షితులు.

"సీతమ్మగోరండి"

"ఇంటి పేరు?"

చెప్పింది.

"గొడవ లేకుండా మీ శాఖలో పిల్లనే చూసుకున్నావే" గోపాలం వెటకారంగా అన్నాడు.

"అంటే నీ వుద్దేశం...." అని వూరుకున్నాడు దీక్షితులు గోపాలం వినడని గ్రహించి.

ఆ పైన కొన్నాళ్ళా వెనక వీధే కాపరమయిపోయింది దీక్షితులుకి.

ఆ పిల్ల ప్రతి లక్ష్మివారం సాయంత్రం ఓ ఆరేళ్ళ పిల్లాణ్ణి తీసికొని 'సాయిబాబా' ఆలయానికి వెళ్తుందని, ఆ రోజున తప్పక నీలిరంగు బ్లౌజు వేసుకుంటుందనీ, సరిగా 10-45కు రాత్రి లైటార్పేస్తుందనీ, మేడ మీద దక్షిణవేపు గదిలో ఆమె ఉంటుందనీ - ఆదిగాగల విషయాలన్నీ స్వయంగా గ్రహించాడు.

ఆమెనెలా కలుసుకోవాలో తెలీక అతను పడ్డ బాధ ఇంతా అంతా కాదు.

రోడ్డు మీద కలుసుకు మాట్లాడితే?

- మాట్లాడుతుందో లేదో?

వెంకమ్మ చేత కబురు పంపిస్తే?

ఆ కబురు తిన్నగా తీసికెళ్ళి అది ఆ లావుగా, పొడుగ్గా ఉన్న ఆ 'పీ(డ' గారి కందిస్తుందేమో?

వుత్తరం రాస్తే?

ఇంట్లోకి జర్మని వెళ్ళిపోతే ఏదో పనున్నట్టు - అలా అయితే మన పని పట్టేస్తారు.

ఏది దారి?

ఏ దారి కనబడక దీక్షితులు నడుస్తున్న రోడ్డు వదిలేసి కంకర గుట్ట మీదికి నేరుగా నడిచేడు.

వెధవ్వూరు, ఎక్కడ చూసినా కంకర గుట్టలే.

ఇలా ఎంతకాలం?

హబ్బ! విసిగెత్తిపోతోంది.

లాభం లేదు! ఏదో చేయాలి.

అలా అని దీక్షితులు ఆ పిల్లని కలుసుకోకుండా ఉన్నాడనీ గాదు.

ఆమె అతన్తో మాట్లాడలేదని గాదు.

అదంతా గమ్మత్తుగా జరిగింది.

దీక్షితులు ఆ పిల్లని (పేమించాననుకున్న తర్వాత ఇరవై మూడోరోజున ఆ పిల్ల అతనితో మాట్లాడింది.

ఇరవై తొమ్మిదో రోజున ఆ పిల్ల పార్కులో సావుకాశంగా మాట్లాడింది.

నెల మారింది.

దీక్షితుల 'చ(క్రమే' మారింది.

- ఆ ఇరవై మూడో రోజున ఆమె స్కూల్నించి వస్తోంది. ఆమె వెంటపడ్డాడు మన ఇరవై వసంతాల సంస్కర్త.

ఆమెను చూస్తూ నడుస్తున్న దీక్షితులు అలవాటు ప్రకారం బురద గుంటలోకి నడిచాడు.

కిలకిలా నవ్విందామె.

"దారి చూసి నడిస్తే 'అడుసు తొక్కనేల కాలు కడగనేల?" అందామె ఏదో స్వగతంలా.

"కాళ్ళకి కళ్ళు లేవుగా" విట్టు వేశాననుకున్నాడు.

"ఉన్న రెండు కళ్ళతో చాలు వెంట్టాడ్డం! చాలు. కాళ్ళకి కూడా మొలిస్తే చెప్పాలీ ఇహ" విసురుగా అని దారి తీసింది.

ఆ రాత్రి నిద్ర పట్టలేదు అతగాడికి.

ఇక ఇరవై తొమ్మిదోరోజు సంగతిః

'విరహ మనుభవిస్తున్నాననుకొన్న' దీక్షితులు ఒంటరిగా ఏడవడానికి పార్కుకొచ్చాడు.

వెళ్ళడం ఒక్కడూ వెళ్ళాడు - ఏడుస్తూ.

రావడం ఇద్దరూ వచ్చారు - సంతోషంగా.

ఆమె పార్కుకొచ్చింది - గడ్డి పువ్వుల్ని చూస్తూ కూచుంది.

అతను వచ్చాడు - ఆమెను చూస్తూ నించుండి పోయాడు. కాసేపటికామె ఇటు తిరిగింది.

"ఇలా ఎంతసేపణ్ణించి వున్నారు?"

అతను ఏమన్నదీ, ఆమె 'రియాక్షన్' - అదంతా అనవసరం.

అతను ప్రాధేయపడ్డాడు.

తన గోడు వినిపించాడు.

ఆమె వింది.

విని కరిగిందో లేదో తెలీదు.

కాని ఆ తర్వాత 'సీతా - దీక్షితులూ' పార్కులోకి కలిసి రావడం చాలా మందికి తెలుసు.

"ఎన్నాళ్ళీ దాగుడుమూతలు?" హఠాత్తుగా అంది సీత ఓ రోజున.

"ఏం చేద్దామంటావ్?" విరహం, ప్రణయం, ఇంత త్వరగా తెమిలిపోడం దీక్షితులుకి రుచించలేదు.

"తర్వాత ఏం చెయ్యాలో తెలీదూ!" వోరగా చూసిందామె.

"అదిగో ఆ కళ్ళే నా కళ్ళు కప్పేసి సైడు కాలువల్లోకి దింపుత. ఆ చూపుకే రోడ్లట్టుకు తిరిగాను."

"కవిత్వ మవసరం లేదు గాని, ముందు సంగతి ఆలోచించాలి."

"నేనూ అదే చూస్తున్నా..." అన్న తర్వాత ఆమెను ప్రేమగా, ముద్దుగా పిలవాలనిపించి ఏమనాలో తెలీక ...."సీతా" అని పూర్తి చేశాడు దీక్షితులు.

కాసేపాలోచించి "ఏమైనా కట్నం తీసుకోకుండానే చేసుకుంటాను" అన్నాడు ధీమాగా.

గమ్మత్తుగా నవ్విందామె.

నవ్వే ముందూ, నవ్వింతర్వాత కూడా ఏమీ అనలేదు.

"అంటే నీ వుద్దేశం..." దీక్షితుల మాటనామె పోనివ్వలేదు.

"ఆవేశపడితే లాభం లేదండీ" అందామె సన్నగా నవ్వుతూ.

× × × × × ×

"ఎంత వరకు వచ్చిందోయ్ ప్రేమకలాపం మిత్రమా?" గోపాలం గెడ్డం గీసుకుంటూ మొహం తిప్పకుండానే అడిగాడు.

"ఛస్తుంటే సంధి మంత్రంలా నువ్వోడివి. పేపర్లిచ్చారు. కెమిస్ట్రీ, మాత్స్‌లో చాల 'పూర్'గా వచ్చాయి. పైగా ఆ లెక్చరర్ ఒకడు మన ప్రాణానికి" అన్నాడు దీక్షితులు.

"ఏం? మూడు సబ్జెక్టులూ కలిపినా సున్నా రాలేదా?"

"నీ వేళాకోళం వొహటి నాకు. నిన్న క్లాసులో నిలేసి 'కార్బోహైడ్రేట్సు' అంటే ఏమిటని అరగంట చంపేశాడురా. ఏమిటి దాని అర్థం?"

"నాకు మాత్రం తెలిసి ఏడిసిందా ఏమిటి? అవును గాని, నీ కెమిస్ట్రీ పేపరు చూసి మిగతా పేపర్లలో

వచ్చిన మార్కులు తీసేస్తామన్నారుట ఏమిటి? ఇందాక 'మల్లి' చెప్పాడు."

"ఒరేయ్ కొంచెం చెప్పరా, రేపు మళ్ళా నన్నే అడిగేట్టున్నాడు."

"ధైర్యంగా చెప్పేవోయ్. అవతల 'లవ్వు'లో పడ్డాను. కోర్టింగ్ సాగుతోంది. నేనేం అష్టావధాన్ని కాదు సరిగదా 'ధి'శావధాన్ని గూడా కాదు - చదువుకు ప్రేమకూ ఎలా ముడివేస్తాను? లవ్వా మరోటా అనేయ్."

"నీ వాలకం నాకేం నచ్చలేదురోయ్ గోపాలం! పైగా మా నాన్న దగ్గర్నుంచి ఉత్తరం గూడా వచ్చిందీవేళ."

"మరీ మంచిది. ఓ వంద రూపాయలు టి.ఎం.ఓ చేయమను. మళ్ళీ పదిహేను రోజులు మీ నాన్న ఆ 'షాక్' నుండి తేరుకునే దాకా నీ వూసెత్తితే అడుగు" నవ్వాపుకుంటూ అన్నాడు గోపాలం.

"నే చెప్పేది వినరా బాబు. ఏదో సంబంధం వచ్చిందట. చూసుకోడానికి శుద్ధ విదియ నాటికి రమ్మంటున్నాడు."

"శుద్ధ విదియ ఎప్పుడో నాకేం తెల్సు నిన్ను వెళ్ళమనడానికి."

"హబ్బ! వినరా పూర్తిగా. డేట్ చెప్పేళ్ళే. ఇప్పుడు ఇంకో సంబంధం చుట్టా రమ్మంటాడెలా?"

"ఏవుందీ, నేనే చూసుకున్నానో చక్కటి చుక్కని, మీరే సకుటుంబంగా విచ్చేసి పిల్లని చూసుకుని, మదర్పిత చందన తాంబూలాలు గ్రహించి, ఇట్లు మంగళం మహత్, శ్రీశ్రీశ్రీ అని రాసెయ్."

"ఏమిట్రా నీ ధోరణి. నాకు ఏడుపొస్తోందిరా బాబు. కాస్త సలహా చెప్పరా" జాలిగా అన్నాడు దీక్షితులు.

"అలా దారికిరా, పేద్ద ఆలోచించకు. దర్జాగా వెళ్ళు, జల్సాగా పిల్లని చూసెయ్ - నచ్చలేదను. ఇలా రెండు మూడు మాట్లయ్యేటప్పటికి మీ నాన్న రోగం కుదిరి 'మరి నచ్చేదెవర్రా' అంటాడు. వెంటనే నీ కాబోయే మిసెస్ ఎవరూ... రైట్... 'సీతా - దీక్షిత్' పేరు చెప్పేయ్. మిగతాది వాళ్ళు చూసుకుంటారు."

"అంతేనంటావా, సరే".

ఆ సాయంత్రం దీక్షితులు సీతను కలుసుకోలేకపోయాడు. ఆమె కనపళ్ళేదు.

ఆ రాత్రే ఊరికి బయల్దేరి పొద్దుటే జేరాడు.

సీతారామయ్యగారు చుట్ట కాల్చుకుంటా వీధులో కూచున్నాడు.

ఆయన కొడుకుని పలకరించలేదు.

"ఒరేయ్ వెంకన్నా నీళ్ళు తీసుకురా" అని మాత్రం అన్నాడు.

కాళ్ళు కడుక్కొని ఇంట్లోకి పోయాడు.

"ఏంరోయ్ పెళ్ళికొడుకా" అంటూ మధ్యాహ్నము దిగాడు దీక్షితుల మేనమామ రామారావు.

సాయంత్రం బావమరుదులిద్దరూ అరుగు మీద చతికిలపడ్డారు.

"ఇలా రావోయ్ అల్లుడా! ఏమిటి విశేషాలు" అని పిల్చాడు రామారావు.

'నాన్నే కేకేయించి వుంటాడు. నాకు విశేషాలు చెప్పబోతూ నన్నే అడుగుతున్నారు' అనుకుంటూ ెళ్ళాడు దీక్షితులు.

"రేపు ఉదయమే వెళ్దామోయ్ బావా. వాళ్ళకా ఒక్కతే పిల్ల. ముచ్చటగా ఐదు రోజులూ చేస్తారు. ంకంత ఇల్లు, సొంత వ్యవసాయం, పాడి గట్రా... పైగా పిల్ల హైస్కూల్లో చదువుతోందట కూడాను. ఊ....' అంటూ సాభిప్రాయంగా కొడుకు వేపు చూశారు సీతారామయ్యగారు, చెప్తున్నది బావమరిదితోనైనా.

'ఉపోద్ఘాతం బాగానే ఉంది. పల్లెటూళ్ళో ఉంటూ హైస్కూల్లో చదువుకోడమేమిటి. వాళ్ళు చెప్పారు. ఈయన నమ్మాడు. పాపం! వీళ్ళకేం తెల్సు మనం ఒప్పుకోమని' అనుకున్నాడు దీక్షితులు.

"ఏం అల్లుడా ఏవంటావ్? మౌనం అర్థాంగీకారమా?" అంటూ రామారావు తను అన్నదానికి తెగ ంతోషించి, మహా అబ్బురపడి, ఊహూ నవ్వేశాడు.

"దేనికి అంగీకారం? పిల్లని చూడకుండా. వాళ్ళ పాడి, ఇల్లు ఐతే మాత్రం అర్ధాంగీకారమే - ంగీకారమే అనచ్చు" అన్నాడు దీక్షితులు.

"చూద్దువు గాని రా నాయానా! పిల్లని చూడ్డానికి అంత తొందరెందుకోయ్!" అని రామారావు మళ్ళీ వ్వు సాగించబోయేటప్పటికి దీక్షితులు "అలా షికారు వెళ్లొస్తా" అంటూ లేచిపోయాడు.

× × × × × × ×

**రెం**డో రోజునే పిల్లని చూడ్డానికి వెళ్ళారు. అవున్నిజమే! లంకంత ఇల్లే!

ఇంత ఇల్లేమిటి, నాజూగ్గా లేకుండా.

"రండి బావగారూ" అంటూ ఒకాయన లోపలికి తీసికెళ్ళాడు.

"నీ వుడ్‌బీ మావగార్రా ఆయన" అన్నాడు రామారావు మేనల్లుడితో ప్రైవేటుగా.

ఆయన నిండుగా ఉన్నాడు. మొహాన్న చిన్న బొట్టు.

ఇల్లంతా పాలేళ్ళతో గాభరాగా ఉంది. ఒక పని చెయ్యడానికి పది మంది పరుగెట్టున్నారు. ఒకడు దీక్షితులుకి విసినకర్రతో విసురుతూ, అతను ఎక్కడకు వెళ్తే అక్కడికి వెంట వస్తున్నాడు గాభరాగా.

'వీడేమిటి, నా ప్రాణానికి' అనుకున్నాడు దీక్షితులు.

గుమ్మాలకి పసుపులూ, బొట్టు - ఇల్లంతా మంగళప్రదంగా ఉంది.

'నేనసలు 'ప్రెజుడిషియల్' గా వున్నానేమో' అని తర్కించుకున్నాడు దీక్షితులు.

"ఇంటికప్పుడే పెళ్ళి కళ వచ్చేసిందండోయ్" అని రామారావు ఇంటాయన్తో అని తెగ నవ్వాడు.

'మావయ్య కివాళ 'నవ్వుడు రోగం' పట్టుకున్నట్టు వుంది. లాభం లేదు! ఈ మనిషి అన్నిటికీ తెగ నవ్వుతున్నాడు.'

వాళ్ళు పెట్టినవన్నీ తినేసి "నాజూగ్గా తింటావేమిటోయ్ అల్లుడా" అని రామారావు మళ్ళా నవ్వబోతుంటే ఆయన "అమ్మాయిని తీసుకురమ్మంటారా?" అన్నాడు.

రామారావు నవ్వబోతున్న వాడల్లా మానేశాడు.

'బతికాను' అనుకున్నాడు దీక్షితులు.

పాపం వీళ్ళకేం తెల్సు నేనొప్పుకోనని.

"చూడవోయ్ పిల్లని, నీకు నచ్చాలిగా" అన్నాడు రామారావు.

ఏదో ఆలోచిస్తున్న దీక్షితులు తల తిప్పేడు.

ఇదేమిటి?

ఆశ్చర్యమాశ్చర్యం!

ఎదురుగా పెళ్ళికూతురు వేషంలో ఎవరు?

ఇదేం కలా!

ఎదురుగా పెళ్ళికూతురు వేషంలో 'సీత'.

నమ్మలేకపోయాడు.

నమ్మకచేసేదేముంది, ఎదురుగా కనబడ్తుంటే.

చలిపితనం అంటే ఏవిటో ఎరగని ముగ్ధలా కూచునుందామె.

ఇంత నమ్రత ఎలా వచ్చిందో!

ఆహా! ఎంత నేర్పరితనం!

ఆమె ఓరగా చూసింది.

నన్నోనాడు వెంట తిప్పించుకొన్న ఆ కళ్ళల్లో ఎంత అమాయకత్వం!

"అమ్మాయి మేనమావ దగ్గర వుండి చదువుకుంటోంది. మా బావ మంచి ఏదో 'అఫ్పీ'లుందట రాలేకపోయాడు...." ఆయనేదో అంటున్నాడు.

ఆమె పాట పాడింది. పెద్దల ఆజ్ఞ ప్రకారం తలవొంచుకుని వెళ్ళిపోయింది.

రామారావు దీక్షితుల్ని పక్కగా తీసుకువెళ్ళాడు. ఓ మధ్యవర్తి వచ్చాడు.

"మీకు పిల్లనచ్చితే... మేం...మరి...మిగిలే విషయాలు...ఏదీ" అని ఓ రకం మందహాసం విసిరాడు.

"ఆహా"

"రేపు ఆదివారం వస్తామండీ" అంటూ సాగనంపేరు.

× × × × × ×

ఆదివారం వచ్చారు.

ముందు గదిలో సీతారామయ్యగారు, రామారావు, రామారావు మాటల్లో 'వుడ్‌బీ మావగారూ', ఇంకో ఇద్దరు పెద్దమనుషులు కూచుని మాట్లాడుతున్నారు.

"మిగతా కట్నం కానుక లాంఛనాలు మాట మరీ..." ఎవరో అంటున్నారు.

'అదేమిటి? కట్నమేవిటి? లాభంలేదని చెప్పెయ్యాలి" అనుకొని దీక్షితులు తొందరపడ్డాడు.

'ఇంత 'మీన్'గా వ్యవహరిస్తారే నాన్న, మావయ్యా! లాభం లేదు. చెప్పెయ్యాలి.'

- అనుకున్న దీక్షితులు ఈసారి చెప్పలేదు, వింటున్నాడు.

"నేను పది వేలైనా కట్నం తీసుకోకపోతే 'పీపుల్ విల్ మాక్ ఎట్ మీ" అంటున్నారు సీతారామయ్యగారు.

పదివేలు!

అవును! తనా పైకి చదవాలి.

దానికి డబ్బు కావాలి.

'ఛీ లొంగిపోతున్నాను' వాపోయాడు దీక్షితులు.

ఇంతలో తొందరగా రామారావు ఇంట్లోకొచ్చి "అక్కయ్యోయ్, వాళ్ళు పదివేలకి మొగ్గేట్టున్నారేవ్! అల్లుడా మంచి ఛాన్సురోయ్" అని ఇల్లంత అలంగం తిరిగేస్తున్నాడు.

'నా బంగారత్తండే' అని చెంపల మీద మెటికలు విరిచింది తల్లి.

వీళ్ళంతా నా మీద ఆశ పెట్టుకున్నారు.

'పీపుల్ విల్ మాక్ ఎట్ ఫాదర్' కట్నం తీసి కోకపోతే.

"తమ్ముడూ ఆడబడుచు లాంఛనాలు కట్నంలో కలిపేస్తారేవో సుమీ! అలా వీల్లేదు. విడివిడిగా ఐదొందలు ఇవ్వాల్సిందే" అంటోంది పెద్దక్కగారు.

పాపం! వీళ్ళందర్నీ చూసి లొంగిపోయాడు సుమండీ దీక్షితులు!

అతనికి తీసికోవాలని సుతరామూ లేదు సుమండీ!

× × × × × ×

"సీతా దీక్షితుల" పెళ్ళి వైభవంగా జరిగింది.

ఓనాడు ఖాళీగా ఉన్నప్పుడు పెళ్ళితో చెప్పింది సీత దీక్షితులతో ఫ "ఆశ్చర్యంగా ఉందా! మావయ్యతో చెప్పా. మా నాన్నగారి ద్వారా మీ నాన్నగారికి కబురొచ్చింది. మనిద్దరం దగ్గరికొచ్చాం అంతే!"

'త్రూ ప్రోపర్ ఛానల్' ద్వారా వచ్చిందన్న మాట వ్యవహారం.

"అందరూ కలిసి నన్ను ఒంచేసేరు. ఆశయానికి విరుద్ధంగా జరిగింది" బాధ పడ్డాడు దీక్షితులు.

తెలివైన దీక్షితులు ఎంత ప్రయత్నించినా సంస్కర్త కాలేకపోయాడు.

పూర్ ఫెలో!

తన తప్పేం లేదని అతనంటాడు.

అతని 'ఆ' ఆశయాలు ఇప్పటికీ ఉన్నాయి.

ఇతరులు తీసికొనే కట్నం మీద.

తనది ఎక్సెప్షన్!

తను పరిస్థితులు వారసుడు.

కట్నం : 8వేలు

లాంఛనాలు : రు. 1500

వెరశి : రు. 9, 500లు

అక్షరాలా తొమ్మిదివేల ఐదు వందలూ ఇష్టం లేకపోయినా స్వీకరించాడు.

- పాపం! దీక్షితులు !

*(తెలుగు స్వతంత్ర : 26-8-1955)*



# భావిపౌరులు

"ప్రేమించాన్రోయ్" అన్నాడు హఠాత్తుగా రామారావు.

"అలా కిటికీలో కూచుని ప్రేమించానంటాడు-జడుసుకున్నాడేమో చూడండ్రా" అని వెంకటేశ్వర్లు.

"పక్కింటి నారాయణయ్యగారు కూతుర్ని కాదుగదా?" అని సుబ్బారావు ప్రశ్న.

"అందమున కోతిపిల్ల ఆ అరవ పిల్ల".

"ఎవడాకూసింది?" అని పక్కింటి అయ్యరు కూతురి మీద మమత పెంచుకుంటున్న గోపాలం కరకు కంఠం ధ్వనించింది.

" 'ఇమ్మనుజేశ్వరాధముల' పద్యం చెప్పిన శ్రీనాధుడనుకుంటా - నేను మాత్రం కాదు".

"ఇంతకీ రామారావు ప్రేమసంగతేం చేశారు?"

"చేయడానికేముంది.... వాడి ప్రేమగాథ వినే ఓపిక ఎవడికుంది?"

"ప్రస్తుతం సిగరెట్టు, ఆ తర్వాత కాఫీ ఇస్తే నే వింటా" అన్నాడు సుబ్బారావు.

రామారావు కిటికీలోంచి దూకి సుబ్బారావుకో సిగరెట్టు పడేసి, సాలోచనగా అందరికేసి చూసి " నేనీ ారి చాలా సిన్సియర్; ఇంతకీ ఎవరో తెలుసా?" అన్నాడు.

మిత్రబృందంలో కలగవల్సినంత కూతుహలం కలగకపోడంతో తనే మళ్ళా మొదలెట్టాడు.

"ఎదురింటి మేష్టారు పిల్ల పెళ్లి చెయ్యలేక ఎంత బాధపడ్తున్నాడో మీకేం తెలుసు? ఇంటిదగ్గర్నించి యం.వో.లు వస్తుంటే మీకేం పడతాయి ఇవి?"

"ఎదురింటి మేష్టారి కూతురు సీతారత్నమా? పాపం! నిజమే! - విచారించదగ్గ విషయమే. ఇంతకీ నీకు ఆయన కూతురి మీద ప్రేమా, లేక ఆయన మీద జాలా?" అన్నాడు వెంకటేశ్వర్లు.

"రెండూనూ" అన్నాడు కాసేపాలోచించి రామారావు.

"అట్టే వెధవ్వేషాలెయ్యకు - తెలిస్తే మీ నాన్న తన్నగలడు," అని లేచాడు సుబ్బారావు.

ఎదురింటి మేష్టారు ఆ వీధిలోవాళ్ళందరికీ మేష్టారే. ఆయనికి స్కూల్లో పని. ఆయన కూతురు సీతారత్నం కొంచెం బొద్దుగా, కళ్ళంతా పులుముకున్న కాటికతో, ముచ్చటగా వుంటుంది. మేష్టారి భార్య ఆ పిల్లకి 'ఈడువచ్చేస్తోం'దని ఆ పిల్ల పదకొండేళ్ళనాడే మొదలెట్టి, ఆ కాస్తా ఐన తర్వాత ఈ మూడేళ్లబట్టీ కూడా మేష్టార్ని పిల్లదాని పెళ్లి కాస్తా ఐందనిపించేయమని కోరుతోంది. మేష్టారికీ వుంది, చేసెయ్యాలని. లేందల్లా కట్నం పొయ్యడానికి డబ్బు. అది దొరికే మార్గమూ, పిల్ల పెళ్ళిచేసే వీలూ లేక ఆయన కూతుర్ని స్కూల్లో జేర్పించాడు - మరో మార్గంలేక సీతారత్నం ఎదురింటి డాబా మీద నించి కాలేజి పిల్లలు తనని చూసి చేసే చేష్టల్ని చూసి కొద్దిగా నవ్వుకొనేది.

పరిస్థితులిలా వుండగా రామారావు సీతారత్నానికి, ముద్దులు మూటగట్టే ప్రేమలేఖ రాశాడు. ఆ అమ్మాయి కంగారుపడి తండ్రి కిచ్చింది. ఆయన ఓ సాయంత్రం రామారావుని దూరంగా తీసికెళ్ళి, జేబులోంచి ఉత్తరం తీస్తూ "మీలాటి చదువుకునేవారే ఇలా చేస్తే మా బతుకేంగాను? అసలే పెళ్ళి చెయ్యలేక చస్తుంటే, ఇలాటి అపవాదు పడితే పిల్లని చూసేవాడుంటాడా? మీరే చెప్పండి" అన్నాడు.

రామారావు పర్యవసానం ఇలా అవుతుందని, తెలీక బిత్తరపోయాడు. చివరికి "నిజంగా పెళ్లి జేసుకుందామనేనండీ..." అన్నాడు.

"దానికి మాత్రం మార్గం లేదా నాయనా? మీవాళ్లూ, తల్లీ దండ్రీ చూసుకోవాలి. పెద్దల కోరికలు తీరాలి. ఉద్దేశం మంచిదైనా ఇలాటి ఆవేశం పనికిరావు బాబూ," అని మేష్టారు మెత్తగా చీవాట్లెట్టి వెళ్లిపోయారు.

సంస్కర్త కాబోయిన రామారావుకి అరికాలి మంట నెత్తికెక్కింది - ఆయన ప్రవర్తన చూసి తన వుద్దేశాన్ని అంత నీచంగా తీసేస్తాడా అని ఆవేశపడిపోయాడు. సెలవల్లో ఇంటికెళ్ళి తల్లితో విషయం కదిపి సీతారత్నం సంగతి చెప్పాడు. ఆవిడ భర్తకి చెప్పింది. ఆయన ఏం మాటాడక ఓ పదిహేనురోజుల్లో ఓ మంచి సంబంధం చూసి కొడుక్కి పెళ్లి కానిచ్చేశాడు.

రామారావు ఏదో అనబోయి, చెయ్యబోయి, పిల్లనీ, మామగార్నీ, వాళ్ళ మేడనీ చూసి తగ్గాడు. శలవల్నించి ఐదు పోగుల్లో వచ్చిన రామారావుకి ఐదు వేలు దక్కాయి. మిత్రబృందానికి 'పార్టీ' కూడా ఇచ్చాడు - వివాహ సందర్భం పురస్కరించుకొని.

× × × × × × ×

మేష్టారింటికి సీతారత్నాన్ని చూసేందుకు వచ్చేవాళ్ళు వస్తున్నారు. వెళ్ళేవాళ్ళు వెళ్తున్నారు. ఎవరి ధరా ఐదు వేలకి తగ్గకపోవడంతో మేష్టారికి కాదాము లెక్కినట్టుగా వుంది.

ఆ సాయంత్రం సుబ్బారావు అంటున్నాడు! "సీతారత్నాన్ని రేపు ఓ రెండో పెళ్ళి పెళ్ళికొడుకు చూడ్డానికి వస్తున్నాడట - మన 'లాండ్‌లార్డు' చెప్పాడు."

మిత్రులంతా మేష్టారు తన కూతురి భావి జీవితాన్నలా భగ్నం చేస్తున్నందుకు యథాశక్తి విచారించారు. తల తాకట్టు పెట్టి అయినా మంచి సంబంధం చెయ్యాలన్నారు. కాకి ముక్కుకు దొండపండులా రెండో పెళ్ళివాడికా అని కోపగించారు. రాత్రి సినిమాకి వెళ్ళి హాయిగా పడుక్కొన్నారు. ఆ సంబంధమూ కుదరలేదు ఆ పిల్లకి.

ఇవాళింకో పెళ్ళికొడుకు వస్తున్నాడ్డటరోయ్" అన్నాడు వెంకటేశ్వర్లు ఓ పది రోజులు పోయాక.

సీతారత్నాన్ని చూసుకుందుకు వచ్చినతనకి ఇరవై ఎనిమిదేళ్ళు వుంటాయి. నల్లగా, పొడుగాటి ముక్కుతో, దృఢంగా వున్నాడు. సీతారత్నానికి ఇలాటి చూపులు అలవాటైపోయి ఓ సారి మాత్రం చూసింది అతని వైపు... గుబురుగా పెరిగిన కనుబొమలూ, ఎర్రటి జీరలున్న కళ్ళు చూసి తల దించేసుకుంది. ఆ పిల్లని అతనితో వచ్చినవాళ్ళు నడిపించారు. జడ చూశారు. పాడమన్నారు. ఒక్క పరిగెత్తడం మినహా అన్నీ చేయించి నచ్చిందన్నారు. ఎలాగైతేనేం ఆ సంబంధం ఖాయపర్చారు మాష్టారు. నెల రోజుల్లో పందిళ్ళువేసి పెళ్ళి అయిందనిపించారు - వెయ్యి రూపాయల కట్నంతో.

పెళ్ళికొచ్చిన పెళ్లికొడుకుని చూసి సుబ్బారావు అన్నాడు : '"వీడిది మా వూరేరా! మొదటి పెళ్ళాన్ని వదిలేశాడు"

"ఏం? ఏంచేత?"

"నూతిలో దూకిందట ఆవిడ ఓ రాత్రి వీడి బాధ పడలేక. కొంతమంది వీడేదో చేశాడంటారు. ాధలు పడలేక మళ్ళా రాలేదంటారు."

"అలాటివాడి కెలా ఇస్తున్నాడురా మేష్టారు?"

"ఇలా చేసి ఆడపిల్లల గొంతు కోస్తున్నారు."

- అని కాసేపు సంఘాన్ని ఏకి పారేసి ఆలిసివూరుకున్నారు మిత్ర బృందం.

సీతారత్నం నెల రోజుల్లో కాళ్ళకి పారాణితో, ముఖానికి పసుపుతో, కళ్లల్లో నీళ్లతో తల్లిదండ్రుల్ని

విడిచి కాపురానికెళ్ళింది.

"హమ్మయ్య! కన్నె చెర వదిలింది." అనుకున్నారు మేష్టారు బండి ఎక్కుతున్న కూతుర్ని చూస్తూ కళ్ళు తుడుచుకుంటూ.

× × × × × ×

తొమ్మిదినెల్లతర్వాత సీతారత్నం పుట్టింటి కొచ్చింది. దొడ్లో నీళ్లుతోడుతూ ఎదురింటి డాబా వైపు చూసింది. కేరింతలు కొడ్తూ, ఖులాసాగా వున్నారు స్టూడెంట్లు. బరువైన బిందెతో బరువుగా అడుగువేస్తూ ఇంట్లోకెళ్లింది. సీతారత్నంలో మునుపటి పొంగు పోయింది. కళ్ళ కింద చర్మం నల్లబడి, కళ్లు గుంటలు పడ్డాయి. రంగు తగ్గి సన్నబడింది. కడుపు మాత్రం ఎత్తుగా వుంది, లోపల పెరుగుతూన్న జీవికి నిదర్శనంగా.

ఆరె నెల్లో మళ్లా అత్తారింటి దగ్గర్నించి రమ్మంటే హడావిడిగా బయల్దేరి వెళ్ళిపోయింది... దీనంగా తల్లిదండ్రుల్ని చూస్తూ.

"అపుడే వెళ్ళిందేమోయ్ సీతారత్నం? పాపాయిని చంక నెత్తుకోకుండానే."

"ఆ వెధవ మొగుడుగాడికి కుదరని రోగాలు. ఇంట్లో పనంతా ఈ పిల్లే చేయాలి. మరి ఏమవసరమొచ్చిందో," అన్నాడు సుబ్బారావు.

ఇంకో నెల్లాళ్ళల్లో పరీక్షల మూలాన్న శ్రద్ధగానే చదువుతున్నారు విద్యార్థులు. ఓ రోజు సాయంత్రం వెంకటేశ్వర్లు తండ్రి వొచ్చి కుర్రాణ్ణి తీసికెళ్ళి ప్లీడరు సుందర్రామయ్యగారి సంబంధం చూసి వచ్చారు. కట్నం కింద ఎనిమిది వేలు మాట్లాడుకొన్నారు.. పెళ్లి పరీక్షలైన తర్వాత అని స్థిరపరుచుకొన్నారు. పరీక్షలు అయిపోయాయి. తర్వాత వెంకటేశ్వర్లుని మిత్రులంతా కాబోయే పెళ్ళికి ఇప్పుడు 'పార్టీ' చెయ్యమన్నారు.

టాయ్‌లెట్ అయి బయల్దేరబోతున్న వాళ్ళకి ఎదురింటి మాష్టారింట్లోంచి రాగాలూ, ఏడుపులూ వినపడ్డాయి. డాబా మీద కొచ్చారు.

ఒంటెద్దు బండిలోంచి బొట్టు చెరిపేసుకొని, గాజులు తీయించేసుకుని, తెల్లచీరతో దిగుతోంది సీతారత్నం. తల్లి రాగాలనీ, తండ్రి ఏడ్పులనీ, ఆమె జీవం లేని మొహాన్నీ చూసి అంతా బాధపడ్డారు.

"ఆ వెధవకిస్తే ఇలా అవుతుందని నాకు ముందే తెలుసు," అన్నాడు సుబ్బారావు.

"ఆ మాత్రం ముందే తెలుసుకోవద్దూ, వాడికేం జబ్బులున్నాయో! ఏవీ చూసుకోకుండా పిల్లనిలా గోతిలోకి తోసెయ్యేడమే," వెంకటేశ్వర్లు అడిగాడు కోపంగా.

కాసేపు విచారించారు. తర్వాత తేరుకొని కాఫీ తాగి, సినిమా చూసి వెన్నెట్లో కేరింతాలు కొడ్తూ, సినిమాలో చూసిన రొమాంటిక్ సీను మననంచేస్తూ ఆట్టహాసంతో తిరిగొస్తున్నాడు.

అదే సమయానికి సీతారత్నం - పదిహేడేళ్ళ సీతారత్నం, మూల గదిలో సన్నగా వెలుగుతూన్న దీపం ముందు కూచుని జీవంలేని వదనంతో ఆకాశంలోకి చూస్తూ జీవచ్ఛవంలా పడివుంది.

కొడిగట్టిపోతూన్న వత్తితో కొండెక్కి పోతూన్న దీపం గాలికి రెపరెపలాడింది. *'ఈ తప్పెవరిది?'* అన్నట్లు.

కాసేపట్లో పెద్ద గాలికి దీపం కాస్తా ఆఖరి సారిగా దీనంగా చలించి కొండెక్కిపోయింది.

గది చీకటయిపోయింది. బైట ఎంతో వెన్నెల కాస్తోంది.

*(ఆంధ్రసచిత్ర వారపత్రిక : 7-1-1959)*



# జీవనరాగం

"అవును కాని రాధా! నువ్వింకరావా? రాదల్చుకోలేదా? ఇప్పటి కెన్ని మాట్లయింది చెప్పు నేను రమ్మనడం, నువ్వు మళ్ళా ఆదివారం వస్తున్నానని రాసిన ఉత్తరం, 'సారీ, రాలేకపోతున్నాను, ఏమనుకోకు' అన్న వైర్ ఒకే మాటు నాకు చేరడం. ఒకే మాట చెప్తున్నాను. వారం రోజుల్లో నువ్వు వచ్చి తీరాలి. లేకపోతే నిన్ను రైల్లో పార్సిల్ చేయించి తీసుకొస్తాను.

అసలు నీకీ స్తబ్దత్వం పెళ్ళి చేసుకుంటే పోతుందని నాకో గట్టి నమ్మకం. ఈ సారి నేను గనక మీ వూరు నీ కోసం రావడం తటస్థిస్తే, ఓ చక్కని పిల్లతో సహా వచ్చి, పెళ్ళి కానిచ్చేసి, అక్షింతలు వేసి మరీ వస్తాను. నువ్విలా ఇన్నాళ్లు ఒంటిరిగానే వుండిపోవడం నాకేం సయించడం లేదురా అబ్బాయ్! మా ఊరు రా; లక్షణమైన పిల్లలు లక్షల మీదున్నారు. ఈ వూరొస్తే, ఓ పిల్లనోదాన్ని అంటగటతానని రావడం మానేయకేం? నీ కిష్టమయితేనే.

ఈ సారైనా నా మాట కాదనక, నీకు కోర్టు ఎలాగూ ఈ వేసవి శెలవులో లేదు గనుక, వారం రోజుల్లో వచ్చి తీరాలి. మా ఆవిణ్ణి నువ్వు చూడలేదుకదూ! నువ్వు వస్తే మా శ్రీమతితోపాటు మా ప్రిన్స్ ఆఫ్ వేల్సనీ, రెండో వాణ్ణీ కూడా చూపిస్తాను.

ఎన్నాళ్లయిందిరా నువ్వు కనపడి! మనం యూనివర్సిటీలో వుండగా ఇన్నాళ్ళు విడిగా వుండగలమని ఊహామాత్రంగానైన తోచిందా? ఏదీ! నువ్వు మూడేళ్ళ క్రితం బెజవాడ స్టేషన్లో కనబడ్డావు..... కాశ్మీరు వెళ్తూ. అదైనా ఎంత సేపూ..... ఇంతలో గార్డు పచ్చజెండా వూపడం, నువ్వు 'వేవ్' చేస్తూ ట్రెయిన్‌లో వెళ్ళిపోవడం జరిగిపోయింది.

ట్రెయిన్ అంటే జ్ఞాపకమొచ్చింది. మొన్న మన శర్మ బెజవాడమీదుగా వెళ్తున్నానని లెటర్ రాస్తే స్టేషన్‌కి వెళ్ళాను. వాడు కనిపించలేదు.... కాని మైథిలి కనిపించింది. 'మైథిలి ఎవరూ?' అనుకుంటున్నావుకదూ! నాకు తెలుసు, నువ్వలా అనుకుంటావని. మన క్లాస్‌మేటోయ్ ఆనర్స్‌లో... పెద్ద కళ్ళు, సన్నగా, మెరుస్తూ ఉండేది. మన బ్రహ్మంగాడు 'బంగారు తీగ' అని ఆ రోజుల్లో పేరెట్టాడూ చూడు ఆ అమ్మాయి. మైథిలి

కనిపించిందని రాశాను కదూ.... అంటే నాకు కనిపించలేదు. ఆమే ట్రెయిన్ లోంచి కేకేసింది. ఆశ్చర్యపోతూ 'ఎవరా' అని చూస్తుంటే, చెయ్యి వూపి పిల్చింది, ఫస్టుక్లాస్‌లోంచి. డ్యూమెక్సు బేబీఫుడ్ ఎడ్వర్‌టైజ్‌మెంటులో వుండే బేబీలాటి పిల్లాణ్ణి చూపించింది. ఆ సన్నమంతాపోయి ఎంత పుష్టిగా అయిందోయ్! అసలు నాకోఅనుమానం... ఆమె తన హోదా తెలీచెయ్యడంకోసమే నన్ను పిల్చిందని. వాళ్లాయన గెజిటెడ్ ఆఫీసరులే. లేకపోతే నన్ను పిలుస్తుందా?.... క్లాస్‌మేట్సుగా ఉన్న రోజుల్లో ఆమె ఆరాధకుల్లో నే నొకణ్ణిగా! అయినా నాతో చాలా మెట్టుగా వుండేదిగా మరి.

మన్తో థర్డ్ ఇయర్ చదివి మానేసింది చూడు... మెహరున్నీసా అని-ఆమె ఇప్పుడు డాక్టరుట-శకుంతల నా లాగే లెక్చరర్ చేస్తోందిట.

మర్చిపోయా చెప్పడం. 'ఆయన పేరేమిటండీ? కళ్ళజోడు పెట్టుకొని, ఎప్పుడూ నైట్‌డ్రస్ వేసుకునేవారు. ఆ! రాధాకృష్ణమూర్తిగారు కదూ! ఆయనేం జేస్తున్నారు?' అని కాసేపాగి, 'కథలింకా రాస్తున్నారా?' అనడిగింది మైథిలి.

'అప్పుడప్పుడు రాస్తున్నాడు లెండి. కాని పెళ్ళిజేసుకోలేదింకా' అన్నాను, నిన్ను గురించి అడగని ఇన్‌ఫర్మేషనిస్తూ.

ఆమె ఏదో అనబోయి వూరుకుంది. మాట ఆపడానికి నోరు మూసేయడంతో నిట్టూర్పు గట్టిగా వచ్చింది.

అసలింతకీ అసలు సంగతి దాటేశాను. నువ్వు ఎప్పుడొస్తున్నావ్? నువ్వీసారి రాకపోతే కోర్టులో దావా వేస్తాను బ్రీచ్ ఆఫ్ ట్రస్టు కింది.

నీ కోసం ఎదురుచూసే...

"విశ్వం."

ఉత్తరం చదవటం పూర్తిచేశాను. ఆ నల్లని అక్షరాలని చూస్తోనే ఆలోచనలు వెనక్కిపాకిపోతున్నాయి.

విశ్వానికప్పుడే ఇద్దరు పిల్లలా!

అవును మరి, ఏ నాటి ఆనర్స్-ఆఖరి సంవత్సరంలో పెళ్ళి అయింది వాడికి.

ఏడేళ్లు అవ్వస్తోంది.!

అమ్మ ఈ ఏడేళ్ళ బట్టీ చెప్తోనేవుంది కోడల్ని తెమ్మని. నాన్నగారు పోయిన ఈ రెండు సంవత్సరాలబట్టీ అమ్మ పైకి చెప్పకపోయినా, మరీ ఇదవుతోంది.

ఆలోచనల్లోంచి తేరుకొని, విశ్వం దగ్గరికి ఈసారి తప్పక వెళ్ళాలనుకున్నాను. అమ్మతో చెప్పి శనివారం బయల్దేరాను. బెజవాడ చేరేటప్పటికి ఐదు దాటుతోంది. విశ్వం చెప్పిన ఎడ్రసు చూపుకొని రిక్షా ఎక్కాను.

ఓ సందులోకొచ్చి "ఎక్కడ బాబూ?" అన్నాడు రిక్షావాడు.

రిక్షా దిగాను, బైట ఓ పిల్లడు బొంగరానికి తాడు చుట్టలేక యాతనపడ్తున్నాడు. నన్ను చూడగానే 'చుట్టి పెట్టు' అన్నాడు.

పిల్లాడి అమాయకత్వానికి నవ్వొచ్చింది. చుట్టిచ్చి "విశ్వేశ్వరరావుగారి ఇల్లెక్కడ, కాలేజీ లెక్చరర్" అన్నాను.

"ఆ కొబ్బరిచెట్టున్న డాబా ఇల్లు" అని నేలకేసి కొట్టాడు బొంగరం.

రిక్షా దిగి డాబా ఇంట్లోకెళ్ళాను. మెట్లెక్కి అనుమానంగా లోపల అడుగు పెట్టాను.

ఆవిడెవరో చీరలు బేరం చేస్తోంది. తెల్లగా వుంది... పుష్టిగా. నన్ను చూడగానే లేచి చెరుగు రెండు బుజాలు మీదుగా తీసికొని ఆశ్చర్యంగా చూస్తోంది.

రెండునిముషాలలో చూసి "ఏవిటీ! కిష్టమూర్తే ! ఎన్నాళ్ళకెన్నాళ్టికి" అంది మొహమంతటితో నవ్వుతూ.

నేను తెల్లబోయాను. రిక్షావాడు సామాన్లు తీసికొస్తున్నాడు. నాకు ఏమనాలో తోచలేదు.

"అలా చూస్తావేమిటోయ్? జ్ఞాపకం లేనూ!. మాణిక్యాన్ని. రాజమండ్రీ సుందర్రామయ్యగారు.."

ఛట్టున జ్ఞాపకం వచ్చింది. ఆ మాణిక్యమా? పరికిణీ గోచిపోసికట్టి నాతో గోళీలాడి, నన్ను వానాలప్ప అడించిన మాణిక్యమా?!

అవును! మాణిక్యం, ఆమె చెల్లెలు రాజరాజేశ్వరి పూర్తిగా జ్ఞప్తికొచ్చారు. మా నాన్నగారు రాజమండ్రీలో ఉద్యోగం చేస్తున్నప్పుడు వీళ్ళింట్లో మూడేళ్ళు వున్నాం. నాకప్పుడు పదేళ్లు. మాణిక్యానికి ఎనిమిది. రాజేశ్వరి పెద్ద కళ్ళతో నన్ను చూస్తూ చప్పట్లు కొట్టేది. నాచేత కాగితప్పడవలు చేయించుకొని లక్కపిడతలోంచి 'ఉత్తిత్తి తాయిలం' పెట్టేది ఆ లేత చేతుల్తో. నీపేరేమిటంటే 'లాజలాజేశ్వరి' అనేది సన్నగా. మొదట్నించీ మాణిక్యం చెల్లెలులా కాకుండా భిన్నంగా వుండేది. మాణిక్యం తెలుపు, పసిమి కలిసిన ఛాయలో బొద్దుగా ఉండేది. రాజేశ్వరి కొంచెం తక్కువ తెలుపులో, సన్నగా వుండేది. మాణిక్యం అల్లరి చేస్తూ ఆడుతూ వుంటే చెల్లెలు అరుగు మీద కూచుని బొమ్మల పెళ్ళిళ్ళు చేస్తూండేది.

రిక్షావాడు సామాను పెట్టి నించున్నాడు. మాణిక్యం చీరల అసామికి డబ్బిచ్చి, రాక్షా వాడిని అడిగి అతనికీ డబ్బిచ్చి పంపించేసింది.

"ఇప్పుడేం చేస్తున్నావోయ్? రా, యింట్లోకి రా" అంటూ లోపలకి దారి తీసింది. డ్రాయింగు రూములో కూచోపెట్టి లోపలి కెళ్లింది.

విశ్వం వుండేది ఈ ఇంట్లో కాదన్నమాట. ఈ పక్కిల్లు అయివుంటుంది. అనుకోకుండా ఎన్నాళ్ళకి కలుసుకున్నాను మాణిక్యాన్ని. చిన్నతనంలో ఆడుకున్న ఆ అక్కచెల్లెళ్ళని మళ్లా నేను ఇంటరు పూర్తిచేసి రాజమండ్రీ వెళ్లినపుడు చూశాను... ఐదేళ్ళ తర్వాత. మాణిక్యం నా దగ్గరికి రావడానికి మొదట్లో సిగ్గుపడింది. రాజేశ్వరి మాత్రం వెంటనే వచ్చింది.... పువ్వులువొళ్లో పోసుకుని 'జ్ఞాపకమున్నావా?' అంటే, కాసేపుండి, వాళ్ళక్కకేసిచూస్తూ, పెద్ద కళ్ళు తిప్పుతూ, బియ్యపుగింజల్లాంటి కళ్ళు తెరిచి "ఊ, కిట్టూ" అంది. 'రాజి' నన్ను చిన్నప్పుడు 'కిట్టూ' అనేది, కృష్ణమూర్తి అనలేక. నేనక్కడవున్న కాసేపట్లో తన రిబ్బన్లు, పుస్తకాలు చూపించింది. చిన్నప్పుడు ఆ పిల్లచెప్పే 'రాజూ' ఏడుగురి చేపల కథ' మళ్ళా చెప్పించుకున్నాను.

"కాఫీ తీసుకోవోయ్" మాణిక్యం మాటల్తో తెలివిలో కొచ్చాను.

కప్పు అందుకుంటూ మాణిక్యాన్ని చూశాను. కొద్దిగా పౌడరు రాసుకొచ్చినట్టుంది. జుట్టు కూడ దువ్వుకుంది.

కాఫీ తాగుతుంటే అడిగింది, "మీ నాన్నగారు కులాసాగా వున్నారా? నువ్వు ఏంచేస్తున్నావ్? మా ఇల్లెలా తెలిసింది?" అని.

మా నాన్నగారు పోయారని చెప్పాను. అప్పుడు జ్ఞాపకమొచ్చింది. నేనొచ్చిన పని.

"విశ్వేశ్వరరావని ఇక్కడ ఒక లెక్చరరు వుండాలి.... ఈ పక్క ఇంట్లోనా?" అన్నాను.

"నీకెలా తెలుసు ఆయన?" అంది మాణిక్యం ముంగురులు సవరించుకుంటూ.

"అతను నా స్నేహితుడులే.. అతను రమ్మంటేనే ఈ వూరు వచ్చాను. ఆ పిల్లాణ్ణెవర్నో అడిగితే ఈ ఇల్లు చూపెట్టాడు - బొంగరం అదే హడావిడిలో. పిల్లాడు తప్పు డైరక్టు చేసినా, నిన్ను చూడ్డమైనా, నిన్ను చూడ్డమైన అయింది. ఇంతకీ విశ్వం ఎక్కడుంటున్నాడో?" అన్నాను, ఆఖరిమాట నన్ను నేనే ప్రశ్నించుకుంటూ.

"నేనుండమంటే వుండకూడదా? అయన్ని కలుసుకుందువుగానిల... బజారు వెళ్ళినట్టున్నారు."

"ఈ పక్క వాటాలో వుంటున్నాడా?"

"ఈ వాటాలోనే..." అంది నవ్వుతూ మాణిక్యం.

నాకు మొదట్లో అర్థం కాలేదు. తర్వాత మాణిక్యం ఇంకా నవ్వుతుంటే తెలిసింది. విశ్వం మాణిక్యం భర్తా?

"నమ్మకం లేదేవిటీ?" అంటూ మేకు కున్న ఫోటో తీసి చేతికిచ్చింది.

మెడనిండా దండలతో విశ్వం.....పక్కన బుగ్గన చుక్కతో, కొద్దిగా తలవొంచుకుని మాణిక్యం.

"ఇప్పుడైనా వుంటావా యింట్లో"

మాణిక్యంలో ఏం మార్పు రాలేదు. నాకంటె చిన్నదైనా, చిన్నప్పుడు నా మీద అథార్టీతో మాట్లాడేది. ఇప్పుడూ అదే.. నన్ను వొప్పించే అథార్టీ.

"విశ్వం ఎక్కడి కెళ్ళాడన్నావ్?"

"బజారు కెళ్ళారు. పిల్లాడికి జోళ్లు కొందామని"

"మా విశ్వం పూర్తిగా సంసారంలో మునిగిపోయాడన్నమాట. ఇంకా అలాగే నవ్వుతూ కబుర్లు చెపుతున్నాడా?"

"నువ్వే చూసి చెప్పు" అంది మాణిక్యం.

"నువ్వేమైనా మార్చావేమోనని" అన్నాను కొంచెం హోప్లెస్‌గా ఫీలవుతూ. "మగవాళ్లు అంత సులభంగా మారుతారటోయ్" అంది మాణిక్యం వేదాంతినిలా.

ఇంతలో 'అమ్మే, అమ్మే' అంటూ మూడేళ్ళ కుర్రాడు వచ్చాడు. నన్ను చూసి కళ్లు చిట్లించి చూసి, వెక్కిరించాడు.

"మా రెండోవాడు" అంది మాణిక్యం వాడి తల నిమురుతూ.

"వాళ్ళ నాన్న చేష్టలొచ్చినట్టున్నాయే' అన్నాను వేళాకోళంగా.

నా ముందు నాలుగైదు పత్రికలుంచి, రేడియో ట్యూన్ చేసి చదువుతూ వుండు, ఇప్పుడే వస్తా' అని వంటింట్లోకి వెళ్లింది మాణిక్యం.

రేడియో నించి సన్నగా సంగీతం వినపడుతోంది. వంటింట్లోంచి పోపు ఘాటు [illegible] చేస్తోంది. ఇంతలో బయట బూట్ల చప్పుడైంది. గదిలోంచి పైకొచ్చాను. నన్ను చూసి [illegible]

కౌగలించుకున్నంత పనిచేశాడు. పక్కనున్న పిల్లాడు, ఆరేళ్ళవాడు, నన్ను దూరం నించి చూస్తున్నాడు.

నన్నాలాగే రెక్కపట్టుకొని గదిలోకి తీసికెళ్ళి కుర్చీలో కుదేసి "విశేషాలేవిట్రా?" అని పది మాట్లు అడిగాడు విశ్వం.

"ఏవున్నాయి...." అంటూనే నేను ఏదో చెప్తున్నాను.

"మణీ, మణీ, మా రాధ వచ్చాడు, చూశావా?" అన్నాడు విశ్వం వంటింట్లోకి చూస్తూ.

చేతులు రుమాలుతో తుడుచుకుంటూ మాణిక్యం వచ్చింది.

"మా శ్రీమతోయ్" అని నన్ను పరిచయం చేశాడు విశ్వం.

మాణిక్యం కొంటెగా నమస్కారం చేసి నవ్వుతోంది. ఆ నవ్వు అర్థం కాక తెల్లబోయాడు వాడు.

నేనే చెప్పాను.... మా ఆటలు, చిన్నప్పటి స్నేహం... మొత్తం అంతా.

"మీ రాధే, మా కృష్ణమూర్తి" అంది మాణిక్యం.

వాడు ఆశ్చర్యపడి "మీరిద్దరూ ముందే లాలూచీ అన్నమాట. మా మణికి నీ అండ కూడా దొరికితే ఇక నా సంగతి చెప్పాలీ!"

మృదువుగా భర్తకేసి చూసింది మాణిక్యం. ఆ చూపులలో ఎంతో లాలిత్యంతో కూడిన మాతృత్వముంది. విశ్వం అదృష్టవంతుడనిపించింది. మాణిక్యం తన చుట్టూ వున్న వారిని సుఖపెట్టగలదు.

"ఓ ఫార్సు చెప్పనా రాధా?" అన్నాడు విశ్వం ఉన్నట్టుండి.

"ఏవిటీ?"

"మా పెళ్ళయిన కొత్తలో నువ్వు మమ్మల్ని 'గ్రీట్'చేస్తూ 'రాధ' అన్న సంతకం చేసిన ఉత్తరం పూర్తిగా చూపించకుండా సంతకం చూపించేను.... అప్పుడు చూసుకో, అమ్మాయిగారి మూతి విరుపు. సత్యభామ ఫోజు ఇలాగే వుండేదనిపించిందనుకో నాకు" అని, అవునా? అన్నట్టు భార్య కేసి చూశాడు విశ్వం.

"నాకు తెలుసున్న మాణిక్యం అలా ఎన్నడూ చెయ్యదు" అన్నాను.

మాణిక్యం నిండుగా నవ్వింది.

"నేను మొదటే చెప్పానుగా మీరిద్దరూ లాలూచీ అని. సరేలే! ప్రయాణంలో అలిసిపోయుంటావ్. స్నానం చేసిరా, భోజనం చేద్దాం" అన్నాడు విశ్వం.

స్నానం చేసి పంచ కట్టుకొని జుట్టు దువ్వు కుంటూంటే విశ్వం స్నానానికి వెళ్ళాడు. తల దువ్వుకుంటూ గోడకున్న మాణిక్యం, రాజేశ్వరీ వున్న చిన్ననాటి ఫోటో చూస్తూ నించున్నాను. ఫోటోలో కూడా మాణిక్యం నవ్వుతోంది. రాజేశ్వరి కళ్ళు విశాలంగా తెరిచి అమాయకంగా చూస్తోంది.

"ఏవిటీ ఆ ఫోటో చూసి అంతలా లోచిస్తున్నావ్?" అడిగింది వెనకనించి మాణిక్యం.

"అమాయకంగా చూస్తూ కలలుగంటూన్న 'రాజీ' ఈపాటికి పెరిగి ఎంత పెద్దదయి వుంటుందా? అని ఆలోచిస్తున్నాను" అన్నాను చూపు తిప్పకుండానే.



గట్టిగా నిట్టూర్పు వినపడింది. వెనక్కి తిరిగాను. మాణిక్యం పెదవులు వణుకుతూన్నట్టు అనిపించింది నాకు. నా ఊహేనేమోననిపించింది.



"మన పెద్దవాళ్ళు 'పెరిగిపోవడం' 'పెద్దదయిపోతోంది' అన్న మాటలు ఒకప్పుడు వింత అర్థంలో వాడేవారు... తెలుసు కదూ?" అంది.



నాకేమనాలో తోచక వూరుకున్నాను.

"మా అమ్మమ్మ అనేది... దీపం పెద్దదయి పోతోంది - నూనె పొయ్యమని. దీపం ఆరిపోయిందని అనకూడదని అనేదావిడ" అంది మాణిక్యం.

"అవును! దీపం పెద్దదైపోయిందంటే దీపం ఆరిపోయిందన్నమాట."

"అలాగే మా 'రాజీ' పసుపు, కుంకుమ కూడ పెరిగి పెద్దవయిపోయాయి. అది ఇప్పుడెంత పెద్దదయితే మాత్రమేం?.... దాని జీవితమే ముక్కలయినప్పుడు" అంది మాణిక్యం దూరంగా చూస్తూ.

నాకు నోట మాట రాలేదు. రాజి అమాయకపు హృదయంలోని క్షోభ నేను ఊహించడానికైనా భయపడ్డాను. నాకు కనపడకుండా ఉండాలని మాణిక్యం పక్కకి తిరిగి కళ్ళు వత్తుకొంటోంది. మా ఇద్దరి మధ్య నిశ్శబ్దం. తెలీని ఆందోళనేదో మా హృదయాలనంతా ఆవరింపజేస్తోంది.

"ఎప్పుడైంది ఇదంతా...." అన్నాను మాట పూర్తి చెయ్యకుండానే అర్థమయ్యేట్టు చెప్తూ.

మాణిక్యం నా కేసి తిరిగింది. కళ్ళు కొద్దిగా ఎర్రబడ్డాయి...కనుకొలుకుల్లో నీరు ఇంకా నిలిచి ఉంది.

"మా రాజీ పదహారో ఏట మా అమ్మకి వంటికి నీరు పట్టింది. బతకడేమో అనుకున్నాం అందరం. మా అమ్మ 'రాజి పెళ్లి చూస్తానో, లేదో' అనేది. వెంటనే నాన్న గారు దానికి పెళ్లిచేశారు. పెళ్ళయిన మూణ్ణెలల్లో అతను కలరా వచ్చి పోయాడు. ఈ సంగతి విని మా అమ్మ పోయింది. పెళ్ళినాడు తప్పితే మళ్ళా ఇటూ,

అటూ రాకపోకలు జరగలేదు...ఆ మూణ్ణెల్లల్లో. ఇదంతా జరిగి ఐదేళ్ళు కావస్తోంది."

"ఇప్పుడు రాజి ఎక్కడుంటోంది?" అన్నాను.

"మొదట్లో నాన్నగారి దగ్గరే ఉండేది. దాని స్థితి చూసి నాన్నగారు బెంగతో మరీ అలమటించిపోయేవారు. దాంతో దాన్ని నేనే ఇక్కడికి తీసుకొచ్చేశాను. ఇక్కడే చదువుకుంటోంది. ఇంటరు పాస్ అయి బి.ఏ. మొదటి సంవత్సరం అయింది. సెలవల్లో ఇంటి కెళ్ళిందిలే... నాన్న చూస్తానంటే. ఇవాళో, రేపో రావాలి.... వస్తానని ఉత్తరం రాసింది" అని ఇక మాట్లాడలేక ఊరుకొంది మాణిక్యం. ఓ నిముషం ఆగి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

మాణిక్యం చెల్లెలు గురించి పడుతున్న బాధ ఆమె దాచుదామన్నా దాగలేదు. ఆ మాటలు చెప్తుంటే ఆమె కంఠంలో గాద్గద్యం నన్ను కలవరపరిచింది. మాణిక్యానికి చెల్లెలి మీద చెప్పలేనంత ఆపేక్ష... కానీ ఎప్పుడూ పైకి చెప్పేది కాదు. ఇప్పుడూ అలాగే మాట్లాడింది.

"రావోయ్... భోంచేద్దాం" అన్నాడు విశ్వం తువాలు భుజం మీద వేసుకుంటూ.

భోజనం దగ్గిర కూచున్నానన్న మాటే గాని నా దృష్టి అక్కడ లేదు.

"ఇక్కడ మొహమాట పడుతున్నావేమిటోయ్! అలా ఆలోచిస్తూ నించున్నావేమిటి మణీ, కొంచెం బలవంతం చెయ్యి" అన్నాడు విశ్వం.

"నా దగ్గర దెబ్బలాడి జామికాయలు లాక్కొని తినేవాడు... అతనికి నా దగ్గిర మొమామేవిటి?" అంటూ మాణిక్యం కూర, పచ్చడి నా విస్తట్లో వేసింది.

నా ఆలోచన వాళ్ళకి తెలీకుండేందుకుగాను ఏదో మాట్లాడాలని ప్రయత్నం చేశాను. కాని మాణిక్యం నా 'మూడ్' కనిపెట్టిందేమోనని నా కనుమానం వేసింది.

భోజనం చేసి వక్కపొడి నములుతూ సిగరెట్టు కాలుస్తూ, మా కోసం డాబాలో వేసిన పక్కల మీద కూచుని మాట్లాడుకుంటున్నాం. విశ్వం పాతవి, కొత్తవి ఎన్నో సంగతులు చెబుతున్నాడు. వెన్నెల మందంగా ఉంది. చల్లగా గాలి అప్పుడప్పుడు తగులుతూ మిత్రుడి స్పర్శలా ఆనందింపజేస్తోంది.

"మీ మరదలు 'రాజీ' సంగతి ఘోరం కదూ?" అన్నాను సడెన్‌గా.

"ఆ మరే! అంతా ఖర్మనుకో. మన చేతుల్లో ఏం వుందిరా? ఏది ఎలా జరగాలో అలా జరుగుతుంది...."

వాడి వేదాంతం నాకు చిరాకనిపించింది. ఇరవై ఎనిమిదేళ్ళ విశ్వం ఇలాటి విషయాలలో వేదాంతం మాట్లాడుతున్నాడంటే మన తరంలోనే ఏదో నిస్త్రాణ, స్తబ్దత ఆవరించాయనిపించింది.

విశ్వం పెద్దకొడుకు చేత వాడికొచ్చిన విద్యలు నా ముందు ప్రదర్శింపజేస్తున్నాడు. వాడికప్పుడే పదమూడో ఎక్కం క్షుణ్ణంగా వచ్చునట.

"ఏదీ అప్పజెప్పరా" అన్నాడు.

నక్షత్రాలు చూస్తూ తనలో నవ్వుకుంటూన్న ఆ పిల్లాణ్ణి ఇలాటపుడు ఎక్కాలడగడం నాకు భావ్యమనిపించలేదు.

"ఇప్పుడెందుకులే, రేపు చెపుదువుగానిలే. నక్షత్రాలు బావున్నాయి కదూ?" అన్నాను.

"ఎన్నో! అన్నీ అలా ఎప్పుడూ అక్కడే ఉంటాయా?" అన్నాడు పిల్లాడు మొహమంతా ఆశ్చర్యంతో.

ఇంతలో మాణిక్యం పైకొచ్చింది. చందమామ మబ్బుల మధ్య కదుల్తున్నాడు. రెండో పిల్లాణ్ణి వళ్ళో పడుక్కో పెట్టుకుని "చందమామ రావే, జాబిల్లి రావే" అని పాడుతోంది మాణిక్యం. "జాబిల్లి అంటే ఏమిటమ్మా?" అనడుగుతున్నాడు పెద్దపిల్లాడు.

సిగరెట్టు పెట్టె తీసి ఆలోచిస్తున్నాను.

"కాల్చవోయ్, అభ్యంతరం లేదులే" అంది మాణిక్యం.

విశ్వం ఆఫర్ చేసినా తీసుకోలేదు.

"మనం రోజుకి ఐదే కాల్చాలని మా మణి ఆర్డర్ గా! సిగరెట్ల దగ్గర్నించీ నన్నెంత మార్చేసిందనోయ్ మీ మణి."

నాకు నవ్వొచ్చింది.

"నవ్వుతావేం?" అన్నాడు.

"ఇందాకనే మాణిక్యాన్ని 'మా విశ్వం ఇంకా అలాగే వున్నాడా, నువ్వేమైనా మార్చావా?' అంటే, 'మగవాళ్లు అంత సులభంగా మారరుటోయ్' అంది. నువ్వేమో 'ఎంత మార్చేసింది' అని ముక్కు మీద వేలేసుకుంటూన్నావ్ - అందుకని నవ్వొచ్చింది."

"నీకు తెలీదు కాని రాధా...ఆడవాళ్లు వాళ్ళకి తెలీకుండానే ఎంత మార్చేస్తారనీ - అది మన మంచదికే అనుకో. వాళ్ళ ప్రభావం మన మీద ఎప్పుడూ పనిచేస్తుందనుకో. అది మన వంటికి మంచిదే

సుమీ...లాంగ్‌రన్‌లో. నేనందుకే చెప్తున్నాను - నువ్వు కూడా నిమ్మకి నీరోసినట్టు వుంటావ్.... ఆ పెళ్ళి కాస్త అయిందనిపించుకో. మా మరదలు పిల్ల సావాసంతో నువ్వు ఎంత మారిపోతావో చూడు. అదికాదు బ్రదర్, పెళ్ళికి నీ అభ్యంతరం ఏవిటోయ్?"

"పెళ్లికి నా అభ్యంతరం ఏం లేదులే. నేను చేసుకోనని ప్రతిజ్ఞ తీసుకోలేదు గదా"

"వాదన బాగానే ఉంది కాని కృష్ణమూర్తీ.... మీ అమ్మగారా పెద్దవారయిపోయారు; నువ్వా యింటికంతకీ ఒక్కడవీ.... ఆవిడ కోడలు రావాలనుకోడం భావ్యమే కదా! నీకా చదువుకు చదువూ, ఆస్తికి ఆస్తీ ఉంది. నీకు నచ్చిన పిల్లనే చూసుకోవోయ్" అంది మాణిక్యం.

నేను నవ్వుతూ వూరుకున్నాను, ఏమనకుండాను. నాకు ఆ విషయం మీద మాట్లాడాలని లేదని వాళ్లిద్దరూ గ్రహించినట్టున్నారు... టాపిక్ మార్చి మాట్లాడుతున్నాడు విశ్వం. మాట్లాడుతూనే విశ్వం నిద్రపోయాడు. నాకూ మగతగా ఉంది. మాణిక్యం పక్కగదిలోకి వెళ్ళిపోయింది పిల్లాణ్ణి తీసుకొని.

పొద్దుట లేచేటప్పటికి తెలతెలవారుతోంది. దూరంగా పక్షులరుస్తున్నాయి. కాఫీ తాగి, పదింటికి భోంచేసి పడుక్కొని నిద్ర లేచేటప్పటికి నాలుగవుతోంది.

"అలా క్లబ్బుకి వెళ్లొద్దాం, రావోయ్" అన్నాడు విశ్వం.

ఇద్దరం బయల్దేరి క్లబ్బు కెళ్లాం సాయంత్రం. అక్కడ విశ్వం నలుగురైదుగురు కొత్తవాళ్ళని పరిచయం చేశాడు. అంతా కాలేజీలో లెక్చరర్స్. నాతో అందరూ తలోమాట మాట్లాడి వాళ్ళ గొడవల్లోకి దిగిపోయారు. ఒకాయన సుశీలనే అమ్మాయి మీద రేగిన 'స్కాండల్' గురించి కొత్త సంగతులేవో చెప్తున్నాడు. మరొకాయన " ఆకొట్లో నెంత చవకా?" అంటున్నాడు పక్కాయన్తో. విశ్వం పేకాటలో దిగాడు. నాకు అక్కడ ఏం తోచలేదు. నేనేమిటో అక్కడ చాల ఇరుగ్గా ఫీలయాను.

విశ్వం దగ్గరకెళ్ళి "అలా తిరిగొస్తారా" అన్నాను.

వాడా పేకముక్కలు చూసుకుంటూ "ఏవిటీ ! వెళ్తావా? సరే" అని "రాధా చప్పునొచ్చేయ్ సుమీ'' అని కేక వేశాడు.

రోడ్డుమీది కొచ్చాను. జనం ప్రవాహంలా కదిలిపోతూన్నారు. నీలి చొక్కా వేసుకున్న రైల్వే ఎంప్లాయీ రెండు జడలతో పోతూన్న పిల్లని పోతూ పోతూ చూస్తున్నాడు... చూస్తూ చూస్తూ పోతున్నాడు. ఆకుపచ్చ చీర కట్టుకున్న పచ్చటి పెళ్ళాన్ని తాలూకాఫీసు గుమాస్తా నడిపించుకు తీసుకుపోతున్నాడు. 'కొంచెం పైకి జరగండమ్మా' అంటూన్న జట్కా బండి వాడి వేపు జరుగుతూన్న రెండో పెళ్ళి పెళ్ళాన్ని

చూడలేక, పరిస్థితి కాదనలేక వీధిలోకి మొహమెట్టుకొని అసూయతో చూస్తున్నాడు ఓ తాతగారు. అరటిపండు తొక్క మీద జారి ఒకాయన పడ్డాడు. నలుగురు నవ్వారు. ఇద్దరు 'పాపం' అన్నారు.

ఎదురుగా సినీమా హాలు కనబడింది. టిక్కట్టు కొని లోపలికెళ్ళాను. హాలంతా మల్లెపూల వాసన. ఒకాయన పేపరు చదువుకుంటున్నాడు హాల్లో. 'స్మోకింగ్ ఇన్ ది హాల్ ఈజ్ స్ట్రిక్ట్‌లీ ప్రొహిబిటెడ్' అన్న స్లయిడు వెయ్యగానే ఐదుగురు సిగరెట్లు, ఇద్దరు చుట్టలూ వెలిగించారు.

రాజులు, రాణీలూ, కత్తి యుద్ధాలు, గుర్రపు స్వారీలూ, విలనూ ఉన్న హిందీ సినీమా కదిలి పోతోంది. డ్యూయట్లు పాడడం మినహా ఇంకేం చాతగాని ఆ హీరో కంటే ఆ విలన్ నచ్చాడు నాకు. ఆ విలన్‌లో అసూయైనా వుంది. ఈ హీరోలో 'నిన్ను ప్రేమించాను మొర్రో' అని హీరోయిన్‌తో అనడం తప్పితే మరో గుణం ఏం లేదు. గుర్రాలు పరిగెడుతున్నప్పుడల్లా ఈలలు కురిసిపోతున్నాయ్. ప్రియుడు దగ్గరలేకపోయేటప్పటికి తోటలో గంతులేస్తూ, హీరోయిన్ పాడుతోంది మోర పైకెత్తి...లతా కంఠంతో. పాట అయిపోయే సమయానికి విలన్ వెనక నుంచి కథానాయిక కళ్ళు మూశాడు. నాయిక, హీరో అనుకొని మొహం చూడకుండానే ఇటు తిరిగి అతని హృదయంపై తల ఆన్చి చిలకపలుకులు పలుకుతోంది. ఇంతలో హీరో వచ్చి అది చూసి ముక్కు కోణాలెగరేస్తూ తిరిగిపోతున్నాడు.

సినీమా నాకు తలనొప్పి ప్రసాదించింది. ఇంటర్వల్‌లో పైకి వచ్చేశాను. మెల్లిగా నడుచుకుంటూ ఇంటికెళ్ళాను. హాల్లో విశ్వం రెండో పిల్లాడు నా లాల్చీ మీద సిరాబుడ్డిలోంచి సిరా పోసి తాపీగా అలుకుతున్నాడు. నేను చూస్తూ నించొన్నాను.

పక్కగదిలోంచి సన్నని కూనిరాగం వినిపిస్తోంది. క్రమంగా స్వరం పెద్దదై ఇల్లంతా అలుముకుంటోంది. ఆ పాటలో సంగీతపు సొంపు లేదు... కాని వినే వాళ్ళ హృదయాల్లోకి సూటిగా దూసుకుపోతోంది. ఏదో లోకాల అంచులకు సైతం 'ఎప్పీల్' చేసే లాలిత్యం, వేదన, జాలి మేళవించి నన్ను కదిలించేస్తోంది. మాణిక్యం ఎంత బాగా పాడుతుంది అనిపించింది.

ఇంతలో కుర్రాడు నన్ను చూసినట్టున్నాడు... భయమేసి ఏడుపు మొదలెట్టాడు. గదిలోంచి 'ఏం బాబూ, వస్తున్నా' అని వినిపించింది.

"మీవాడు చేసేపని చూశావా మాణిక్యం?" అంటూ తల ఎత్తి ఎదురుగా నించున్న మూర్తీభవించిన సౌందర్యాన్ని చూస్తూ మ్రాన్పడిపోయాను. తెల్లని చీరలో, నున్నని వంటితో మెరుస్తూన్న ఈమె మాణిక్యం కాదు. నన్ను చూసి ఆమె కూడా నిలబడిపోయింది. ఆమె పెద్ద కళ్ళల్లో పాపలు పింతగా, దీనంగా చలిస్తున్నాయ్. ఆమె నుదురు ఎత్తుగా ఉండి వెలిగిపోతోంది.

"ఆనవాలు పట్టలేదూ రాజీ?... మన కృష్ణమూర్తి" అంది మాణిక్యం వెనకనించి వచ్చి.

ఆమె కళ్ళలో జ్ఞాపకం వచ్చిందన్నట్టుగా మెరుపు మెరిసింది. సన్నగా, పెదవులు తెరవకుండా నవ్వింది.

"రాజి సాయంత్రం వచ్చిందోయ్" అంది మాణిక్యం.

"మీ నాన్నగారు కులాసాగా ఉన్నారా?" అన్నాను ఆమెను ఇంకెలా పలకరించాలో తెలీక.

"ఊ" అంది రాజి మెల్లిగా.

"విశ్వం రాలేదూ?" అన్నాను మాణిక్యం వేపు తిరిగి.

"వచ్చారు...స్నానం చేస్తున్నారు."

భోజనం దగ్గర కూచున్నంత సేపూ గదిలోంచి సన్నగా, ఏదో లోకాల్లోకి ఎత్తేస్తూ, హృదయాన్ని కదిల్చి జాలిలో నింపే మృదువైన కూనిరాగం వినిపిస్తూనే ఉంది. ఆ రాగంలో తీవ్రత లేకపోయినా అంతరాంతరాలలోకి దూసుకుపోయే శక్తి ఉంది.

" మా రాజికి తనలో తను పాడుకోడం సరదా" అంది మాణిక్యం వడ్డిస్తూ.

భోజనం చేసి డాబా మీదికెళ్ళాం. పని పూర్తి చేసుకొని మాణిక్యం వచ్చింది.

"రాజి విశేషాలేం చెప్పలేదేం? అంతా కులాసాగా ఉన్నారా రాజమండ్రిలో" అన్నాడు విశ్వం.

"రాజీ" అని కేకేసింది మాణిక్యం.

రాజి పైకొచ్చింది. చందమామ మీద మబ్బులు తొలిగి వెన్నె నిండుగా డాబా నిండా పరుచుకొంది. రాజి, మాణిక్యం పక్కన కూచుని ఆకసం కేసి చూస్తోంది. వెన్నెల కాంతి ఆమె నుదుటిని మరింత వెలిగిస్తోంది. కుంకుమలేని ఆమె నుదురు పైకి చూస్తూ ఆకసాన్ని జవాబులేని ప్రశ్న ఏదో అడుగుతున్నట్టుగా ఉంది. తెల్లని చీర, తెల్లని జాకెట్టు, ఆ వెన్నెట్లో మరింత కొట్టొచ్చినట్టుగా ఉన్నాయి.

"మీ నాన్నగారు కులాసాగా ఉన్నారా?" అన్నాడు విశ్వం.

తలవూపింది రాజి 'అవునన్నట్టు!'

"మర్చిపోయాను! మీ చిన్ననాటి స్నేహితుణ్ణి తీసుకొచ్చాను - చూశావా?"

మెత్తగా నవ్వింది రాజేశ్వరి.

"ఇంకా విశేషాలేవిటీ?"

రాజేశ్వరి రాజమండ్రీ విశేషాలు చెప్తోంది. నాకు నిద్ర పట్టేసింది.

పొద్దుట లేచేటప్పటికి బాగా తెల్లారిపోయింది. లేచి మొహం కడుక్కొని, కాఫీ తాగి, అమ్మకి ఉత్తరం రాశాను... ఇలా అనుకోకుండా మాణిక్యాన్ని కలుసుకున్నానని. ఆవాళ మాణిక్యం పులిహోరల్తో మస్తుగా భోజనం పెట్టింది. వళ్లు తెలీని నిద్ర పట్టేసింది. లేచి బిస్కట్లు తిని, కాఫీ తాగి డ్రాయింగు రూములోకెళ్ళాను. అక్కడ విశ్వం కాకుండా మరొకాయన కూడా ఉన్నాడు. ముప్ఫై ఏళ్ళు ఉండొచ్చు. ఆయన నన్ను చూడగానే 'నమస్కారమండీ' అన్నాడు. ఆయన్ని ఎక్కడో చూసినట్టుంది... కాని గుర్తు రాలేదు. ఆయన కళ్ళు చిట్లించడం చూసిం తర్వాత జ్ఞాపకమొచ్చింది.... నిన్న క్లబ్బులో మీట్ అయిన మూర్తి అని. ఆయన నాతో చాల మర్యాదగా మాట్లాడుతున్నాడు.

"మా యింటికోసారి మీరు విశ్వంగారితో రావాలి" అన్నాడు మూర్తి ఓ అరగంట తర్వాత.

"అలాగే" అంటూ లేచాడు విశ్వం.

ఓ పెద్ద మేడలోకి తీసికెళ్ళాడు మూర్తి. మమ్మల్ని గదిలో కూచోపెట్టి తొందరగా లోపలికెళ్ళి వాళ్ళ నాన్నగారిని తీసికొచ్చి పరిచయం చేశాడు. ఆ పెద్దాయన నన్ను 'తమరేం చేస్తున్నారు?' అన్న ప్రశ్నతో మొదలెట్టి అవీ, ఇవీ అడుగుతున్నాడు. అంత పెద్దాయన నన్ను 'తమరు' అని సంబోధించడం నాకేమిటోలా అనిపించింది.

మూర్తి రేడియో ట్యూన్ చేస్తున్నాడు.

"మొన్ననే రేడియో మార్చేస్తానన్నావ్? ఇది కొత్తదా?" అన్నాడాయన కొడుకుతో.

"మరే, ఈ పెట్టి మొన్ననే తెప్పించానండీ... ఏడు వందల పై చిలుకు" అన్నాడు మూర్తి విశ్వంకేసి చూస్తూ.

"మావాడు పాతవన్నీ తీసేసి కొత్తవి కావాలంటాడండి. అలా అనే ఐదేళ్ళబట్టీ ఉన్న కారు అమ్మేశాడు. కొత్తది బేరం చేస్తున్నానన్నావ్, ఏమైందిరా?" అంటున్నాడు పెద్దాయన.

కాసేపుండి "కాస్త కాఫీ తీసుకుందురు గాని లోపలకి రండి" అని నాకేసి చూస్తూ ఆహ్వానించాడు.

నాకు తాగాలని లేదు. కాని 'కాదంటే' బావుండదని లోపలికెళ్ళాను.

టేబిల్ మీద సరంజామా చూసి ఆశ్చర్య పోయాను... ఏదో పెద్ద పార్టీ ఇస్తున్నట్టుగా ఎరేంజ్ చేశారు.

నేను కాఫీ మాత్రం తాగాను... కాఫీ బావుంది. నన్ను కాస్త ఏమైనా తినమని వాళ్ళు పెద్ద బలవంతం. నాకు చిరాకేసి "నాకు కావలిస్తే నేను తీసుకుంటాలెండి" అనేదాకా వాళ్ళు ఆ మర్యాద ఆపలేదు.

మళ్ళా డ్రాయింగు రూంలోకొచ్చి కూచున్నాం. పెద్దాయన ఆ ఫలాన సోఫా సెట్టు ఎప్పుడు తెప్పించాడో చెపుతున్నాడు విశ్వంతో. తమకున్న ఐశ్వర్యాన్ని అలా చెప్పుకోడం ఆయనకు సరదా యేమో ననిపించింది.

ఇంతో ఆయన "రామ్మా సిగ్గెందుకు... అంతా మనవాళ్ళే" అంటూ ఓ పిల్లని లోపలికి ఆహ్వానించాడు? 'మా అమ్మాయి కాలేజీలో చదువుతోం"దని పరిచయం చేవాడు. ఆ పిల్ల బొద్దుగా, పచ్చగా ఉంది.

నేను నమస్కారం చేశాను.

ఆ అమ్మాయి కుర్చీలో కూచుంటూ సిగ్గు పడింది. కళ్ళు తిప్పుతూ, తల కొద్దిగా వంచి కూర్చుంది.

ఏం మాట్లాడకపోతే బావుండదని "ఏం చదువుతున్నారు?" అన్నాను ఆ అమ్మాయి నుద్దేశించి.

ఆ పిల్ల తండ్రి కేసోసారి చూసి "ఇంటరు సీనియర్" అంది.

"మా అమ్మాయికి వీణ చెప్పించుదామని వుందండీ. గాత్రం కూడా బావుంటుంది లెండి. ఏది! ఓ పాట పాడమ్మా. మీకు శాస్త్రీయం ఇష్టమా?.... లేక సినిమా సంగీతం కావాలంటే అదే పాడుతుంది" అన్నాడాయన నాకేసి చూస్తూ.

నా చిరాకు చివరి దశకు వచ్చేసింది. ఆ పిల్ల అంత సిగ్గుపడుతూంటే ఈయన పాట పాడమంటాడేవిటీ! ఒకవేళ అన్నా, నా ఇష్టమంటాడేవిటీ?....మధ్య నేనేదో తీర్పు చెప్పేవాడిలా! అసలు నా కక్కడనించి పోవాలనిపించింది. కాని సభ్యత పాటించి "నాకు దేనిమీదా ప్రత్యేకమైన ఇష్టం లేదు" అన్నాను నా అయిష్టాన్ని ధ్వనింపజేస్తూ.

ఆ అమ్మాయి ఏదో పాడుతోంది. నేను టేబిల్ మీదున్న పేపరు చదువుతూ కూచున్నాను. కాసేపట్లో ఆ పిల్ల లోపలికెళ్ళిపోయింది. విశ్వం, మూర్తి ఏదో పనుండి పక్క గదిలోకి వెళ్ళారు.

పెద్దాయన కాసేపు పిచ్చాపాటి మాట్లాడి "మీ గోత్రమేమిటి బాబూ" అన్నాడు.

ఇందాకటినించీ జరుగుతూన్న తతంగానికంతటికీ అర్థం ఇప్పుడు నాకు పూర్తిగా స్ఫురించింది. నాకు చిరాకు పుట్టింది.

"మా విశ్వం అన్నీ చెపుతాడులెండి," అని విసురుగా విశ్వం దగ్గరకెళ్ళి "విశ్వం! నువ్వు వస్తావా

ఇప్పుడు? నాకు పనుంది... వస్తే, రా" అన్నాను.

"నేనూ వచ్చేస్తున్నా" అని విశ్వం వచ్చేసాడు.

"తమర్ని తర్వాత కలుసుకుంటా"నని పెద్దాయన విశ్వంతో ఏదో చెప్తున్నా వినిపించుకోకుండా వీధిలోకి వచ్చేశాను. పక్కన విశ్వం నడుస్తున్నాడు. రెండు నిముషాలు ఎవ్వరం మాట్లాడేదు. నాకు విశ్వం మీద అణుచుకోలేనంత కోపంగా ఉంది.

"నీ వుద్దేశమేవిట్రా?" అన్నాను కోపంగా.

"ప్రస్తుతం క్లబ్బుకెళ్ళి, వెళ్తే పిక్చరు కెళ్లామని, నీ వుద్దేశమేవిటి" అన్నాడు విశ్వం.

"ఇదిగో, నువ్వు అతి తెలివిగా మాట్లాడకు. నాతో చెప్పా, పెట్టాకుండానే నాకీ పెళ్ళిచూపులు సిద్ధం చెయ్యడంలో నీ ఉద్దేశమేవిటీ అని అడుగుతున్నాను."

"అదా! నాకు మాత్రమేం తెలుసురా. రమ్మంటే నీలాగే నేనూ వెళ్ళాను."

వాడి మాట మీద నాకు నమ్మకం లేకపోయింది. ఇంకేమైనా అంటే తొందరపడతానేమోనని, "నేనలా వెళ్ళొస్తాలే. రాత్రి వచ్చేటప్పటికి కొంచెం ఆలస్యమవుతుంది... నా కోసం ఎవ్వరూ వెయిట్ చెయ్యద్దు – భోంచేసెయ్యండి" అన్నాను ముందుకడుగేస్తూ.

వాడు తెల్లబోయాడు. పరిస్థితి చెయ్యి దాటిపోయిందని గ్రహించినట్టున్నాడు : "తొందరగా వచ్చేయ్ సుమీ" అని మాత్రం అన్నాడు.

నేను ఒక్కణ్ణే కృష్ణ ఒడ్డుకి పోయాను. తిరిగి వచ్చేటప్పటికి పది దాటుతోంది. మాణిక్యం తలుపు తీసింది. ఏం మాట్లాడకుండా డాబా మీదికి పోయాను. రాజేశ్వరి ఒక్కతే కూచుని శరత్ 'శేష ప్రశ్న' చదువుకుంటోంది. నన్ను చూసి పుస్తకం మూసింది.

ఇంతలో మాణిక్యం, వెనకాల విశ్వం వచ్చారు.

"భోంచేద్దువుగాని లేవోయ్" అంది మాణిక్యం.

"నేను మిమ్మల్ని తినెయ్యమని చెప్పానే విశ్వంతో..... నేనిప్పుడేం తినను."

"కొద్దిగానే తినవోయ్... నీకు తోచినంతేలే."

"నాకేం అక్కరలేదు మాణిక్యం! అసలు మా వాడు చేసిన పనితో పూర్తిగా కడుపు నిండిపోయిందిలే'

"నువ్వు కొద్దిగా మజ్జిగా అన్నం తిను... ఆ ఫోర్సు తగ్గుతుంది" అని మెల్లిగా అంటున్నాడు విశ్వం.

"ఏం చేశారేవిటీ?" అంది మాణిక్యం

"నీతో ఏం చెప్పలేదా విశ్వం?"

"ఏదో కొద్దిగా చెప్పేర్లే..."

"నువ్వే చెప్పు మాణిక్యం! వీడేదో రమ్మంటే బాగుండదని పోయావా... ఆయనక్కడ వాళ్ళ రేడియో, కొనబోతూన్న కారు గురించి ప్రస్తావించి పెద్ద పార్టీలా చేసి, పిల్లని చూపించి, 'మీ గోత్రమేమిటీ?' అంటాడా కాసేపు పోయాక? నా కలాటివి ఇష్టలేదని విశ్వానికి తెలుసు గదా... వీడైనా పోనీ ముందుగా నాకు చెప్పొద్దూ?'

"పూర్తిగా ఈయనకూ తెలీదుటోయ్. మూర్తిగారు మాత్రం ఉద్దేశముందని చెప్పారుట. కాని పిల్లనిలా చూపెట్టేస్తారని ఈయనా అనుకోలేదట," అంది మాణిక్యం.

"నిజమేనా?" అన్నట్టు విశ్వం కేసి చూశాను.

"నువ్వా సంగతి నన్ను చెప్పనిస్తేనా?... రోడ్డు మీది నీ ధూకుడు చూసి జనం కూడా డంగైపోతూంటే నేనేమనను?" అన్నాడు విశ్వం.

నాకు విశ్వం మీద కోపం మెల్లి మెల్లిగా దిగజారిపోయింది.

"అయినా కాని రాధా... నీకు ముందుగా వాళ్ళు చెప్పలేదే అనుకో. పోన్లే, కాసేపు అందమైన పిల్లని చూడ్డానికేంరా? దాంతో పెళ్ళయిపోలేదు గదా? ఆ అమ్మాయేమో అప్పుడే పెళ్ళయినట్టు ఏక సిగ్గూ, నువ్వేమో నీకేం సంబంధం లేనట్టు పేపరులో తల దూర్చుకూర్చున్నావ్," అన్నాడు విశ్వం, మామూలు ధోరణిలో పడుతూ.

"అది కాదురా విశ్వం! మనం వెళ్ళడం 'సోషల్ కాల్' లా వుండాలీ? వాళ్ళు నాజూకు పద్ధతిలో పిల్లని చూపించడమా?.... ఎందుకీ ముసుగులో గుద్దులాట? అక్కడికి ఆ పిల్ల రావడం ఏదో యధాలాపం అన్నట్లు పైకి కనిపించాలా? పైగా అంత సిగ్గేమిటోయ్ ఆ పిల్లకి.... చదువుకుంటోంది గూడాను."

"అదేనోయ్ చెప్పేది. వాళ్లా సంబంధం సెటిలయిందనుకుంటున్నారు... కట్నం మాంఛి బరువుగా ఇస్తారు గాబట్టి. ఇదిగో రాధా, ఆ లాంఛనాలేవిటో ఇస్తామని మూర్తి చెప్పేడు గాని, కాస్త నన్ను తోడు పెళ్ళికొడుకులా రెకమండు చేద్దూ. సందులో సందు నా క్కూడా ఏదయినా దక్కుతుంది" అన్నాడు విశ్వం నవ్వుతూ.

నాకూ నవ్వొచ్చింది. రాజేశ్వరి పక్కకి తిరిగి నవ్వుకొంటోంది.

విశ్వం మళ్ళా మొదలెట్టాడు "ఇదిగో అబ్బాయ్, నే చెప్తున్నది విను... పిల్లా రంభలా వుంటుంది... అలా చూడకురోయ్, ఆ మాట నేనన్నది కాదు సుమీ - ఆ ముసిలాయన వాళ్ళమ్మాయి గురించి చెప్తూ అన్నాడు. రంభ ఎలా ఉంటుందో మనం చూడకపోవడం చేత, ఇలా ఉండివుంటుందని ఆయనన్నమాట నీకు సరఫరా చేశానంతే. మన సాంప్రదాయం ప్రకారం పిల్లని చూపించారు. నువ్వేదో కాస్త చప్పున 'ఊ' అంటే, నీతో పాటు, పిల్లలు గలవాణ్ణి నేను కూడా నాలుగు రాళ్ళు వెనకేసుకోడానికి వీలవుతుంది. ఏమంటావ్?"

నేనా సంబంధానికి ఒప్పుకోనని తెలిసింతర్వాత యిలా వేళాకోళంలోకి దిగాడు విశ్వం.

"మన సాంప్రదాయం ప్రకారం పిల్లని తివాసీ మీద కూచోబెట్టి, మోతాదుగా సిగ్గు పడనిచ్చి, అవసరమైన పాట పాడించడం జరిగితే, నా కింత వెగటు కలగకపోను. సాంప్రదాయాన్ని నాజూకుతో ముడెట్టి, మనల్ని అన్ని పక్కలనించీ ఉచ్చులో బిగించాలని వాళ్ళు చూపిన ప్రజ్ఞే నాకు విముఖత్వం కలిగించింది" అన్నాను.

"పిల్ల బాగానే వుంటుందటగదోయ్! ఏమే రాజీ, మీ కాలేజీలోనే చదువుతోంది గదూ, నీకు తెలియదూ?" అంది మాణిక్యం.

"ఆ అమ్మాయికేం?... చాలా తెలివైందీ, మంచిదీ కూడాను. చురుగ్గా, చక్కగా ఉంటుంది", అంది రాజేశ్వరి.

"అయితే ఇంకేం మీ అమ్మగారికి ఇక్కడ మీ అబ్బాయికి సంబంధం కుదిరిందని రాసేస్తానోయ్'" అని మాణిక్యం వేళాకోళం పట్టించింది.

ఇలాగ కులాసాగా ఓ అరగంట కాలం గడచిపోయింది.

"ఇంక భోజనానికి లేవోయ్" అంది మాణిక్యం.

"ఇన్నిమాట్లు చెప్పాలా మాణిక్యం? నాకు తినాలని లేదు. నిజం"

మాణిక్యం కిందకెళ్ళి పెద్ద వెండి గ్లాసుతో మజ్జిగ తీసికొచ్చింది, ఇదైనా తాగమని.

చల్లగా మజ్జిగ తాగి పడుకున్నాను. నిద్ర ఎప్పుడు పట్టిందో తెలీదు... లేచేటప్పటికి మనసు ప్రశాంతంగా ఉంది. ఇలాగే పది, పదిహేను రోజులు కబుర్లతో సినిమాలతో, హాయిగా, సరదాగా గడిచిపోయాయి. ఈ లోపున నేనోసారి మా మేనమామగారింటికి గుడివాడ వెళ్ళి, రెండు రోజులుండి తిరిగి వచ్చేశాను..నేనొచ్చేటప్పటికి మాణిక్యం తండ్రి సుందరరామయ్యగారు వచ్చారు కోర్టు పని మీద. ఆయన ఎప్పటిలాగే నాతో ఆప్యాయంగా మాట్లాడారు. కొద్దిరోజుల్లో వచ్చేస్తానని అమ్మకి ఉత్తరం రాశాను.

"ఎల్లుండి నే వెళ్తా(నా" అన్నాను విశ్వంతో ఓ రోజు.

"ఎక్కడికి? సరే... నువ్వెళ్లితే మళ్ళీ కంటికి కనిపిస్తావ్? నీకు ముంచుకుపోయే పనులేవిటోయ్? వెళ్లొచ్చులే" అని వాడు తేల్చేశాడు.

"వెళ్లాలిరా? అమ్మ ఒక్కతే ఉంది."

"పోనీ ఆవిణ్ణి కూడా ఇక్కడికి తీసుకొద్దాంలే. ఏమైనా నువ్వెళ్ళడానికి వీల్లేదు."

వెళ్ళక తీరదని చెప్పాను.

వాడు చాలా ఫీలయినట్టు కనిపించాడు!

"నీకింకా నా మీద కోపం తగ్గినట్టు లేదే! ఆ పిల్ల ఇంటికెళ్ళడం తప్పే...లెంపలేసుకుంటున్నాను, సరేనా! నీ ఇష్టప్రకారం నీకు ముందుగా తెలిసిన పిల్లనే చేసుకో. కాని ఇప్పుడు మాత్రం వెళ్ళొద్దు."

"ఛ,ఛ ! అదేవిట్రా విశ్వం!... నీమీద నాకు కోపమేవిటీ?"

వాణ్ణి నమ్మించి ఆదివారం ప్రయాణానికి వప్పించేటప్పటికి నాకు అరగంట పట్టింది.

ఆదివారం పొద్దుట బట్టలు సద్దుకున్నాను... సాయంత్రం ప్రయాణానికి.

గది బయట ఎవరో నడుస్తూన్నట్టు అనిపించింది. ఇంతలో మాణిక్యం వచ్చింది గదిలోకి.

"నేనివాళ సాయంత్రం వెళ్తున్నాను మాణిక్యం" అన్నాను.

"అవున్టగా! ఆయన చెప్పారు నిన్న. కొన్నాళ్ళు వుండగూడదటోయ్ సరదాగా?" అంది మాణిక్యం.

"అమ్మ ఒక్కతే ఉంది మాణిక్యం...లేకపోతే ఉండడానికేం?"

మాణిక్యం ఏదో చెప్దామనుకొని మానేసింది. ఏదో ఆలోచిస్తున్నట్టుగా ఉంది. చివరికి చెప్పడం మొదలెట్టింది.

"మీ అమ్మగారు నాకు ఉంత్తరం రాశారు మొన్న... నువ్వు మమ్మల్ని ఇలా కలుసుకున్నానని రాశావుట గదూ! ఆవిడ ఆప్యాయత ఉత్తరంలో గూడా నిండుగా ఉంది" అని ఒక్క క్షణం ఆగి, "నువ్వు పెళ్ళి చేసుకోవోయ్ కృష్ణమూర్తీ.... అంతకంటే మీ అమ్మగారికి సంతోష కారణం మరొటుండదు. నేను నీకు చెప్పేటంతటిదాన్ని కాదనుకో! మీ అమ్మగారు ఉత్తరంలో ఏం బాధగా రాయపోయినా కోడలి కోసం వెయ్యి కళ్ళతో చూస్తున్నట్టు ఉత్తరమంతా ధ్వనించింది" అంది.

నేనాలోచిస్తూ వూరుకున్నాను.

"నేను ఊరికో అన్నానోయ్, మరోలా అనుకోకు. మీ అమ్మగారు ఉత్తరంలో ఏం రాయకపోయినా, నాకా ఉత్తరం చూసిం తర్వాత ఈ మాటలు చెప్పాలనిపించి చెప్పాను. ఆవిడ లెటర్‌లో నీ పెళ్ళి గురించి డైరెక్ట్‌గా ఏం రాయలేదనుకో! ఆవిణ్ణి సంతోష పెట్టడం పిల్లలమైన మన బాధ్యత గదూ? నిజం చెప్పొద్దూ... నువ్వు ఓ పిల్లతో కాపరం చేస్తుంటే నాకూ చూడాలని వుందోయ్" అంది మాణిక్యం నవ్వుతూ.

"ఆ సంగతి మా అమ్మకి చెప్పడానికే మా వూరు వెళ్తూంట" అన్నాను మాణిక్యం కేసి చూస్తూ.

"ఏవిటీ! నిజమే? భలేవాడివోయ్... నా దగ్గర కూడా అంత గుట్టే? ఏ వూరు సంబంధమేమిటీ? మొన్న గుడివాడ వెళ్లింది ఇందుకేనన్నమాట. మాకు తెలీకూడదా ఏవిటీ?" అంది ముఖమంతా చిరునవ్వులు చిమ్ముతూ మాణిక్యం.

నాకు ఏం చెప్పాలో తెలీక ఏమనలేదు.

"నా దగ్గర కూడ సిగ్గేమిటోయ్ పెళ్ళికొడుకా" అంది మాణిక్యం.

"నీ దగ్గర నాకు సిగ్గు కాదు మాణిక్యం!నువ్వంటే నాకెంతో గౌరవం" అన్న మాటలు నేనెలాచెప్పను మాణిక్యంతో?

దూరంగా ఎక్కడ నుంచో రాజేశ్వరి పాడుకుంటోంది. ఆ పాటలో అదే దీనత్వం ... అదే జాలిగొలిపే పిలుపు.

మాణిక్యం కళ్ళల్లోకి నిండుగా చూస్తూ చెప్పేశాను.

"రాజీని ఈ నాటినుండీ నుదుట కుంకుమ అలంకరించుకోమని చెప్పు. నేనీ నాటి వరకూ ఎవ్వరినీ ఆజ్ఞాపించలేదు... ఈనాడు రాజీని ఆజ్ఞాపిస్తున్నాను - ఈ విషయంలో అనుమానాలు, ఆచారాలు అనవసరమని, రాజి ఇష్టం కూడా కనుక్కో."

మాణిక్యం వదనం ఆశ్చర్యంతో నిండి క్రమంగా చెప్పలేని కృతజ్ఞతా భావంతోనూ, సంతోషంతోనూ నిండిపోయింది. ఆమె ఆ సంతోషాన్ని మాటల్లో వ్యక్తపరచలేకపోతోంది. ఆ ఆనందంలో ఆమె వదనమంతా ప్రకాశించి కళ్ళల్లో నీరు నిలిచింది.

"కనుక్కో మాణిక్యం, నా మాటగా చెప్పి కనుక్కో."

మాణిక్యం తేరుకుంది. రాజేశ్వరి గదిలోకి వెళ్ళింది.

నాకు మనసులో ఏ ఆలోచనా లేదు. ప్రశాంతంగా ఉంది. నిముషాలు గడిచిపోతున్నాయి. అరగంట పైన దాటింది. బట్టలు సర్దడం అయిపోవస్తోంది.

గది గుమ్మం దగ్గర గాజులు ధ్వనించాయి. వెనక్కి తిరిగాను.

నాకు మొదటగా కనబడింది అసలే ఎత్తయిన రాజి నుదుట ఉజ్వలంగా ప్రకాశిస్తున్న కుంకుమ. పచ్చని ఆమె నొసలు కుంకుమ పొందుతో ఎనలేని సౌందర్యంతో వెలిగిపోతోంది. నా ఆశయం సఫలమైంది. ఇన్నాళ్ళ నా కోరిక ఫలించింది. పెరిగి పెద్దదైపోయిన నా రాజి పసుపు, కుంకుమ తిరిగి లభించాయి. పసుప్పచ్చని చీర ఆమె శరీరపు రంగు ముందు సిగ్గుపడుతోంది.

"రాజీ...." ఆమె దగ్గరగా వెళ్లాను.

ఆమె వదనాన్ని కాంతివంతం చేస్తూన్న ఆ కుంకుమ నెందుకో తాకి సరిదిద్దాలనిపించింది. చేతులు ఆమె వదనాన్ని సమీపించాయి.

ఒకే ఒక చూపు చూసింది రాజేశ్వరి. ఆ చూపు నేను నిర్వచించలేను. ఆ చూపులో నిండిన కృతజ్ఞత, ఆశ, ఆనందం నన్ను కదిల్చివేశాయి.

నా చేతుల్లోంచి ముఖాన్ని అతి సున్నితంగా, సహజంగా, దూరంగా తీసికొని చేతుల్లో మొహం దాచుకొని, హంసలా తేలిపోతూ రాజి ఆ గదిలోంచి [illegible]రిపోయింది. ఆమె చేతుల్లో మొహం దాచుకుంటూంటే ఆ గాజులు గలగల మన్నాయి.... జీవితానికి అర్థ[illegible]లుకుతూన్నట్టు.

రాజేశ్వరి కంఠం ఆమె గదిలోంచి వినిపిస్తోం[illegible] ఆమె రాగం ఈసారి నిండైన శృతిలో పలుకుతోంది. దానిలో మునుపటి అపశ్రుతి, వేదన, దీనత్వం లేవు. గలగల ప్రవహిస్తూ సంతోషంతో గంతులేస్తూ, పరిగెడుతూన్న నదీజలాల శబ్దంలా, ఆకసపు టంచులకు తగిలే ఉద్వేగంతో, నిండైన శ్రుతితో ధ్వనిస్తోంది.

*(ఆంధ్ర - వారపత్రిక : 12-11-1958)*



# అనుతాపం - అనురాగం

అనూరాధ డాబా చివరకొచ్చి స్తంభంపై చేయాన్చి వీధిలోకి చూసింది. స్తంభానికి అల్లుకొని పై కెగబాకుతున్న మాధవీలత చేతికి తగిలింది.

కింద గడియారం గంటలు కొడుతోంది. లెక్కపెట్టోంది అనూరాధ - ఒకటీ, రెండూ... ఎనిమిది.

అబ్బ! ఎనిమిదైందన్న మాట! 'ఈయనింకా రాలేదెంచేతో?' అనుకొంది.

పిక్చరు కెళ్ళారేమో? మంచి వేవీ లేవన్నారుగా! అంతకంటె రేడియో ఆన్ చేసి కూచుంటే మంచి పాటలొస్తాయన్నారుగా. ఎక్కడ కెళ్ళేరు చెప్మా!

అతనికి పాటలంటే ఇష్టం.... లలిత సంగీతం మరీను.

తనకి శాస్త్రీయ సంగీతమంటే మక్కువ. చిన్నప్పటి సాధకం మూలాన్నేమో!

ఇప్పుడా శ్రద్ధ లేకుండాపోతోంది. ఆ ఫిడేలు అలా పెట్టెలోనే మూలుగుతోంది. మధ్య, మధ్య కూనిరాగాలు తప్పితే గొంతు విప్పిపాడడం తగ్గిపోతోంది.

'అలా కూనిరాగాలు తీయకపోతే, కాస్త జోల పాటలు నేర్చుకోకూడదూ?' అంటారాయన కొంటెగా చూస్తూ... ఆయనలా అంటూంటే తనకంత సిగ్గనిపిస్తుందేమిటో.

వీధి చివర కనపడుతూన్న దెవరు చెప్మా? పొడుగ్గా వున్నారు... ఈయనేనేమో. 'పొడుగు అనగానే తనకి 'ఆ' సంగతి జ్ఞప్తికొస్తుంది.

ఆనాటి సంఘటన తలుచుకుంటే, ఏవిటోలా అనిపించి, ఈ నాడుకూడా సిగ్గు ముంచుకొస్తుంది.

మావయ్య ఆ రోజు పెళ్ళిచూపులకి తీసుకొచ్చాడు... ఈయన్నీ, అత్తగార్నీ. స్కూల్ ఫైనల్

చదువుతోంది తను. కారణం తెలీదుకాని, అందరూ 'ఈ' సంబంధం అయిపోతుందనుకున్నారు. ఇంకా గమత్తు - వాళ్ళిద్దరూ సరాసరి తమింట్లోనే దిగడం, లాంఛనంగా చూపించడం, పాట, వగైరా అన్నీ అయిపోయాయి. ఆ సాయంత్రం చెప్పారుట అత్తగారు. 'ఇక ముహూర్తం గట్రా చూడ్డం మీదే తరవాయి' అని.

తను ఆ రోజు ఇక గదిలోంచి కదిల్తే వొట్టు... అంత.... సిగ్గనిపించింది. రెండో రోజు పొద్దుట వాళ్ళు వెళ్ళడానికి సిద్దమవుతున్నారు. తను మెట్లెక్కి మేడ మీదికి వెళ్తోంది... పౌడరు కోసం. మెట్లెక్కి చూస్తే ఆయన వున్నారు తనకేసే చూస్తూ. చప్పున ఎక్కడైనా దాక్కోవాలనిపించింది. కాలు కదల్దే.. అలాగే నిల్చుండి పోయాను ఏమనడానికీ, ఎటూపోడానికీ పాలుపోక.

ఇంతలో అత్తగారు దగ్గరకొచ్చి తల మీద చెయ్యేసి, నిమురుతూ "అలా ఖంగారు పడతావేమే వెర్రిపిల్లా! ఏదీ, ఇలా దగ్గరిగా రా; మా వాడి పక్కన నుంచో - ఓమాటు చూస్తాను" అన్నారు. తను కదలలేక శిలలా అయిపోయింది ఎంచేతో?

"నువ్వే రారా, రామం! పక్కన నుంచో"

ఆయన పక్కకి వొచ్చారు. తనకు బాగా జ్ఞాపకం... తన కిష్టమైన పల్లటి వోణీ, పువ్వుల పరికిణీ కట్టుకున్నది. ఆయన పక్కన నుంచుంటే ఆయన భుజం వోణీకి తగుల్తూ వుంది. తన ముఖం సిగ్గుతో కందగడ్డే ఐపోయింది.

"భయం లేదులే - అమ్మా నేనే పొడుగులే కొద్దిగా" అని ఆయన ఇంకా కొద్ది దగ్గరగా వచ్చారు, కొల్చుకోమన్నట్టు. ఆయన చేయి తన భుజానికి తగిలింది. వంట్లోంచి, ఏమిటో వణుకులా వచ్చింది. తనకున్న పొడుగు కూడా కరిగిపోయినట్లనిపించింది. తల ఎత్తలేక పోయింది.

అనూరాధ ఆలోచనలోంచి తేరుకొని తలెత్తి మరోమాటు వీధిలోకి చూసింది.

అబ్బే, ఆ పొడుగ్గా వస్తున్నదీయన కాదు. హైస్కూల్లో పని చేస్తున్న టీచరు. పాపం, ఈవిడ ఇప్పు డెళ్ళి వంట చేసుకోవాలి. ఆ వున్న ఒక్కతమ్ముణ్ణి కాలేజీలో చదివించడానికి ఈ తాపత్రయమంతాను. ఆ తమ్ముడికి ఎక్కడలేని ఆకతాయి గుణాలు వొచ్చాయి. మొన్న 'సుధ' చెప్తోందిగా... అమ్మాయిల వెనకాల తిరుగుతాడని.

ఆవిడ ఉద్యోగం చేస్తూ, ఇంటిపనంతా చేసుకుంటుంది. ఇప్పుడు ప్రైవేట్లు చెప్పి వస్తోంది కాబోలు. ఈవిడెంతో మంచిది. ఆ మధ్య మునసబుగారింటికి పేరంటానికి కొచ్చినప్పుడు, తనతో ఎంత ఆప్యాయంగా, చక్కగా మాట్లాడింది. పాపం! ఆవిడ ఒక్కర్తినీ విడిగా, ఏదో వెలిగా చూశారక్కడ. ఎంత బాధపడి

వుంటుందో?

అందరికీ పసుపు రాసి ఈవిడ కాళ్ళకి రాయకుండా చూస్తూ వూరుకొంది ఆ సరసమ్మగారు.

"రాయండీ" అంటూ చీర కుచ్చిళ్ళు సున్నితంగా పైకి తీసి, ఎంత వెన్నెల చిలకరించిందీ ఆ చిరునవ్వులో, పాదాలు పచ్చగా మెరిసిపోయాయి.

"అబ్బే, చదువుకున్నవాళ్ళు పసుపూ గట్రా రాయించుకోరేమోనని అనుకున్నానమ్మాయ్! మాదంతా పూర్వాచారం, ఏదో తెలీనివాళ్ళం," అంది సరసమ్మగారు గట్టిగా.

సరసమ్మగారికి ఇంకోళ్ళని బాధపెట్టడం బాగా తెలుసు... మిగతి వేవీ తెలీకపోయినా. సరసమ్మగారు మాటలు తనకే బాధ అనిపించేయే... ఆవిడంతా మనసులో దాచుకుని, 'అబ్బే, నా కలాటి అభ్యంతరాలు లేవండీ' అని నవ్వుతూ, ఎలా అనగలిందో? సరసమ్మగారు ఆవిడ కట్టుకున్న సిల్కుచీర పాడవాలన్నట్లు పాదాలేకాకుండా, మోకాళ్ల దాకా రాసినంత పనిచేసి పోయింది. మళ్ళా సరసమ్మగారి మనవరాలు ఎక్కడైన పేరంటానికొస్తే, 'కాస్త గోళ్ళకి రాయండీ' అంటుంది మామ్మ పక్కనుండగానే.

ఇలాటి సూటిపోటీ మాటలు పడ్తూ ఆవిడెలా నెగ్గుకొస్తోందో?... వీధులో మగవాళ్ళలో, చుట్టుపక్కల ఆడవాళ్లలోను. ఆ చిరునవ్వే ఆవిడకి భూషణం. ఆ నవ్వులో ఎదుటివాళ్ళ మాలిన్యం కూడ హరించుకు పోయే శక్తి వుంది. మరి ఆ సరసమ్మగారెలా అనగల్గిందా మాటలు?

ఈవిడ సంగతి చెప్తూ చాలా మంచిదని ఆయన్తో అంటే, "మీ అన్నయ్యకో ఉత్తరం రాయి. వచ్చిచూసుకొని పెళ్లి చేసుకుంటాడేమో, ఓ పిల్లనైనా రక్షించినవాడవుతాడు," అన్నారు నవ్వుతూ.

ఈయనకి పెద్దగొప్ప, గర్వమూనూ... తనేం కట్నం తీసుకోలేదని. అవున్నిజమే! ఆ మాత్రం గర్వం వుండడంలో తప్పులేదనిపిస్తుంది. ఈ రోజుల్లో కట్నం లేకుండా ఎవరు చేసుకొంటున్నారు? నాన్నగారు ఇస్తానన్నా ఆ మాట ఎత్త వద్దని పంతం ఎట్టి చేసుకున్నారు.

'సాక్షాత్తూ లక్ష్మి మా ఇంటికొస్తుంటే, ఇక మాకు వేరే కట్నమెందుకూ?' అన్నారట అత్తగారు ఆ రోజు నాన్న గారితో. మావగారికి కట్నం తీసుకోక పోవడం మొదట్లో చిన్నతనమనిపించినా, ఒక్కగానొక్క కొడుకు పట్టుదలకి వొప్పుకున్నారు.

వీళ్ళింట్లో చాలా కాలాన్నించి చిన్న పిల్లలు లేకపోడంతో తనని కన్న కూతురు కంటే ఎక్కువగా, మల్లెపూవులా చూసుకునేవారు అత్తగారు. మావగారు కూడ ఎంత హుందాగా అభిమానం వ్యక్తపరిచేవారనీ!

"ఇంట్లో చిన్నపిల్లలు తిరిగి పాతికేళ్ళవ్వస్తోంది. నీ కడుపునో కాయ కాస్తే..." అనే అత్తగారి మాటలు

తనకి పులకరింపుగా వుండేవి.

విసురు గాలి వీస్తోంది. చల్లటి గాలి చలి గాలిగా మారింది. అనూరాధ ఆకసంలోకి చూసింది. దూరంగా నల్ల మబ్బులు గుమిగూడి పరిగెట్టివస్తున్నాయి. చుక్కలు మబ్బుల్లో కలిసిపోతున్నాయి. ఆ నల్లమబ్బులు తనని కప్పి, తన అందం మింగకుండా వుండేందుకా అన్నట్టు చందమామ పరిగెడుతున్నాడు. గాలి విసురు ఎక్కువైంది.

అనూరాధకి చప్పున భయం వేసింది.

ఇంతసేపు ఎక్కడ వున్నారు చెప్మా? గాలి ఎక్కువై పోతోంది. వర్షమొస్తుందేమో కూడానూ?

అనూరాధకి వున్నట్టుండి వళ్లు తిప్పినట్టైంది. కడుపులో కెలికినట్లుగా వుంది.

ఇంత బాధగా వుందేమిటో?

కళ్ళు కూడ తిరుగుతున్నా యెందుచేతో?

వీపు మీద చల్లని చేయి తగిలింది. వెనక్కి తిరిగింది. అత్తగారు పక్కన వున్నారు.

"ఇంతగాలిలో ఒక్కతెవే వున్నావేమే రాధా! కిందికిరా, భోంచేసి పడుకుందువుగాని," అన్నారు లక్ష్మమ్మగారు.

"ఆయన వొస్తారుగా... అప్పుడు తింటాలెండి."

"వాడు ఎప్పుడొస్తాడో? నువ్వు తినేద్దువుగాని రా"

"ఎందుకండీ... కాసేపట్లో వస్తారుగా"

"నే చెప్తున్నా రా రాధా! నువ్విలా వుండడం మంచిది కాదు, తెలుసా? పోనీ, నీకోసం కాదులే..." అంటూ లక్ష్మమ్మగారు, కోడలి నడుం చుట్టూ చెయ్యేసి కిందికి తీసుకువెళ్ళారు.

మెట్లు దిగుతూంటే రాధకి మళ్లా వొళ్లు తిప్పి, వాంతి వచ్చేట్టనిపించింది. అన్నం ముందు కూచున్నదన్న మాటే గాని ఏం తినలేక పోయింది.

"నీ కిష్టమని చేశానే ఆ కూర, పచ్చడీను... ఏవీ ముట్టుకోడం లేదేం తల్లీ" అంది అత్తగారు దగ్గరగా జరిగి.

"ఏవిటో తినాలని లేదండీ... గాభరాగా వుంది."

ఇంతలో మామగారు వంటింటి గుమ్మం దగ్గం`కొచ్చారు. లేవబోతూంటే కోడల్ని కూచోమని సంజ్ఞచేసి "వీడింకా రాలేదూ?" అన్నారు.

"లేదండీ...ఎక్కడి కెళ్ళాడో కాని?" అన్నారు లక్ష్మమ్మగారు.

"ఈపాటికొచ్చేయకూడదూ, పిల్ల వొక్కతే వుంది.... ఖంగారు పడుతుందనైనా తట్టలేదా," అంటూ వీధిలోకి వెళ్ళిపోయారాయన.

భోజనం సయించక అనూరాధ కంచం దగ్గర నుండి లేస్తుంటే కళ్లు తిరిగాయి. దొడ్లోకెళ్ళి వాంతి చేసుకుంది.

"కాస్తయినా తినలేదే తల్లీ! ఒట్టిమనిషివికూడా కాదు... ఏదో కాస్త హితవు చేసుకోవాలి. ఆ బీరువాలో బత్తాయి పళ్ళున్నాయి. అని తీసుకుని పైకెళ్ళి కళ్ళు మూసుకుపడుకో నేను పని చూసుకువస్తాను," అని అత్తగారు మెట్లదాక వచ్చి సాగనంపారు.

మేడమీద గదిలో పడుకొని అనూరాధ కళ్ళుమూసుకొంది.

ఇంత గాభరాగా వుందేవిటి.?

కడుపులో కదిలించినట్టై లేచి కూర్చుంది.

డాబా మీది కొచ్చింది. గాలి ఇంకా బలంగా వీస్తోంది. మాధవీలత గాలికి రెపరెపలాడి దీనంగా చూస్తోంది. రాతి స్తంభం నిశ్చలంగా వుంది.

ఈయనింకీవాల్టికి రారేమో?

రేపు తన పుట్టినరోజు కూడానూ?

మొన్న, మొన్నటిదాకా అమ్మ ఎంత హడావుడి చేసేది పుట్టిన రోజంటే.

అమ్మ ఏం చేస్తుంటుందో ఇప్పుడు? నాన్నగారు వస్తారేమో?

అమ్మని చూసి అప్పుడే ఎన్నాళ్ళో అయినట్టుంది. మూడు, నాలుగు నెలలు తను ఉత్తరాలు రాయకపోతే అమ్మ విలవిలలాడి పోయిందట! తను ఏవని రాస్తుంది?

రాస్తే 'ఆ' సంగతెలా రాయడం? పైగా ఈయన వేళాకోళాలోటి... ఇంటికి ఉత్తరం రాయమని, ఎలా రాయాలో, ఏమని రాయాలో తెలీక, సిగ్గుచేత వరసగా మూడు నెలలు ఉత్తరమే రాయలేదు. అమ్మ కంగారుపడి, పెద్ద వదిన పుట్టింటి నుండి వస్తుంటే ఇక్కడికి పంపింది. కులాసాగా వున్నట్టు చూసిరమ్మని.

పెద్ద వదిన ఇంట్లో దిగుతూనే తన దగ్గరకొచ్చి, రెండు మాటలాడి, ఆదోరకంగా చూస్తూ నవ్వింది గమత్తుగా. ఆవిడ మొహం లోకి చూడలేకపోయింది తను.

వెంటనే అత్తగారి దగ్గరకెళ్ళి, గుసగుసలాడి దగ్గరిగా వచ్చి, కొంటెగా చూస్తూ "ఏమిటే విశేషాలు?'' అంది.

"ఏమున్నాయి...?'' అంది తను మెల్లిగా.

"మా ఆడబడుచుకు మొదటి నుంచీ గుట్టే. ఎన్నో నెలేమిటి?'' అంది.

"ఏమీ నాకు తెలీదు, పోదూ.....''

"ఇదిగో ఇప్పుడే చెప్తున్నానమ్మాయ్.. కోడలు కోసం మీ అన్నయ్య కూడ చూస్తున్నారు. మరి ఏం చేస్తావో?'' అంది ఎంతో ఆదరంగా నడుం చుట్టూ చెయ్యేస్తూ.

ఇంటికెళ్ళి వదిన చెప్పగానే, అమ్మ వచ్చేసింది... ఏవేవో చేయించి తీసుకొస్తూ. ఐదో నెల్లోగాని ఏడో నెల్లో గాని తీసికెళ్లమని అత్తగారు చెప్పారు. గడియారం పది గంటలు కొట్టింది.

ఈయనింకా ఇవాళ రారేమో? ఎప్పుడూ ఇలా చేయలేదే?... ఆరు దాటకుండానే వచ్చేసేవారు.

అబ్బ! కడుపులో ఇలా తిప్పుతోందేం చెప్మా! వికారంతో కళ్లు కూడా తిరుగుతున్నాయి. ఇంత బాధగా వుందేం?

గాలి తీవ్రతకి మాధవీలత వణికిపోయినట్లు రెపరెప లాడింది. అనురాధ బాధగా గదిలోకి వెళ్ళి మంచపై వాలింది.

రేపు తన పుట్టినరోజు పండగనగా, ఇవాళ తనకింత బాధగా వుందేవిటో? రేపు పుట్టినరోజనగానే, అమ్మ దగ్గర వుండగా ఎంత సంతోషంగా వుండేది. ఆ రోజున కొత్త వోణీ, పరికిణీ పట్టుకొని, అమ్మ చేసిన 'స్వీటు' తింటూ... ఎంతో బావుండేది.

ఆ అలవాటు అత్తగారు కూడా మానలేదు. తను వదద్దంటున్నా, పండుగ రేపనగా ఆయన్చేత కొత్త చీర తీయించి, కట్టించితే కాని వూరుకునేవారు కారు.

మొన్నామధ్య సినిమా కెళ్ళినప్పుడు వీధి చివర ఆ ప్లీడరు విశ్వనాధంగారి భార్య కట్టుకున్న చీర ఎంత బావుందీ! ఆయనకి చూపించి "చీర బావుందికదూ...'' "అంటే, కావాలనేగా! ఆడవాళ్ళు ఇలాటి రోజుల్లో కోరిన కోరిక తప్పకుండా తీర్చాలని శాస్త్రకారుడు లిఖించాడుగా. తీసుకొస్తాలే'', అన్నారు.

అన్నారే కాని, వెంటనే మర్చిపోయినట్టున్నారు. ఆ చీర పుట్టినరోజు నాడుడు కట్టుకోవాలనిపించింది. మొన్న జ్ఞాపకం చేస్తే తీరా చీర రంగు గూడా జ్ఞాపకం లేదాయనకి. ఈ మొగాళ్ళకెప్పుడూ ఇంతే... చీరల విషయంలో రంగూ, బోర్డరూ ఏవీ జ్ఞాపకముండవు.

"ఆరుద్ర పురుగు రంగండీ," అంటే "ఆరుద్ర పురుగు ఎలా వుంటుంది?" అని అనడం.

మొత్తానికి చీర తీసుకొచ్చి చూపిస్తేనే కాని తెలీలేదు.

కొట్టొచ్చే రంగూ, తళతళ మెరుస్తూ నల్లటి బోర్డరూ... ముద్దొస్తూ వుంది చీర.

ఈయనే రాకపోతే, ఇక చీర ఎక్కడ నుంచి వస్తుంది?

ఆసలింతసేపటిదాకా ఎందుకు రాకపోవాలీ? అనూరాధకి వున్నట్టుండి కళ్ళ నీళ్ళు తిరిగాయి.

పైగా తన కింత బాధగా వుంటే ఇంటికింకా రాలేదు.

పదకొండు కూడా కావస్తోంది. మళ్ళా సాయంత్రం పెందరాళే ఇంటికొస్తానని చెప్పడం.

క్లబ్బు కెళ్ళారేమో? ఈమధ్య మానేసినా, ఆ 'చంద్రం' గారు వస్తే, ఆ క్లబ్బులో కూచుని ఊహు కబుర్లు.

ఈయనకింత అశ్రద్ధ ఐతే నేనెందుకు ఇక్కడుండడం? నాన్న గార్ని రమ్మని రాసి వెళ్ళిపోతే సరి.

గడియారం పదకొండు కొట్టింది. ఆకాశం ఉరుముల్తో మెరుముల్తో దద్దరిల్లిపోతోంది. ఇక వర్షం రావడం ఆగదు.

అనూరాధ కళ్లు ఒక్కమాటుగా వర్షించాయి. ఆమె కన్నీటికి అంతులేకపోయింది. కన్నీటితో పాటు, ఎవరిమీదో తెలీని కోపం కూడా పేరుకుంది. ఆ కోపం కాస్తా భర్త మీదికి తిరిగింది.

నాకు తెలుసు, ఈయనివాళ కింకరాదు! ఎక్కడకెళ్తే నా కెందుకు? నాకింత బాధగావుంటే కాస్త పలకరించడానికైనా దగ్గరుంటేనా! అమ్మ వుంటే ఎంత బావుణ్ణు.... ఏమైనా రేపు పొద్దుటే బయల్దేరి ఇంటికెళ్ళిపోతేసరి. రేపైనా వస్తారుగా. వచ్చినా చెప్పేసి వెళ్ళిపోతే ఏమంటారేమిటీ?

అనూరాధ భయంతో, బాధతో కళ్ళు మూసుకొంది. బైట వర్షం ఎక్కువైంది. మాధవీలత వర్షంలో తడిసి, ప్రకృతి బీభత్సానికి శోషిల్లి, నీరసపడి పోయింది.

అనూరాధ నిశ్చియాని కొచ్చేసింది.

రేపు ఆయన వొస్తే చెప్పేసి ఇంటికెళ్ళిపోతాను.

ఏవో ఆలోచనలతో, కడుపులో బాధతో, అనూరాధ అలసిపోయి, ఒంటి గంట దాకా భర్త కోసం ఎదురు చూసి, చూసి విసిగి, వేసారి, తనకి తెలీకుండానే నిద్రపోయింది.

అనూరాధకి చటుక్కుని తెలివొచ్చింది. చల్లటిచేతి స్పర్శతో భారంగా కళ్ళు తెరిచింది.

ఎదురుగా రామారావు భార్య వదనాన్ని చేతుల్లోకి తీసుకొని చూస్తున్నాడు.

"అదేవిటి రాధా.... నిద్రలో ఏడుస్తున్నావ్.... పీడకల ఏమైనా వచ్చిందా?" అన్నాడు ఆమె చెక్కిళ్ళ మీద కన్నీరు తుడుస్తూ.

"ఎంతసేపయ్యిందేవిటీ వచ్చి?" అంది అనురాధ భర్త చేతులు దూరంగా తీసేస్తూ.

"ఇప్పుడే... పావుగంటైంది."

"టైమెంతైంది ఇప్పుడు?"

"తెల్లారిపోయింది. ఆరు కావస్తోంది."

"పోనీ రెండు రోజులాగి రాలేకపోయారా?.... నా పుట్టినరోజు కాస్త దాటిపోను."

"అదేవిటి రాధా. దానికోసమే కాదా, ఎంతో ఆదుర్దాగా వచ్చాను."

"మీరంత ఆదుర్దాపడనవసరం లేదు లెండి. పొద్దుట పది గంటల బండికి నేను మా వూరు వెళ్తున్నాను. మా వాళ్లకో 'వైర్' మాత్రం ఇవ్వండి.... స్టేషన్‌కు రమ్మని" విసురుగా లేచింది అనూరాధ.

తెల్లబోయాడు రామారావు : "వెళ్దువులేగానిలే రాధా... నీకంతగా వెళ్లాలని వుంటే నే తీసికెళ్లి దిగబెడతాలే. కాని పుట్టినరోజునాడు వెళ్లడమేవిటి?"

"నేను ఎక్కడ వుంటే మీకేం పట్టుతుంది లెండి. అంచేత ఇవాళ వెళ్ళడం ఖాయం. వైజాగ్ వైర్ మాత్రం ఇవ్వండి" అని అనురాధ మంచం దిగి కిందికెళ్లిపోయింది.

రామారావు రాత్రంతా నిద్రలేక భారంగా వున్నాడేమో, ఈ సంఘటనతో మరీ బాధ పడ్డాడు. కళ్ళు మూసుకొని పడుకున్నా నిద్రపట్టలేదు. లేచి మొహం కడుక్కొని కూర్చున్నాడు. అరగంటలో ఫ్లాస్కులో కాఫీ పట్టుకొచ్చి, టేబిల్ మీద పెట్టి వెళ్లిపోబోతూంది రాధ.

"ఇలా ఓ మాటురా, రాధా! నా మాట పూర్తిగా వినకుండా అంతలా భీష్మిస్తే ఎలా?"

"ఏదో తొందరగా చెప్పండి. కింద పనుంది కూడాను. నేను బట్టలు కూడా సద్దుకోవాలి" అంది ముభావంగా అనూరాధ.

"నీకు రాత్రి వంట్లో బావుండలేదటగా... అమ్మ చెప్పిందిలే. రాత్రి ఓ మాటు పైకొచ్చి చూసిందట. లైటార్పేసి వుంటే నిద్రపోతున్నావనుకుని వెళ్ళిపోయిందట. నీకు ఇంటికెళ్ళాలని బెంగగా వుందేమో అంది అమ్మ. వెళ్ళాలని వుందా రాధా?"

"నాకు బావుండకపోతే దగ్గరున్న వాళ్ళెవరులెండి".

"నీకంతగా వెళ్ళాలని వుంటే నా అభ్యంతరమేముంది రాధా! నేనో, నాన్నగారో రెండు రోజుల్లో వీలుచూసుకుని దిగబెతాంలే."

"మీకు వీలెక్కడలెండి.... ఎన్ని పనులుంటాయో? ఏమైనా, నా కివాళ వెళ్ళాలని వుంది," అంది అనూరాధ అదే ఆఖరి మాటన్నట్టు.

ఆమె నిశ్చయానికి తిరుగులేదనిపించింది రామారావుకు.

"సరే ఐతే... ఇవాళే వెళ్ళు" అని కాసేపాగి "వెళ్ళేటప్పుడు మాత్రం నాకోరిక పాటించి, ఈ చీర కట్టుకొని మరీ వెళ్ళు" అంటూ రామారావు బేగ్‌లోంచి ప్యాకెట్ తీసి, రేపర్ తీసేసి చీర అందించాడు.

తెల్లబోయి ప్రాన్పడి పోయింది. అనూరాధ.

ఆరుద్ర పురుగు రంగు చీర... నల్లటి మెరిసే బోర్డరు.

వెంటనే ఏమనడానికి పాలుపోలేదామెకు.

"ఎవరు తీసుకొచ్చారు?" అని మాత్రం అనగల్గింది సన్నగా.

"నిన్న కాలేజికి వెళ్తుంటే, నీ చీర సంగతి జ్ఞాపకం వచ్చింది. సెకండవర్ వర్కులేకపోవడంతో వూళ్ళోకెళ్ళి వాకబు చేస్తే ఈ వూళ్ళో ఈ చీర దొరకదని తేలింది. ఇంతలో ఆ ప్లీడరు విశ్వనాథంగారు కనిపిస్తే అడిగాను. బెజవాడలో తీసుకున్నారుట.... అక్కడ దొరకొచ్చు అన్నాడాయన. బెజవాడ దగ్గరేకదా అని మధ్యాహ్నం కాజువల్ లీవు పడేసి వెళ్ళాను. ట్రెయిన్ దాటిపోతుందని ఇంటికొచ్చి చెప్పలేదు. బెజవాడలో చీర కోసం వెతుకుతూంటేనే వర్షమొచ్చింది. వర్షం మూలంగా చీర కొని స్టేషనుకు రావడానికి ఆలస్యం అయ్యింది. రాత్రి ట్రయిన్ తప్పిపోయి తర్వాత బండి మీద వచ్చేటప్పటికి ఆలస్యమైపోయింది. చీర మాత్రం కట్టుకువెళ్ళు. నా సరదా తీరుతుంది", అంటూ రామారావు భార్య చేతిలో పెట్టాడు చీరని.

రాధ సంగతంతా విని ఏమనలేకపోయింది లజ్జతో. తను ఆలోచించిన విధానానికి కుమిలిపోయింది.

పాపం! ఎంత కష్టపడ్డారో... తన సరదా తీర్చడానికి. తను మాత్రం ఇష్టమొచ్చినట్లు అర్థాలు తీసుకొని, ఆయన మనసు బాధ పెట్టింది.

రాత్రి కడుపులో బాధ, వర్షం, ప్రకృతి బీభత్సం... వీటితో మనసు కదిలిపోయి, కారణంలేని కోపాన్ని, ఏమీ తెలీని ఈయన మీదికి తోసేసి, పంతం పట్టింది. ఎంత బాధపడ్డారో, పాపం! తన పంతానికి తనలో కుమిలిపోవడం తప్ప వేరే గత్యంతరం లేదు.

ఈ సింహావలోకనంతో, క్షమాభిక్ష అర్థించే మనసుతో, జాలితో, లజ్జతో రాధ కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. భర్త చూడకుండా పక్కకి తిరిగి కన్నీరు కొంగుతో అద్దుకొంది.

ఇటు తిరిగి కాఫీ గ్లాసులో పోసి భర్త కందించింది. రామారావు తాగుతూ డాబా మీద కొచ్చాడు. అనూరాధ అక్కడ నిలువలేకపోయింది. కిందికొచ్చి మనసులోని క్షోభ కరిగేటంతగా ఏడ్చేసింది. భర్త బంగారు హృదయాన్ని, ఏదో సంబంధంలేని తీవ్ర పరిస్థితుల్లో, తప్పుగా అర్థం చేసుకున్నందుకు.

కాసేపట్లో తేరుకొని స్నానం చేసి, ఏదో తప్పుచేసిన దానిలా కొత్తచీర కట్టుకొని హాలులోకొచ్చింది అనూరాధ.

ఆమె అక్కడ వుండగానే, ఆమె తండ్రి సత్యమూర్తిగారు వచ్చారు... "అమ్మడూ కులాసా?" అంటూ". తండ్రికి నీళ్లిచ్చి, అత్తగారితో చెప్పి, డాబా మీద కొచ్చింది.

"మా నాన్నగారు వచ్చారు" అంది మెల్లిగా భర్తతో.

రామారావు కిందికొచ్చి మావగార్ని పలకరించాడు. కుశల ప్రశ్నలయ్యాక, సత్యమూర్తిగారు అల్లుడికి అసలు విషయం చెప్పారు... పిల్లని తీసుకెళ్ళడానికొచ్చానని.

"నా అభ్యంతరం ఏం లేదండీ".

గదిలోంచి భర్తమాటలు విన్న అమరాధ దుఃఖంతో కుమిలిపోయింది.

ఇంత మంచి మనసుని, ఒక్క రాత్రి రాలేదన్న విషయంలో ఎంత గాయపరిచింది? దీనికి పశ్చాత్తాపం కూడా చాలదు.

సత్యమూర్తిగారు, లక్ష్మమ్మగారితో కూడ సంగతి చెప్పారు. ఆవిడ కూడా "మీ ఇష్టం" అన్నారు.

గదిలోకొచ్చి కూతురితో "అతన్తో కూడా చెప్పాను. మీ అత్తగారు కూడా ఒప్పుకున్నారు. మరెప్పుడు బయల్దేరినా నీ ఇష్టం. ఇవాళా, రేపూ కూడా మంచిదే" అన్నారు సత్యమూర్తిగారు.

"నేను తర్వాత వస్తాను నాన్నా... మరో రెండు నెలలు పోయాక, అమ్మతో నే చెప్పానని చెప్పు".

"అది కాదే. అందరూ ఒప్పుకుంటే నీ అభ్యంతరమేవిటి? మీ అమ్మకూడా నీ కోసం ఎదురుచూస్తోందే అమ్మడూ."

"నే చెప్పానుగా నాన్నా... తర్వాత వస్తానని. ఆయనొచ్చి దిగబెడతారులే. ఆయన వంట్లో కూడా ఈమధ్య అట్టే బాగుండటంలేదు" అనేసి మేడ మీద కెళ్ళిపోయింది రాధ.

రామారావు డాబా గోడ మీదకి వంగి రాతిస్తంభానికి మాలతీలతని సర్దుతున్నాడు.

రాధని చూసి "ఆ చీర ఎలా మెరిసిపోతోందో చూడు... నీ రంగులో కలిసిపోయింది" అన్నాడు.

ఎంతో ఆర్ద్రంగా చూసింది అనూరాధ భర్త వేపు, 'నన్ను క్షమించరూ?' అన్నట్లు.

"ప్రయాణం ఇవాళా రేపా?" అన్నాడు రామారావు.

కాసేపాగి "నేను వెళ్ళడంలేదు. తర్వాత వెళ్తాను" అంది అనూరాధ.

"నాకు కోపమేం లేదు రాధా. నిజంగా నీకు వెళ్ళాలని వుంటే, నా అడ్డు ఏవాడూ లేదు."

అనురాధ భర్త వదనంలోకి చూస్తూ, దగ్గరగా వచ్చి, అతని జుట్టు సర్దుతూ "నాకు వెళ్ళాలని లేదు" అంది.

జుట్టు అలా సవరిస్తూనే "ఇదేవిటండీ ఇంత తడిగా వుంది తల. వర్షంలో తడిసివట్లున్నారు. తల తుడుస్తాను... గదిలోకి రండీ" అంటూ అనూరాధ, భర్తని గదిలోకి తీసికెళ్ళింది.

భర్త జుట్టు టవల్‌తో అద్దుతూ "కాస్త సాంబ్రాణి పొగ కూడా వేస్తామండండి... లేకపోతే జలుబు చేస్తుందేమో" అంది రాధ.

"ఇంకా నయం. చంటి పిల్లాణ్ణా ఏవిటి... సాంబ్రాణి పొగవేయించుకోడానికి" అన్నాడు రామారావు నవ్వుతూ.

"మిమ్మల్ని పాపాయిలా కాపాడుకోవల్సిన బాధ్యత నామీదుంది. అంచేత మీరెప్పుడూ నాకు చంటి పాపాయే" అంది అనూరాధ భర్త జుట్టు దువ్వుతూ.

"ఐతే నువ్వు కొంత కాలానికి ఇద్దరు చంటి పాపాయిల్ని కాపాడుతూ, సాకాలన్నమాట" అన్నాడు రామారావు ఆమె నడుం చుట్టూ చెయ్యేస్తూ.

సిగ్గుతో మొగ్గలా ముడుచుకుపోయింది అనూరాధ. లజ్జతో శరీరమంతా పులకరించింది.

"మీరెప్పుడూ ఇంతే బాబూ..." అంది దూరంగా జరిగి, పక్కకి తిరిగి.

రామారావు దగ్గరకొచ్చి ఆమెను పొదివి పట్టుకున్నాడు. ఆమె అతనిలో లతలా అల్లుకుపోయింది.

పైన చల్లనిగాలి వీస్తోంది హాయిగా. ఆకాశం ప్రశాంతంగా వుంది.

*(ఆంధ్ర సచిత్ర వారపత్రిక: 10-12-1958)*



# పిచ్చుక శాపం

సీతారామారావు మరొక్కమాటు దీర్ఘంగా ఆలోచించాడు, ఆలోచించడానికేం భయం లేదుగా అనుకొని. అదైనా మనస్సులో, రహస్యంగా, పదిలంగా ఆలోచిస్తున్నాడు. పైకి ఎవరితోనైనా చెప్తేకుంటే నామోషీగాని తనలో ఆలోచించుకోడానికేం అని మనస్సుని సమాధానపరుచుకొన్నాడు. ఎంత ఆలోచించినా సుశీల విషయంలో ఆలోచనలొక కొలిక్కి రాలేదు రామారావుకి. ఇంతకీ సుశీల విషయంలో అతనింతలా ఆలోచించడానికి ఆమె, అతని ఊహా ప్రేయసి అయినా కాదు. స్వయానా అతని చేత తాళి కట్టించుకొన్న భార్య.

ప్రశాంతంగా గడపవలసిన ఈ సాయం సమయంలో ఈ చిన్న విషయంతో మనస్సుని బాధపెట్టుకుంటున్నానే అనిపించిందతనికి. "చిన్న విషయమేమిటి, ఇది నా జీవిత సమస్య" అనుకున్నాడు కాసేపుండి. అసలామెలో ఆ వెకిలితనం మొదటి నుంచీ కనిపెడుతూనే వున్నాడు. మొదటి రోజుల్లో సర్దేసుకున్నా రానురాను దుర్భరమైపోయిందతనికి, భార్య ప్రవర్తన. ఇతరుల్తో మాట్లాడుతున్నప్పుడు తన్ని గూర్చి అనేక విశేషణాలుపయోగించి భార్య పొగడ్డం అతనికి తెలియంది కాదు. కాని ముఖాముఖీ మాట్లాడుతున్నప్పుడు మాత్రం తనే అన్ని విషయాల్లో మేధావి నన్నట్టు మాట్లాడేది. అతను ఎంత సీరియస్‌గా వున్నా వేళాకోళంగా జమకట్టేది.

'అసలు ఆ బుద్ధి వాళ్ళ కుటుంబంలోనే వుందిలే' అనుకొన్నాడు సీతారామారావు. అతని మామగారు పోలీసు ఇనస్పెక్టరు చేసి రిటైరయ్యాడు, రామారావు పెళ్ళి నాటికి. ఉద్యోగం మానినా మాటల్లోనూ, చేష్టల్లోనూ కరుకుదనం మాత్రం పోలేదు. తక్కినవాళ్ళనంతా కింది చూపుగా చూసేవాడు.

పెళ్లి చూపులకి వెళ్లినప్పుడే రామారావుకి కాబోయే మామగారి వేషధారణ, మాట తీరు, మూతికి రెండు వైపులా చిన్న మొక్కజొన్న పొత్తుల్లాగ తెల్లగా నెరసిన మీసాలు చూసేటప్పటికి గౌరవంతోపాటు,

కొద్దిగా భయంకూడా వంట్లో పేరుకోవడం ప్రారంభించింది. సుశీలని చూసేటప్పటికి రామారావుకి తక్షణం ముహూర్తం పెట్టించి, అప్పుడే పెళ్లి జేసుకుందామన్నంత ఆలోచన వచ్చిందనడంలో అతిశయోక్తిలేదు. కాసేపుండి బెదురుతూనే రామారావు మామగారికేసి ఓరగా చూశాడు. గాలికి కొద్దిగా చివర భాగాలు ఎగురుతూన్న కుడి మీసాన్ని ఎడంచేతి గోళ్లతో గీరుతూ సవరిస్తూ, రెండో చేతితో తెల్లటి బొచ్చుకుక్కని నిమురుతూ, 'ఈ పిల్ల మా వంశంలో పిల్లోయ్, నువ్వు చూసింది మా పిల్ల మరేమిటనుకున్నావో, ఇలాంటిది నీకు దొరుకుతుందా తపస్సు చేసినా?' అన్నట్టుగా చూశాడాయన. తీరా ఇతర విషయాల్లో కుదరక పెళ్లి చేసికోకపోతే "అంతసేపూ చూసి మా అమ్మాయిని చేసికోవూ?" అని నరికి పారేస్తాడేమోనన్నంత భయం వేసింది, రామారావుకి ఆయన్ని చూస్తుంటే. ఇలాంటి వాడితో ఎలాగరా వేగడం బాబూ అనుకున్నాడు. అయినా చేసుకునేది ఆయన్ని కాదుగా, ఆయననెలా వుంటే మనకేం అని సర్దేసుకున్నాడు. ఆయనకెంతసేపూ తన దర్జా, గొప్ప వొలకబోసుకుందామనేగాని, అలా చేస్తుండగా ఇతరులు తన మాటల వల్ల బాధపడుతున్నారేమోని కూడ ఆలోచించడు.

పెళ్లిలో సీతారామారావు మంగళ సూత్రం కడుతూంటే, ఆయన తమ్ముడితో "సూత్రం కూడా దర్జాగా కట్టలేడురా, మన అమ్మాయి చూడు ఎంత అందంగా వంచిందో మెడ" అని నవ్వుతూ మెల్లిగా అంటున్నాడు. సీతారామారావుకి చచ్చినంత పనయింది ఆ మాటలు విన్నతర్వాత. పెళ్లి నాలుగో నాడు ఉంగరం పానకం బిందెలో వేసి ఎవరు ముందు తీస్తారు వధూవరుల్లో అన్నప్పుడు, రామారావు చటుక్కున ఉంగరాన్ని పైకి తీసేశాడు. "పెళ్లాన్ని కాసేపు ఏడిపించడమేనా తెలియదేమిటోయ్ నీకు" అన్నాడు వెంటనే నవ్వుతూ సీతారామారావు మామగారు, పెళ్లాన్ని ఏడిపించడమనేది తాజమహల్ నిర్మాణం లాంటిది అని ధ్వనించేటట్టు. తలుపు దగ్గర పేర్లు చెప్పమన్నప్పుడు "మా పిల్లకంటే నువ్వే ఎక్కువ సిగ్గుపడుతున్నావేమిటోయ్" అన్నాడు కోర్టులో ముద్దాయిని క్రాస్ ఎగ్జామినేషన్ చేస్తున్నట్టుగా మొహం పెట్టి, అప్పుడే బి.యల్. పాసయివచ్చిన సీతారామారావు పెద్ద బావమరిది హనుమంతరావు. అలక సమయంలో 'నీకేం కావాలో కోరుకోవోయ్' అన్నాడు సీతారామరావు మామగారు. సీతారామారావుకి "నాకేం వొద్దు బాబు, ఆ నీ మీసాలు మాత్రం తీయించేయి డబ్బు నేనిచ్చుకుంటాను. లేకపోతే నాకు భయంగా వుంది" అనాలనిపించినా సద్దుకొని "సైకిలు" అని వసిగాడు. ఆయన మీసాలు చాటునించి మెల్లిగా నవ్వి "సైకిలేమిటోయ్ మరీను మోటారు సైకిలైనా ఆఖరికి అడగవలసింది" అని వెంటనే మోటారు సైకిలు తెప్పించి ఇచ్చాడు. సీతారామారావుకి మాత్రం చెప్పుచ్చుకొని కొట్టినట్టయింది మామగారు చేసినపని.

తరువాత ఆయన కొన్నాళ్లకి మోటారు సైకిలుమీద షికారు వెళ్తూ, సైకిలు బోల్తా కొట్టగా మరణించాడు.

సరిగా అదే వరసలో వుంది భార్య ప్రవర్తన సీతారామారావుకి. ప్రతీ మాటకీ చిలిపిగా వేళాకోళం

చెయ్యడం, తనకే అన్నీ తెలిసినట్టుగా వ్యవహరించడం - ఇదీ ఆమె వరస. ఓసారి పిక్చరుకెళ్దామంది సుశీల. సరే అన్నాడు రామారావు. ఎంతకీ తెమలక ఊరికే పౌడరు, స్నో, లిప్‌స్టిక్ రాసుకుంటూ కూర్చుంది సుశీల.

"అబ్బ, ఏమిటీ ఆలస్యం, బాగానే వున్నావులే. అసలు మీవల్లే బోలెడు డబ్బు విదేశాలకు పోతోంది, మీ స్నోలకీ, లిప్‌స్టిక్‌లకీను" అన్నాడు రామారావు భార్యతో.

"ఏం చెపుతారండీ మీరు. మీ నాన్నగారు పెట్టుకొనే తిరుచూర్ణానికి ఎంత డబ్బు ఎగుమతి చేస్తున్నారో కాస్త చెప్పండి చూద్దాం" అంది సుశీల కిలకిలా నవ్వుతూ. విట్టు వేద్దామనుకున్న రామారావు పెళ్ళాం హేళనతో చిత్తయిపోయాడు.

మరోమాటు ఏదో కథ రాస్తున్నాడు రామారావు. మొదటి వాక్యం, "*అప్పుడే వాన కురిసి వెలిసిం నేలంతా సుగంధం వేళ్ళ వాసనేస్తోంది*" అని రాశాడు.

ఎలా చూసిందో కాని సుశీల, "ఏం రాతలండీ అవి. వాన కురిసి వెలిస్తే సుగంధం వేళ్ల వాసనేమి ఏ అడవిలోనో పూలు, మొగలిడొంకలు అవీ దట్టంగా వున్నచోట వాన కురిసి వెలిస్తే మంచి సువాస వొస్తుందేమో! కాని మన యీ మునిసిపాలిటీ సైడు కాలువలున్న రోడ్డు మీద వర్షం కురిస్తే ఏం వాసనొస్తుందో తెలిసినవాళ్లెవ్వరూ మీ వర్ణనని ప్రశంసించలేరు" అంది తల్లో పాయ తీసి జాజిపూలు తురుముకుంటూ.

ఓం ప్రథమంలోనే భార్య అలా వేళాకోళంగా అడ్డుతగలగానే మహా చెడ్డ చిరాకెత్తింది రామారావుకు. ఆ కథలోనే తరువాత, "*ఆమె వదనం చంద్రబింబంలా వుంది*" అని రాశాడు. అది చదివి సుశీల "ఏమండీ, ఆమె ముక్కు మీద 'కంపాస్' పెట్టి గుండ్రటి సున్నా కొట్టాడా బ్రహ్మ ఆమె వదనాన్ని చంద్రబింబంలా సృష్టించడానికి? అలా చేస్తే మాత్రం ఆమె మొహం పెద్ద తాటికాయలా వుంటుంది" అంది నవ్వుతూ.

ఇలాంటి హేళనలు మొదట్లో ఎలా వున్నా చివరకు "*తొండ ముదిరి, ఊసరవిల్లి అయింది*" అనుకున్నాడు రామారావు. నోరు విప్పి ఎలా చెప్తాడు తన బాధ భార్యతో. పోనీ ఎవరితోనైనా చెప్పుకు పరిస్థితి కాదాయిరి. ఆలోచనల్తో బరువెక్కిన హృదయంతో ఇంట్లోకొచ్చి "బాబ్జీ" అని వాళ్లేళ్ళ కొడుక పిల్చాడు. పిల్లాడు నవ్వుతూ వచ్చి చంకెక్కాడు. ఇంతట్లో సుశీల వొచ్చి కాఫీ యిచ్చి రామారా "అదేమిటండీ అలా ఎత్తుకున్నారు వాణ్ణి, కూజాబిందె చంకపెట్టుకున్నట్టు" అంది. 'ఇంటికొ మొదలప్పుడే' అనుకున్నాడు రామారావు కుర్చీలో కూర్చుని కాఫీ గుటకేస్తూ.

ఇంతలో, "అమ్మా, కళ్లు మండుతున్నాయే" అన్నాడు బాబ్జీ.

"ఏవండీ, వీడి కళ్ళ మంటలు తగ్గడం లేదు. మీ మందు మానండి బాబు వీడికి. హోమియోప అంటూ పంచదార మాత్రలు మీరు ఇస్తుంటే చల్లగా వాడు తినేస్తున్నాడు. కళ్ళ మంటలు తగ్గడంలేదు" అంది

సుశీల రామారావుతో.

రామారావు హోమియోపతీ వైద్యం చేస్తాడు. అది "హాబీ" అతనికి.

కాసేపుండి సుశీల "పోనీలెండి మీరు మందు మార్చకపోతే మా అన్నయ్యకి ఉత్తరం రాస్తాను, వస్తాడు. నేను బాబ్జీ మా వూరు పోతాం" అంది.

"మరి నన్నేం చెయ్యమంటావ్?" అన్నాడు రామారావు.

"వెళ్ళగలిగితే మీ పుట్టింటికి మీరూ వెళ్ళండి. లేకపోతే నరసమ్మ హోటల్లో రెండు పూటలా పెరుగుతో సహా 32 రూపాయలు. ఆఫీసుకెళ్తూ రెండు పూటలు భోంచెయ్యండి" అంది సుశీల విసురుగా నవ్వుతో కలిసిన కోపంతో.

గాఢంగా నిట్టూర్చి సీతారామారావు కుర్చీలోనే కళ్ళు మూసాడు.

నాల్గురోజుల తర్వాత సుశీల అన్న హనుమంతరావు వచ్చి కూలీవానికి డబ్బిచ్చి, కోటు విప్పుకుంటూ, బాబ్జీకి మిఠాయి పొట్లం ఇచ్చి, ఇంట్లో రంగం చూసి ఆశ్చర్యపడ్డాడు.

సీతారామారావు వస్తాదులా చిన్న పట్టు పంచ విరిచి తొడలోకి కట్టి, ఒక చేతిలో అన్నం పళ్లెం, ఇంకో చేతిలో చారు గరిటె పుచ్చుకొని, చిరాగ్గా పెళ్ళాంతో "ఇంకొంచెం వేయనా" అంటున్నాడు.

సుశీల నవ్వు ఆపుజేసికొని "ఎప్పుడొచ్చావన్నయ్యా; రా ఇంట్లోకి" అంది మూలగా జరిగి. హనుమంతరావు కాళ్లూ చేతులు కడుక్కొని, "ఇదేమిటోయ్ బావా, ఇలా తయారయ్యావ్, అజ్ఞాతవాసంలో భీముడిలా చేతిలో ఇనుప గరిటె నీవూనూ" అన్నాడు మొహం రుమాలుతో తుడుచుకుంటూ.

"ఏముంది, మీ చెల్లెలు మూడు రోజుల 'కాజువల్ లీవు' పెట్టింది" అన్నాడు పొద్దున కూర గింపుతూంటే కాలిన బొబ్బలు వూదుకొంటూ.

రామారావు అన్న మాటల్లో అర్థం సుశీల ఫిఫ్తుఫారపు ఇంగ్లీషు తెలివితేటలకి అందినట్లుగా కొద్దిగా సగ్గుతో వంచిన ఆమె తలే చెప్తోంది.

కాసేపుండి సుశీల "అదికాదన్నాయ్. మొన్నోమాటు అన్నం చిమిడిందని కేకలు మొదలెట్టారు. 'మీకేం, మీరేమైనా అంటారు, వండేవాళ్లకి తెలుస్తుంది. వార్చే టైముకి బాబ్జీ ఏడ్చాడు. మీరు వండండి తెలుస్తుంది పస' అని మాటవరసకన్నాను. దాంతో నాకేనా వంట రాదంటావ్ అని నేనిలా కూచున్నానో లేదో ఆఫీసుకు 'కాజువల్ లీవు' పెట్టి పొయ్యి దగ్గర కూర్చున్నారు. అక్కడికీ నేను 'మీకు అలవాటు లేదు. ప్రతీసారిలాగే క్యారియర్ తెప్పించండి' అన్నా. ఆయన వింటేగా. ఇక ఏమి చెప్పను బాబూ మీ బావగారి

వంట'' అని విరగబడి నవ్వి, "నిన్న బీరకాయకూర వండమంటే, నాతో చెప్పకుండా వంకాయి తరిగి గిన్నెలో వేశారుట. అది నాకు తెలీదు. ఏం వెయ్యమంటావ్ కూరలో అని అడిగితే పిండి వెయ్యండి అన్నా; బీరకాయకూర కదా నీరు పోయి గట్టి పడుతుందని. ఇక చూసుకో అన్నయ్యా, ఆయనా వంకాయ కూరలో ఇంత పిండి పోసేరేమో, అది ఆకారానికి పిడకలాగ తయారయింది. రుచీ దాని తాలూకు రుచే వచ్చిందని వేరే చెప్పాలా. పోనీ అదలా వుంచు. పొయ్యి మండటం లేదని గొట్టంతో ఊదటం ప్రారంభించారు. ఎంతలా వూదారో కాని అన్నం పాకమయిపోతే! విస్తట్లో వేస్తే అది పాకిపోతోంది గాని నిలిస్తేగా! మెట్టూరు డాము దగ్గిర వేసింత ఆనకట్ట వేసినా ఆ ప్రవాహం ఆగదు. ఇంక వడియాలు వేయించారు, అవి తిరగట్లో వేసినా నలగబడవు. ఇవాళ కూర పోపుకి నూనె గిన్నెలో వెయ్యకుండా మిరపకాయలు మాడ్చేశారు. అవి మాడిపోయి గొంతు మొదలెట్టాయి. 'ఏం చెయ్యమంటావ్ గొంతు వస్తోంది' అని ఆయన వంటింట్లోంచి కేకలు. 'గొంతు వస్తే ఏం చేస్తారు. పీల్చండి రొంపేమైనా ఉంటే పోతుంది అన్నా. అంతకంటే ఏం చెప్పగలం యీ మూల కూచుని అలాంటి వాళ్లకి. ఇదీ బావగారి వంట భాగోతం'' అని మధ్య మధ్య అభినయాలు చేస్తూ చెప్పింది.

"సరే కాని. ఇంక నీ వంట కట్టిపెట్టవోయ్. హోటలు నుంచి తెప్పించుకొందాం'' అని హనుమంతరావు అన్నాడు.

ఎలాగయితేనేం ఆ రెండు రోజులు గడిపేశారు. మూడో రోజున భోంచేసి తమలపాకులు నములుతూ హాల్లో కూర్చున్నారు.

'ఏమోయ్! పిల్లాడి కళ్లు జబ్బుగా వున్నాయిట. నువ్వేమో ఆ మాత్రలు ఇస్తున్నావుట మంటలు తగ్గడానికి. ఏదో మంచి మందు చూడాలి గాని ఆ మాత్ర లేమిటి. పోనీ మా ఊరు తీసికెళ్ళి వైద్యం చేయిస్తా' అన్నాడు హనుమంతరావు అగ్గిపెట్టి మీద సిగరెట్టు తాటిస్తూ. తన మందునలా తీసిపారేసేటప్పటికి తల కొట్టేసినట్టయింది రామారావుకి. ఇంతలో అగ్గిమీద గుగ్గిలం వేసినట్టు, "అలా నువ్వైనా చెప్పన్నయ్యా వింటారేమో'' అంది భార్య. దీంతో రామారావుకి పట్టలేనంత కోపం వచ్చింది.

"ఏమిటోయ్ అలా అంటావు? మా అబ్బాయి మందు సంగతి నాకు తెలీదు? వాడి కళ్లు పోతాయంటే నాకామాత్రం బాధ్యతలేదూ? పోనీ ఒక్క విషయం. నీ భార్య ఆస్తి విషయమై తగాదా వస్తే నువ్వు ప్లీడరువయి వుండి వకాల్తా ఇంకోళ్ళకిస్తావా? అలాగా మా అబ్బాయి కళ్ల విషయం నేను చూసుకోగలను'' అన్నాడు రామారావు బావమరిదితో.

"ఇంకా నయం. నీ పెళ్ళాం ఆస్తి మీద దావా వేసినవాణ్ణి నా దగ్గరకి పంపించు. వాడికి పంచదార మాత్రలిచ్చి రోగం కుదురుస్తాననలేదు'' అంది సుశీల ఎత్తిపొడుపుగా.

ఇక రామారావుకి పట్టపగ్గాలు లేనంత కోపం వచ్చింది. తాడి ఎత్తున లేచాడు.

"నీకెన్నో మాట్లు చెప్పాను సీరియస్‌గా వున్నప్పుడు వేళాకోళంగా మాటాడొద్దని. నేనెన్ని విధాల ప్రయత్నించినా నీవు మానలేదు" అని రామారావు పెళ్లాన్ని నానా మాటలు అన్నాడు.

అంతా విని సుశీల, "ఏమండీ సామ, దాన, భేద, దండో పాయాలున్నాయి గదా, ఏది ఉపయోగించారండీ నా మీద, నా వేళాకోళం తగ్గడానికి" అంది.

"అమ్మాయి నువ్వూరుకో, అయినా అంత వెకిలితనం కూడదు సుశీ" అని హనుమంతరావు చెల్లెల్ని మందలించాడు.

ఆ సాయంత్రమే, "ఇక్కడే మంచి మందిప్పించవోయి" అని చెప్పి హనుమంతరావు వెళ్లిపోయాడు.

× × × × × ×

ఆర్నెల్లు గిఱ్ఱున తిరిగాయి. సుశీల వేళాకోళాలు తగ్గించినా మానలేదు.

రామారావు అప్పుడే ఆఫీసు నుంచి వచ్చి కాఫీ తాగి పేపరు చూస్తున్నాడు. సుశీలప్పుడే తెల్లటి వాయిలు చీర, నల్లటి జాకెట్టుతో వచ్చింది. "ఏమండీ...." అంది.

"...................'జీ

"మిమ్మల్నేనండీ" అంది కాసేపుండి సుశీల.

"ఏం" అన్నాడు అన్నాడు రామారావు పేపరు ముఖానికడ్డుతీసి. "కొంచెం వేళాకోళం జాస్తిగాని నా పెళ్లానికేం ఐస్ క్రీమ్" అనుకున్నాడు మనసులో.

"మరి...." అంటూ నోటిలో చీర చెంగు నలుపుతూ వూరుకుంది.

"ఏమిటీ చెప్పు" అన్నాడు రామారావు వరాలిచ్చే దేముడి ఫోజులో. సుశీల బుగ్గలు కొద్దిగా ఎర్రపడి చేతులు గులాబీ రంగులెక్కాయి.

"ఇక కాజువల్ లీవు లుండవ్" అంది కాలి బొటనవేల్తో నేల రాస్తూ.

రామారావుకి భార్య ఉద్దేశం అర్థమయింది

"అమ్మా కాజువల్ లీవు అంతే ఏంతమ్మా?" అన్నాడు బాబ్జీ. కాసేపు కంగారు పడి చేతిలో వున్న బకముక్క వాడి నోట్లో పెట్టింది సుశీల మాట మరిపిద్దామని. వాడు అది కాస్తా తాపీగా తినేసి ఇందాకటి

ప్రశ్న రెట్టించాడు.

"అంటే నీకు తమ్ముడు పుడతాడురా" అన్నాడు రామారావు కొడుకుతో. ఆ చిన్న పిల్లాడికి ఏం అర్థం కాకపోయినా అంతా అర్థమయినట్టుగా నవ్వాడు.

"అమ్మా పిచికలు చూడవే" అని చూపించాడు బాబ్జీ.

తలుపు అంచుపైన మొగపిచిక ఆడ పిచిక నోట్లో గింజలు పెట్తోంది. గూట్లో రెక్కలు రాని చిన్న పిచికపిల్ల కిచకిచమంటోంది. ఒక పెద్ద పిచిక వచ్చి గూట్లో పిల్లకి నోట్లో ఆహారం పెట్టింది. రామారావు చట్టున పిల్లాడ్ని ఎత్తుకొని ముద్దు పెట్టుకున్నాడు.

"నీ గడ్డం గుచ్చుకొంటోంది" అని వాడు కిందికి జారాడు.

కాసేపున్నాక సుశీల "మీరు ఉత్తరం రాయండి" అంది.

దేని విషయమో రామారావుకి తెలుసు. "నువ్వు మీ అమ్మా వాళ్ళకి రాయి" అన్నాడు రామారావు.

"నాకు సిగ్గు బాబు" తలవంచి అంది సుశీల.

"మీ అమ్మకి రాయడానికి నీకు సిగ్గయితే, మా అమ్మకి రాయడానికి నాకూ సిగ్గే" అన్నాడు రామారావు.

ఇద్దరూ నవ్వుకున్నారు.

ఇంతలో పెద్ద పిచుకలు రెండూ ఎగిరిపోయాయి. గూటిలోని పిచికపిల్ల పైకి రాబోయి చోటు చాలక ఆ పైనించి నేల మీద పడి రక్తం గక్కుకుంది, ఆ రక్తపు గుడ్డు రక్తపు ముద్దలో గిలగిల కొట్టుకొంటోంది. రామారావు దాన్ని తీద్దామని పోబోయాడు.

సుశీల అతన్ని చెయ్యి పట్టుకొని ఆపి, "పోనిద్దురూ వెధవ పిచ్చిక. ఉత్తరం రాయకపోతే మానారు కాని రాస్తే మాత్రం క్రితం సారిలా రాయకండేం. 'బాబ్జీ' పుట్టేముందు వేవిళ్ళని రాయడానికి బదులు 'మీ అమ్మాయికి డోకులూ, విరోచనాలు వెళ్తున్నాయి, వెంటనే రావలసిం'దని మా అమ్మకి, రాశారుట. దాంతో ఆవిడ ఏ 'కలరా' వచ్చిందోనని గుండెలు గోక్కుంటూ వచ్చింది" అంటూ కిలకిలా నవ్వింది.

చిన్న పిచిక రక్తంలో పొర్లుతూ 'కిచకిచ' మంటోంది. ఇంతలో ఎలా వొచ్చిందో పిల్లి ఒకటి వచ్చి గుటుక్కున కొన ప్రాణంతో వున్న పిచుకను నోట్లో వేసికొని నమిలివేసింది. కళ్లు చెమర్చాయి రామారావు కది చూడగానే. ఇదేమీ చూడకుండానే సుశీల వేళాకోళం ఆడుతూనే వుంది రామారావుతో.

"చూశావా నీ వేళాకోళం మూలాన్న నిండు ప్రాణం బలి అయిపోయింది" అన్నాడు రామారావు అటు తిరిగి. పిచికను చప్పరిస్తున్న పిల్లిని చూడగానే సుశీలకి కళ్ళ వెంబడి నీరు కారింది.

ఆ రాత్రంతా పెద్ద పిచికలు నిద్ర లేకుండా అరుస్తూనే వున్నాయ్.

తరువాత పుట్టింటివాళ్లు సుశీలని పురిటి కోసం తీసికెళ్లారు. కొన్నాళ్ళకి అర్జెంటుగా రమ్మని అత్తవారి వూరి నుంచి ఉత్తరం వచ్చింది రామారావుకి. వెళ్ళాడు. గుడ్ల నీళ్లు కుక్కుకుంటూ అత్తగారు చెప్పింది. సుశీల కనలేక కనలేక మరణించి ఒక మగశిశువును యీ భూమ్మీద వదలి, మళ్ళా ఆ శిశువును మట్టిలో కలిపిన 4,5 రోజులకి చావు తప్పి కన్ను లొట్టోయినంత పనయింతరువాత స్పృహలోకి వచ్చింది అని.

నీరసంగా ప్రక్కమీద పడుకున్న భార్య గదిలోకెళ్ళాడు సీతారామారావు. పచ్చటి భార్య శరీరం కొద్దిగా మాసిపోయి బాలింతరాలి సోయగంతో విపరీతమైన లావణ్యంతో మెరిసిపోతోంది రామారావు కళ్లకి. ఆమె వదనం పై శుష్క హాసం వెలిసింది భర్తని చూడగానే. సీతారామారావు మంచెం పట్టెపై కూర్చుని భార్యని చూస్తూ ఊరుకున్నాడు ఏం మాటాడాలో తెలీక.

ఆమె అతని అరచేతిని తన దోసిలిలోకి తీసికొని "అవాళ మిమ్మల్ని అలా మాటల్లో పెట్టి వేళాకోళం ఆడి ఉండకపోతే పిల్లి పిచికను తినేసే వుండదు. మన పిల్లాడూ మనకి దక్కేవాడు" అంది ముఖం ప్రక్కగా త్రిప్పుకొని.

'దానికీ దీనికీ సంబంధమేమిటి పోనిద్దూ" అన్నాడు రామారావు పైకి మాత్రం, లోపల భార్య చెప్పింది నిజమేమోనని ఆలోచిస్తూ.

"నా వేళాకోళాలవల్లే మన పిల్లాడు దక్కలేదు మనకి. ఆ పిచికలు శపించాయి" అంది అంది సుశీల మళ్ళా.

మళ్లా అప్పటి నించి ఇప్పటి వరకు సుశీల, సీతారామారావుతో వేళాకోళంగా మాట్లాడలేదు.

సామ, దాన, భేద, దండోపాయాలవల్ల సీతారామారావుకి కాని పని పిచ్చుక శాపంతో ఫలించిందా?

*(31-12-1972 ఆంధ్ర వారపత్రిక)*



# అపరంజి పంజరం

రాజారావు చేసిన పనికి ఊళ్ళో సంచలనం నిండుగానే బయలుదేరింది. కొంతమంది ఆశ్చర్యపడినా "కలియుగ మయ్యా ఏం చేస్తాం, ఎప్పటికి ఎవడికేబుద్ధి పుడుతోందో" అని సర్దేసుకున్నారు.

ఇంతకీ రాజారావు చేసిన పని ప్రకృతి విరుద్ధమైనదేమీ కాదు.

ముప్పైతొమ్మిదో ఏట, ఓ పందొమ్మిదేళ్ళ పిల్లని పెళ్ళిజేసుకుని వెంట తీసికొచ్చాడు.

అతని వయస్సుకంటే ఓ నాలుగేళ్ళు పెద్దవాడికి పెళ్ళాం పోయినా, వద్దని పైకి మాత్రం గునుస్తున్నా మెళ్లు విరిచినంత పనిచేసి రెండో పెళ్లివానికి చేసికాని వదిలిపెట్టని ఈ పెద్దలు, రాజారావు పెళ్లి చేసుకున్నందుకు ముక్కుమీద వేలేసుకున్నారంటే కారణం లేకపోలేదు.

14 ఏళ్ల క్రితం రాజారావు ఆ వూళ్ళో మేష్టరుగా ప్రవేశించాడు. రావడం ఒక్కడే వచ్చాడు. ఇన్నేళ్లూ ఒంటరిగానే గడిపాడు.

రాజారావు అందరితోటీ ముభావంగా ఉండటం మూలాన్న అతనికి స్నేహితులు లేరనే చెప్పొచ్చు. వదనం గంభీరంగా విషాదచ్ఛాయలీనుతున్నా, అతనిలో ఏదో అనిర్వచనీయమైన తృప్తీ, స్వచ్ఛమైన, నిసర్గమైన ఆత్మ ఔన్నత్యం గోచరించేవి, తీయని బాధ నుండి ఆనందం అనుభవిస్తున్న వానిలా.

ఏది ఎలా వున్నా రాజారావు పెళ్ళి చేసుకొని రాగానే యువకులుగా చెలామణీ అవుతున్న వారిలో మాత్రం కబుర్లు చెప్పుకోడానికి సావకాశం దొరికింది.

"ఉన్నట్టుండి వీడికేం జబ్బు..."

"ఆ నాకు తెలుసులేరా వీడేం శుకయోగా ఏం?"

ఈ స్థాయిలో సాగాయి సంభాషణలు.

పెళ్లి అయేంతవరకు నన్నే అమ్మాయి ప్రేమించి తీరాలన్నట్టుగా తిరిగి, మిధ్యా సంస్కారం, కుహనా ఉద్రేకాలతో సంఘాన్ని మరమ్మత్తుచేసేవాళ్లలా అభినయిస్తూ చివరికి చటుక్కున తల్లిదండ్రులు అమర్చిన ఓ అమ్మాయిన ఓ పది వేల కట్నంతో స్వీకరించి, మొదటి ఐదారేళ్ల సంసారంతోనే ముక్తి మార్గంలో పడబోయే "వీరికి" రాజారావు గడచిన జీవితంలోని మధుర స్మృతులు, జీవితమంతా వ్యర్థంగా గడిపినా దిగులు పడకుండా ఆశయం నుండి దిగజారకుండా గడుపుకొచ్చిన అతని ఉత్తమ మనస్తత్వం ఎలా అర్థమవుతాయి.

x x x x x x

రాజారావుకి రామేశ్వరంగారికి చాలా సాధారణంగానే పరిచయం అయింది. రాజారావు బి.ఏ. చదువుతున్న రోజుల్లో, ఆయన డిప్యూటీ కలెక్టరు. ఓ డిబేటింగుకు ఆయన ప్రెసిడెంటు. రాజారావు వాక్చాతుర్యానికి ఆయన చాలా "ప్లీజ్" అయ్యాడు. సభ ముగిసేక ఆయన రాజారావుని పిలిచి ఆయాసం వచ్చేటంతవరకు పొగిడి "రేపు మా యింటికోమాటు రావోయ్" అని ఎడ్రసు ఇచ్చాడు.

రామేశ్వరంగారింటికి వెళ్లడంలో రాజారావేమీ ఆలస్యం చేయలేదు. ఆయన్ని కలుసుకున్న మొదటి ఐదారు నిముషాల్లోనే రాజారావు చాలా 'డిసపాయింట్' అయ్యాడు. ఆయన "నువ్వెందుకొచ్చినట్టు" అన్నట్టుగా ముక్త సరిగా మాట్లాడేడు.

కాసేపుండి ఆయన 'వెంకన్నా కాఫీ తీసుకురా" అన్నాడు.

తాపీగా కాఫీ తాగి "ఆ: ఇప్పుడు నీ యిష్టమొచ్చినట్టు మాట్లాడతాలే. నాకు తెలుసు, నేనింతవరకూ ముభావంగా వున్నట్టు. ఏమిటో అప్పుడప్పుడు నేనలా మూడీగా అయిపోతాను. గడచిన పదేళ్ల నించీ నిరంతరం కోర్టు వ్యవహారాలు, సాక్షులు, సమన్లు వీటితో సతమతమయిపోతూన్నా. ఇవాళ నేనెందుకిలా వున్నానో తెలుసా?" అన్నాడాయన.

"నాకెలా తెలుస్తుంది?" అన్నట్లుగా చూశాడు రాజారావు.

"రేపు ఓ జడ్జిమెంటు చెప్పాలి. సాక్షి బలం మీద ఆధారపడి, అంతరాత్మ చంపుకొని శిక్ష విధించబోతున్నా ఓ వ్యక్తికి. ఏదో సుఖం బావుకున్నానని ప్రజల అభిప్రాయం, నేనీ హోదాలో వుండి. లేకపోతే ఏభై ఏళ్ళ వయసులో కోటూ, టై, ఏమిటీ నాకు. ఇవన్నీ మన సంస్కారానికి, నాగరికతకీ మనం అర్పించుకుంటున్న లంచం. ఏమంటావ్?"

"మీ అనుభవానికి, నా వయస్సులోని భావాలకు పొత్తు కుదరనపుడు మీకు నేను సలహాగాని,

నచ్చజెప్పడం కాని చేయబూనడం హాస్యాస్పదం అవుతుంది."

రాజారావు నుండి "సపోర్టు"-ఆశించిన రామేశ్వరంగారికి తీరని ఆశాభంగం కలిగింది ఈ సమాధానంతో.

"పెద్ద కబుర్లు చెప్పక చెబుదూ".

"మీ యీ పొజిషనులో ఏం సుఖం లేదని అంటున్నారు. కడుపు నండిన బేరానికి ఇలా మాట్లాడ్డం ఏమంత కష్టం కాదు. మీ ఆస్తి ఓ బీదవానికి రాసెయ్యండి, పది రోజుల్లో అతనిలో ఎంత ఆముష్మిక భావం, పారమార్థిక చింతన ఏర్పడతాయో మన మూహించలేము. మీరు ఎవరికో శిక్ష వెయ్యడానికి అంతరాత్మ మొదలైన పెద్ద పదాలుపయోగించి వాటితో కుస్తీ పడుతున్నానన్నారు. మీరు ఇన్నాళ్లు ఈ పదవిలో ఉండి అంతరాత్మలు అవీ సజీవంగా ఉన్నాయనుకొని వాటితో సంఘర్షణ పడుతున్నారంటే, మీరు మీ పదవిలోని బాధ్యత అంతా వహించలేదన్నమాట. లేకపోతే మీ బాధ్యత సక్రమంగా నిర్వహిస్తే, మీ యీ అంతరాత్మలు గట్రా ఇన్నాళ్లు నిలిచి వుండడానికి సాధ్యం కాదు. లేదా మీ మనశ్శాంతి కోసం యీ మిధ్యా సత్యాన్ని పలుకుతున్నారు. పైగా మన సంస్కారానికి మన వేషం ఓ లంచం అంటారా? ఏవో పుస్తకాల్లో మాటలు పలుకుతున్నారుగాని, మీ చిన్నతనంలో ఎప్పుడైనా మీరిలా అనుకుంటే ఈనాడు ఈ మాటలు మీరనేవారు కారు. ఏమీ చిన్ననాడు నఖశిఖపర్యంతం మేకప్‌కి, సిల్కు లాల్చీలకు ఎంత కాలం, డబ్బు వినియోగపరచారో లెక్క వుంటుందా?"

"చెప్పేదేదో నా కనిష్టముగా వున్నా ధైర్యంగా చెప్పావు. కాని అది నే వొప్పుకోను."

"నాకు తెలుసులెండి."

"ఎలాగ?"

"ఒప్పుకుంటే మీ వయస్సుని మభ్యపెట్టుకొంటున్నారన్నమాట."

"నువ్వలా డొంకతిరుగుడుగా మాట్లడక తిన్నగా చెప్పు."

"నే చెప్పేదేమీ కొత్తగాదు. తరతరాలుగా సంక్రమిస్తున్నదే. ప్రతి కాలంలో పెద్దవాళ్ళు తమ తరువాత వారసులైన చిన్నవారిని చూసి 'ఇంకేముంది, ఐపోయింది. మాతోనే ఆ రామరాజ్యం పోయిం'దని అనుకుంటూ వుంటారు. అసలు వారి - వీరి ఆచార వ్యవహారాలను తరాజుల్లో పెట్టి తూచడం వల్ల లాభం లేదు. ప్రయత్నించినా ప్రయోజనం శూన్యం."

"నువ్వన్న దాంట్లోనూ కొంత వరకూ నిజం వుందిలే. నా చిన్నప్పటి సంగతులు తలచుకొంటే

ఇప్పుడు నవ్వొస్తుంది. అవన్నీ ఎందుకులే ఇప్పుడు.''

"అవున్లెండి. ఎందుచేతనంటే తమ చిన్నప్పటి సంగతులు మాట్లాడే పెద్దలు ఓ పట్టాన ఆపరు. మొదలు పెట్టకపోవడమే మంచిది.''

"నేనీ హోదాలో వున్నానని అందరూ ఒదిగి మాట్లాడేవాళ్ళే. వాళ్ల మిథ్యా వినయంతో విసిగెత్తిపోయింది. నీలాగ స్వేచ్ఛగా, స్వచ్ఛంగా, మాట్లాడేవాళ్ళు తక్కువ. మా సరోజకెంతసేపూ సినిమాలు, అలంకరణ తప్ప నా బాధ అర్థంచేసుకోదు'' అని నిట్టూర్చేడు రామేశ్వరంగారు.

ఇంతలో "నాన్నా, నాన్నా'' అంటూ ఓ పిల్ల లోపలికొచ్చి రాజారావుని చూసి ఓ క్షణం ఆగి, అతన్ని గుర్తించినట్టుగా ఓ విసురుతో ముందుకొచ్చి, రామేశ్వరంగారిని ఉద్దేశించి "ఇవాళ సినిమాకి వెళ్దామండీ'' అంది ఆయన గుండీ తిప్పుతూ.

"సరేలే అమ్మా'' అని ఆయన "మా అమ్మాయి సరోజ'' అన్నాడు రాజారావుతో.

సరోజకి పదునాలుగు, పదిహేనేళ్ళు వుంటాయి. వుంటే పదహారూ ఉండొచ్చు. ముగ్ధత్వం మొహంలోనూ, వోణీ తీరులో, మాటలో ప్రతిఫలిస్తుంది. మందారం మొగ్గలా చిన్న నోరు. విశాలంగా సోగదేరిన కళ్ళు. మొహంలో నెత్తురెక్కువ. తలపై జుట్టు తక్కువ.

ఉన్న జుట్టునే వెనక్కి విరిచి కిరీటంలా అమర్చి, మధ్యలో జడ ఆపి జుట్టుని ఎట్టిటి పేలికతో వదులుగా ముడేసి, చెవుల పైకి జుట్టు వదిలేసి - అబ్బో, ఇంకా రకరకాలు ఫీట్సు చేస్తుందామె జడతో.

సిగలో పువ్వులలంకరించిన తీరూ, కంటికి కాటుక రీతి, చాలా ఆకర్షణీయంగా వుంటాయి - అలకరించి నవ్వుతున్నట్లు పువ్వులు, సన్నగా, బంగారు తీగలా అంటీ అంటనట్టుగా వుండే కాటుక "ఎంత నేర్పు'' అనిపింపజేస్తాయి.

కంట్లో పుట్టుమచ్చ, నవ్వితే బుగ్గ సొట్ట బావుంటాయి.

ఆ సాయంత్రం రామేశ్వరంగారు "రోజూ వస్తూ వుండవోయ్'' అని పదిసార్లు చెప్పి మరీ సాగనంపాడు రాజారావుని.

ఆ తరువాత రాజారావు రామేశ్వరంగారింటికి రోజూ వెళ్తూనే వుంటాడని ఇంత వరకు చదివినవారు చెప్పగలరు. దానికి కారణం సరోజ అని అనుకుంటే మాత్రం వారికి కొంచెం ఆశాభంగం కలగక తప్పదు.

వీరిద్దరి మధ్యకి వచ్చిన ఆ పిల్ల "ఏమిటీ వేదాంత ధోరణి'' అన్నట్టు వ్యవహరించేది. రాజసం ఉట్టిపడేట్టుగా మాట్లాడేది. రాజారావుని ఖాతరు చేసేది కాదు. వయస్సు మించిన ఆరిందాతనానికి

పోబోయి తప్పటడుగు వేస్తుండేది.

రాను రాను రాజారావుకి "ఈ పిల్లకి మా దగ్గరకి రాకపోతే బావుండు" నన్న స్థితికి వచ్చాడు.

వాళ్లు మాట్లాడుకుంటుంటే సరోజ వాళ్ల దృష్టి మరల్చడానికా అన్నట్లు 'నాన్నా-ఈ పాఠం చెప్పండి' 'ఈ లెక్క చెప్పండి' అంటూ అడ్డు తగిలేది.

"ఎక్కాలే మర్చిపోయా. నేను లెక్కలు చెప్పడమేమిటి. నువ్వు చెప్పవోయ్" అనేవారు రామేశ్వరంగారు రాజారావుతో.

రాజారావు చెప్పడం మొదలెట్టగానే, సరోజ "నువ్వు చెపితే నేను వినడమేమిటి" అన్నట్లు సంచరించేది.

రాజారావుకి ప్రేమ, విరహం మొదలైనవేవీ పుట్టుకురాలేదు సరోజ పరిచయంతో.

క్రమంగా ఆమెకి రాజారావుచేత పాఠం చెప్పించుకోడం ఓ ఆటలా తయారయింది. అతడు చెప్పడం మొదలెట్టగానే ఆమె అతన్ని చూసేదికాదు, వినేది కాదు. మూర్తీభవించిన మూకీ భావంతో నిండినట్లుగా వుండేవి ఆమె కళ్లు, నేర్చుకొందామనే ఆసక్తి చూపించకపోవడం సరిగదా, అతన్ని ఏ విధంగా గెలిచేద్దామా అన్నట్లుగా చలించేవి. చెప్పాలనే తప్పు సమాధానం చెప్పి రైటని వాదించేది. అతను కోపగించుకోవడం ఆమె కానందం.

ఇదంతా ఆమె ఎంత పెద్దమనిషి తరహాగా వ్యవహరించదలచినా, ఆమె చిన్నతనపు తాలూకు చిలిపితనం నుండి సంక్రమించినదని, రాజారావు గ్రహించడానికి అట్టే కాలం పట్టలేదు.

అందుచేత రాజారావు ఆమెను సానుభూతితో సహించాడు.

సరోజ అతని మీది విజయానికిది ప్రథమ సోపానమనుకొంది.

× × × × × ×

ఒక రోజు సాయంత్రం రాజారావు, రామేశ్వరంగారు మాట్లాడుకుంటూండగా "బాబూ మీ కోసం ఎవరో వచ్చారు" అన్నాడు వెంకన్న

"క్రిందకెళ్లి చూసి వొస్తా వుండవోయ్" అని రామేశ్వరంగారు కిందకెళ్లారు.

ఇంతలో "ఈ లెక్క చెప్పండీ" అంటూ సరోజ వచ్చింది.

లెక్క చేసి ఆన్సరు చూడమన్నాడు రాజారావు.

"తప్పు" అంది సరోజ.

"ఏదీ ఆ పుస్తకం"

"చూసుకండి" పుస్తకం మీద నుండి చేయి తీయకుండానే సమాధానమిచ్చింది సరోజ.

ఆన్సరు చూడడానికి వంగిన రాజారావు దృష్టి పుస్తకం మీద లేదు. మెత్తని, నునుపైన ఆమె చేతి మీద పడి అలాగే వుండిపోయి, తలెత్తి చూశాడు.

పసిడివర్ణంతో మెరుస్తూన్న వదనంలోని ఆమె కళ్లు కనుబొమల కింద విశాలంగా పరుచుకొని, కణతలమీదపడే జుట్టుని తాకుతూ, కన్యాత్వపు ముగ్ధరోచిస్సులను వెదజల్లుతున్నాయి.

రాజారావు చట్టున ఆమె రెండు చేతులూ తీసికొని రావలిసినంత దగ్గరగా వచ్చి వీలయినంత దగ్గరగా ఆమెను చుట్టివేశాడు.

మృదువైన ఆమె చెక్కులపై మొదటిసారిగా రెండు పెదవులానాయి.

ఈ ఆకస్మిక సంఘటనతో ఇద్దరూ స్తంభించిపోయారు. అతడు వెనక్కి జరిగాడు. ఆమె పైట సద్దుకుంటూ దూరంగా జరిగింది. ఇద్దరూ సిగ్గుపడ్డారు. ఇద్దరికీ మాట్లాడ్డానికే ధైర్యం లేదు.

ధైర్యం చేసి రాజారావే ఏదో లెక్క చెబుతూన్నట్లుగా గొణిగాడు.

ఆమె వినడం లేదని అతనికి, అతడు సరిగా చెప్పడంలేదని ఆమెకు పూర్తిగా తెలుసు.

ఈ తతంగం రామేశ్వరంగారు రావడంతోనే ఆగింది.

రాజారావు ఉన్నంతసేపూ సరోజ ఓర కంటితో అతన్ని ఆశ్చర్యంగా, కుతూహలంగా చూసింది - మొదటిసారిగా సానుభూతితో గూడ.

అతడేదో అర్థం లేకుండా రామేశ్వరంగారితో మాట్లాడి వెళ్లిపోయాడు.

సరోజ గబగబా అద్దంలో ప్రతిరూపం చూసుకొంది.

ఆ దృశ్యం జ్ఞాపకం వచ్చి ఆమె చెక్కులలో రక్తము పోటెక్కి మెడ క్రింద భాగం దాక ప్రవహించి నల్లటి జుట్టు పాయల్లో కలిసిపోయింది.

అసలే అందమైన రూపమేమో, లజ్జా సంభ్రమాలతో కించి దరుణకాంతి దాల్చిన ఆమె వదనం ఆమె

కళ్లకే వింతగా, అందంగా తోచింది.

మళ్ళా సిగ్గుపడింది.

నవ్వుకొంది.

బుగ్గ సొట్టబడింది.

'ఎంత బావున్నాను' అనుకొంది.

సరోజ ఇంట్లోకి వెళ్లి మామ్మతో పరాచికాలాడింది. మెడ పట్టుకు వేళ్లాడింది.

"అసలే ముసిలిముండనే, వూరుకోవే" అంది ముసిలావిడ.

రాజారావు కృంగిపోయాడు. అతని దృష్టిలో అతనే పదిరెట్లు దిగజారిపోయాడు. పది రోజుల పాటు రామేశ్వరంగారింటికి వెళ్లలేదు - ముఖం చెల్లక.

ఓ రోజు రామేశ్వరం కారులో పోతూ రాజారావుని చూసి ఆగి "రావడం లేదేమోయ్ ఈ మధ్య. ఓ మాటు రా. పరీక్షలా ఏమిటి" అన్నారు.

"ఊ" అని గొణిగాడు రాజారావు.

ఆయన వెళ్లిపోయాక 'నవంబరులో పరీక్షలేమిటి' అనుకుని నవ్వుకున్నాడు.

సరోజ ఇంట్లో ఆ సంగతి చెప్తే దానితాలూకు ఫలితం ఊహించుకొని అది అనుభవించడానికి సిద్ధపడే రాజారావు రామేశ్వరంగారింటికి వెళ్ళాడు.

అంతా సాఫీగానే సాగిపోయింది.

కాసేపున్నాక సరోజ వచ్చింది. మునుపటి చిలిపితనం లేదు. ఆమెను చూసినప్పుడల్లా మహాపరాధం చేసినవానిలా పశ్చాత్తాపపడుతున్నాడు రాజారావు. ఇద్దరి కళ్లు కలుసుకోకుండా మాత్రం జాగ్రత్తపడ్డాడు.

మళ్ళా రోజూ రావడం ప్రారంభించిన రాజారావు సరోజతో మాత్రం మాట్లాడలేదు.

× × × × × ×

ఆదివారం.

ఉదయమంతా వర్షం కురిసి మధ్యాహ్నం పెళ్లున ఎండ కాసింది.

రాజారావుకేమీ తోచక రామేశ్వరంగారింటికి వెళ్లాడు.

సరోజ పచ్చటి పసుపు పచ్చని చీర కట్టుకుంది.

వళ్ళేదో, చీరేదో తెలియకుండా మెరిసిపోతుందామె. నీలిరంగు జాకెట్టు.

"ఓమాటు మా తోటలోకి వెళ్దాం" అన్నారు రామేశ్వరంగారు.

ఊరికి దూరంగా ఆయనో బంగళా కొని వెనకాల తోట వేయిస్తున్నాడు.

"రిటైరు అవగానే ఇక్కడే సెటిల్ అవుదామని వుందండీ" అన్నారాయన, కారు దిగుతూ తనతో వచ్చిన ఇంకో పెద్దమనిసితో.

బంగళా వెనకాల విశాల ప్రదేశంలో తోట ఆకర్షణీయంగా వుంది. తోటమాలి రంగన్న నమస్కారం చేసి నమ్రతతో నుంచున్నాడు.

'మొన్న తెప్పించిన మొక్కలు నాటావా" అంటూ రామేశ్వరంగారు "మీరు తోట చూసి రండోయ్. అమ్మాయి చూపిస్తుంది. నేనీయన్తో చదరంగం ఆడుతూ వుంటాను" అన్నారు.

సరోజ, రాజారావు దూరంగా తోట చూసేవారిలా పోయారు. ఇట్లా ఇద్దరూ ఉండడం సంభవించకుండా వుండాలని రాజారావెంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. ప్రక్క ప్రక్కను నడుస్తున్నా ఒకరినొకరు చూసుకోవడం లేదు.

ఇన్నాళ్లూ అతన్ని ఓ కంట కనిపెడుతూనే వుంది - ఆశతో, ఉత్సాహంతో వేచి వుంది.

దేనికి?

సమాధానం స్పష్టంగా ఆమె చెప్పలేకపోయినా అజ్ఞాతంగా నీడలా వెన్నంటుతూ ఆభాసగా మాత్రం గోచరిస్తున్న మనోజ్ఞమైన ఓ ఊహతో ఆమె వివశత్వము పొందుతూంది.

ఇన్నాళ్లూ ఆ తలపుతోనే మొహమంతా కెంపువార పెదవుల్లో అమృతాలూరుతుండగా సరోజ - ఆ మధుర సన్నివేశం కోసం ఉవ్విళ్లూరుతూ 'తనని అతడు మళ్లా చేతుల్లోకి తీసికొని లాలిస్తే' అన్న ఊహతో

ఎదురుచూస్తోంది.

రాజారావు మాత్రం చేసినపనికే పశ్చాత్తాపపడి, మళ్లీ ఆ వూహ గూడ దగ్గిర జేరకుండా జాగ్రత్తపడ్డాడు.

అకస్మాత్తుగా ఆమె అతని చేతిని తన చేతిలోకి తీసికొంది. తెల్లబోయి రాజారావు ఆమెకేసి చూశాడు. అర్ధనిమీలితములైవున్న ఆమె నీలి కళ్లలోని నూతనోత్సాహం, వింత ఆకర్షణ రాజారావు గ్రహించాడు.

బరువుగా వచ్చే ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలలో ఆమె గుండెలదురుతున్నయ్; పెదవులు వణుకుతున్నాయ్.

మెరుపు మెరిసినట్టుగా సరోజ ఒక్క మాటు రాజారావు వేపు తిరిగింది. మరో క్షణంలో ఆమె తల అతని హృదయంపై ఆన్చి, చేతుల్తో రాజారావు జుట్టు సవరిస్తూ "రాజా..." అని మాత్రం వూరుకొంది.

రాజారావామెనర్థం చేసుకొన్నాడు. వారిద్దరూ ఒకరి చెవులో ఒకరు వినీ వినపడకుండా రకరకాల బాసలు, వింత వింత వాగ్దానాలు చేసుకొన్నారు. ఒకరినొకరు అలరింప చేయడానికి లక్ష ప్రయత్నాలు. ఎన్నో తీయని ఊహలు మనసులో మెదుల్తున్నా, సంతోషంతో ఉక్కిరిబిక్కిరయి సరోజ మాట్లాడలేకపోయింది. ఈ మధుర మైన సన్నివేశం కలగా మారిపోతుందేమోనని, ఆ భయం రెండో వారికి తెలీకుండా వుండేందుకు ఏవో సగం సగం సంభాషణలు.

మధురమైన లజ్జా, సంకోచాలతో వారి ముగ్ధ ప్రణయం సాగింది.

"నాన్నగారి దగ్గరికెళ్దాం" అంది సరోజ చివరికి సిగ్గుతో.

రామేశ్వరంగారు వీళ్ళు వెళ్లేటప్పటికి చదరంగం ఆడుతున్నారు. ఆయన ఆట నెగ్గాలని మహ ఉబలాటం. తనకంటే తక్కువ ఆటగాణ్ణి చూసుకునే మరీ ఆటలో దిగుతాడు.

"ఇంక అలా రాలేకపోయానోయ్, కాలక్షేపం వుందిగా. బెస్ట్ ఆఫ్ త్రీ వేశాం. వసరగా రెండాటలు కట్టేశాలే" అన్నారాయన.

× × × × × ×

**కొం**తమందికి అకారణంగా మొదటి చూపులోనే ఒక్కో మనిషి మీద సదభిప్రాయం ఏర్పడదు. దానికి కారణం ఇది అని వారే చెప్పలేరు. ఆ మనిషిని ఏవగించుకోవడం మాత్రం మానరు.

సరిగ్గా అలాగే జరిగింది రాజారావు విషయంలో.

రామారావు ఎందుకో రాజారావుని చూడగానే ముఖం చిట్లించుకున్నాడు. రామారావు రామేశ్వరంగారి భార్య తమ్ముడు. నలభై ఏళ్ళుంటాయి. పోలీసు ఇనస్పెక్టరు చేస్తూ "డిస్మిస్" అయి పెద్ద ఎత్తులో వ్యాపారం చేస్తున్నాడు.

రామారావుకి వచ్చిన రోజునే రాజారావు, సరోజ అంత దగ్గరగా కూచోడం సబబనిపించలేదు.

రాజారావు వెళ్ళిపోయాక "ఎవరండీ అతను" అన్నాడు రామారావు.

"బి.ఏ. చదువుతున్నాడు. స్వతంత్రాభిప్రాయాలున్నవాడు."

"వాటికేంలెండి. చదువుకునే రోజుల్లో, బోలెడు ఉంటాయి. కులం, గోత్రం గట్రా" అని నసిగాడు రామారావు, మన హోదాకి తగినవాడేనా అని స్ఫురించేలా. రాజారావుతో ఇన్నాళ్ల పరిచయంలోను రామేశ్వరంగారు ఈ విషయాల ప్రసక్తే తీసుకురాలేదు.

త్వరలోనే రామారావు తన పని కుపక్రమించి అవసరమైన చర్యల్లోకి దిగాడు. రాజారావు తల్లిదండ్రులు చిన్నప్పుడే పోయారని, మేనమామ పెంచాడని, ఆస్తి వగైరాలు అంతంతగా వున్నాయని, మొదలైనవన్నీ, కష్టపడి తెలుసుకొన్నాడు. సమయం దొరికినప్పుడల్లా వీటికి చిలవలూ పలవలూ తగిలించి రామేశ్వరంగారి చెవిలో జాగ్రత్తగా వూదడంలో విశేష ప్రజ్ఞ చూపించాడు, తను చెప్పేది నేరమల్లేకాకుండా, ఉన్న 'ఫేక్టు' చెబుతున్న వానిలా.

ఇదంతా సరోజలాంటిదాన్ని రాజారావు తన్నుకుపోతున్నాడనీ కాదు అతని దుగ్ధ. ఎందుచేత ఇంత 'కూపీ' రాజారావు విషయంలో తీసి, అతడిని సరోజని వేరుచేయడానికి ప్రయత్నిస్తున్నాడో రామారావుని సూటిగా అడిగినా చెప్పలేడు.

మెల్లిగా అక్కగారితోనూ, ముసిలావిడతోనూ రాజారావునిగురించి ఊదడంలో రామారావేమీ ఆలస్యం చేయలేదు. అక్కగారు అర్థంకానట్టు ఉదాసీనంగా ఊరుకోడంతో, రామారావుకి ముసిలావిడవద్ద మంచి 'సపోర్టు' ఆశించినవిధంగా లభించింది. అదే చాలుననుకున్నాడతను. అప్పుడప్పుడావిడ సరోజని సూటీపోటీగా అంటూ వచ్చింది.

× × × × × ×

సినిమాకు వెళ్ళబోతున్న సరోజని చూసి ముసిలావిడ 'అంత సింగారింపు దేనికో' అని బుగ్గలు నొక్కుకుంది. సరోజ తెల్లబోయి 'నీకెందుకు' అన్నట్టుగా నవ్వి వెళ్లిపోయింది.

రాత్రి సినీమాకి వెళ్లింది సరోజ.

తెల్లవారి లేవగానే వాతావరణం అంతా సుముఖంగా లేదని గ్రహించింది.

కారులో ఒక్కతే వెళ్లిందామె. ఈ వాసన తగలగానే రామారావు వెంటాడాడు.

రాజారావు, సరోజ ఒక్కచోటే కూచున్నారు.

కూచోడానికి కూడా మనస్కరించక వళ్లంతా జెల్లులు పాకినట్టు అయి రామారావు సినీమాలోంచి బయటకు వచ్చేశాడు.

వాళ్లిద్దరు సినీమాలో 'కాజుయల్'గా కలుసుకొన్నారు. అలా అని సాక్షాత్తు భగవంతుడొచ్చి చెప్పినా నమ్మదలచుకోలేదు రామారావు.

"బాగానేవుంది వరస. ఈడొచ్చినపిల్ల. రాత్రిళ్లు షికార్లా. మా రోజుల్లో ఎరుగుదుమా" అని నోరు నొక్కుకొని నోరు పారేసుకొంది నాయనమ్మ. చాటుగా పిల్చి, "అదేమిటే, ఒక్కతవీ సినీమాకి వెళ్తే ఏం బావుంటుంది చెప్పు. పోనీ నాన్నగారు రానంటే మామయ్యతో వెళ్ళలేకపోయావా. బావుండదమ్మా అలా" అని తల్లి మెత్తగా మందలించింది.

అసలు రభస రాజారావు రామేశ్వరం గారు మాట్లాడు కొంటూంటే సరోజని, అక్కడికి వెళ్ళొద్దని ముసిలావిడ శాసించడంతో బయలుదేరింది.

"వాళ్లు మగవాళ్లు. నీకక్కడేంపని" అంది తల్లి.

వీరిద్దరికీ నాయకత్వం వహించి గస్తీ కాస్తూనే వున్నాడు రామారావు. ఆ రాత్రి చాలా గొడవ చేసింది సరోజ. తండ్రితో గోముగా ఫిర్యాదు చేసింది.

అందరూ పడుకొన్నాక రామారావు, బావగారికి అసలు విషయం నచ్చజెప్ప ప్రారంభించాడు.

"దీంట్లో ఏముంది. వాళ్లిద్దరికీ ఇష్టమైతే పెళ్లిచేసేద్దాం" అన్నారు రామేశ్వరంగారు.

"మనం చేసేదేముంది బావగారూ, ఇంకో రెండు రోజులుంటే మన ప్రమేయంలేకుండా ఎక్కడికయినా వెళ్లి వాళ్లే జేసుకోగలరు."

దీంతో రామేశ్వరంగారికి చాల కోపం వచ్చింది.

"ఏమిటోయ్ నీవనేది ఇంతకీ. చాలా దూరం తీసుకువెళ్లేవు వ్యవహారం. రాజారావు అలాటి వాడు

కాదు, పిల్లని లేవదీసుకుపోవడానికి''

"లేకపోతే రాత్రిళ్లు షికార్లు, సినీమాల దాక ఎందుకు వెళ్తుందండీ పరిస్థితి. అతడా మన శాఖవాడు కాదు. ఈ పెళ్లి మనం ఎలాగు ఒప్పుకోము. సరోజా చిన్నపిల్ల. దాన్ని మాయజేసి బుట్టలో వేసుకున్నాడు. ఇక అడ్డేమిటి, ఇద్దరూ ఉడాయిస్తే మనం తల తిప్పుకోగలమా?''

రామేశ్వరంగారికి శాఖ మాట అటుంచి తన్ని లక్ష్యంచేయకుండా తన ఎదుటే రాజారావు సరోజతో తిరుగుతున్నాడంటే ఆయన హృదయం గాయపడింది. ఆయన అహానికి తీవ్రంగా దెబ్బ తగిలింది. "నన్ను తిన్నగా అడక్కూడదు? పిల్ల దాన్తోనా మంతనాలు '' అని మండిపడ్డాడు.

రాజారావుని పిలిచి విషయం కదిపి, కడుపులో ఆగక, కొంచెం దురుసుగానే మాట్లాడేడు. రామేశ్వరం గారు. అతని సమాధానంతో అసలు వ్యవహారమంతా బెడిసికొట్టింది.

"మన ఇన్నాళ్ల పరిచయంలోనూ మీరింత సంకుచిత అభిప్రాయాలతో వున్నారని తెలీలేదు. మీ అమ్మాయిని వల్లో వేసుకోడంగాని, తీసుకు పోవడంగాని నా ఉద్దేశాలు కావు. అసలు మీరు ఒక్కమాటుగా ఇలా మాట్లాడుతున్నారంటే నేనూహించుకోలేకపోతున్నాను. ఒక్కమాట చెప్తా మీరే ఆలోచించండి. నిజంగా అలాంటి ఉద్దేశాలున్న ఏ ఇద్దరినైనా మీ రాపగలరా? అసలు ఇలాటి అవకాశం రాకమునుపే వారు గైరు హాజరవడం పరిపాటేగా?''

"కొంచెం జాగ్రత్తగా మాట్లాడవోయ్ రాజారావు. ఇలాంటి సమయాల్లో పళ్లు బిగించి ఇంకొకరిని గురించి మనస్తత్వవేత్తలా మాట్లాడితే ప్రయోజనం లేదు. నీ ఉద్దేశం ఏమయినా నన్ను లక్ష్యం చేయకుండా మీ వేషాలేమీ నాకు నచ్చలేదు. షికార్లు, సినీమాలు, ఉత్తరాలునా?''

"మీరన్న వేషాల్లో ఏ ఒకటీ మేము మనస్ఫూర్తిగా చేయలేదని చెప్తున్నా. మీరు మనిషి తత్వం ఊహించుకోకుండా మాట్లాడుతున్నారనడానికి ఈ ఉదాహరణ చాలు. అసలు అటువంటి పనులు చేసేవాడు మీ అనుజ్ఞ తీసికొని మీ అమ్మాయితో జరపమనా? మీరు నా మీద తెచ్చే అభియోగాలన్నీ నిరాధారాలని చెప్పనవసరంలేదు. ఒక్కటి మాత్రం గుర్తుంచుకోండి. మీరు చెప్పినట్టుగా మీ అమ్మాయిని వల్లో వేసుకొని అలాటి వ్యవహారాలు జరపగల్గినవాడు మీలాంటి వాళ్ల కళ్ళు చాలా సులభంగా కప్పగలడు. మీకీ అవకాశమే కల్గించడు.''

ఈ సమాధానంతో రామేశ్వరంగారికి అరి కాలిమంట తలకెక్కింది.

"ఆలోచించినందుకు కళ్ళు నెత్తిమీదికెళ్ళేయే. పూటకి ఠికాణా లేదుగాని, కబుర్లెక్కువ. నీ కిచ్చేదేమిటోయ్ మా అమ్మాయిని, ఇక దయచేయి'' మధ్యలో అందుకొని రామారావన్నాడు. రామేశ్వరంగారు

'మౌనం అర్ధాంగీకారం' అన్నట్టుగా వున్నారు.

"నేను మొదటిరోజునే చెప్పాను. మీ యీ వేదాంతం అంతా అవసరాలకోసం ఉపయోగించుకొంటూన్న మిధ్యాసృష్టి అని. అసలు రూపం ఇలాంటి సమయాల్లోనే బయల్పడుతుంది. మీ రనుకొంటున్నది మీరే చెప్పగూడదూ, ఎవరిచేతో అనిపించడమెందుకు. సరిపోయిన హోదా వుందో లేదో అని ముందే చూసుకొని మీ అమ్మాయిని ప్రేమించాలన్నమాట. పోనీ నాకు ఆస్తి లేకపోతే మీరు నాకో ఏభై ఎకరాలు రాసిచ్చి పెళ్ళిచేయగూడదు?" ఈసారి, రాజారావు మాటలలో వెటకారం స్పష్టంగా కనబడింది.

"అంత దాతృత్వం చూపించడానికి సరిపోయే పెద్దలిక్కడలేరు. ఇక నువ్వీ గుమ్మంతొక్క నవసరంలేదు" ఈ సమాధానం రామేశ్వరంగారే నిష్కర్షగా చెప్పి వెళ్ళిపోయారు.

రూముకి వెళ్ళినతర్వాత రాజారావు మనస్సులో తుఫాను రేగింది. ఆవేశంతో నోటికొచ్చినట్లు మాట్లాడేసినందుకు నొచ్చుకొన్నాడు.

సరోజ తనకి దూరమవుతుందేమో ననుకునేటప్పటికి అతని హృదయం పగిలిపోయింది. తన ఆశ, జీవం, సర్వస్వం అయిన సరోజని తలచుకొని కుమిలిపోయాడు.

రామేశ్వరంగారిని బ్రతిమాలయినా, క్షమాపణ కోరయినా, సరోజని తనదానిగా చేసుకోవాలి అనుకున్నాడు.

ఆ తలపుతోనే వెళ్ళాడు.

రాజారావుని చూడగానే "పనిమీద వచ్చినట్టున్నారు" అన్నారు హేళనగా రామేశ్వరంగారు.

అతని కళ్ల ముందు సరోజ మెదిలింది. ఆవేశం అణుచుకొని, "నేను చెప్పినదాంట్లో తప్పేమీ లేదని చెప్దామని వచ్చాను. మీ అమ్మాయిని మనస్ఫూర్తిగా ప్రేమించాను. అది చెప్పడంలో దురుసుతనంగా ప్రవర్తిస్తే క్షమించాలని కోరుతున్నా. మా పెళ్లికి మీ ఆశీర్వాదంతో కూడిన అంగీకారం కోరడం కోసం వచ్చాను" అన్నాడు.

"లేదు బాబూ! అలా వీల్లేదు" అని సన్నగా పెదాల చాటున నవ్వుకొన్నాడాయన.

"బాగా ఆలోచించి నిశ్చయంగా చెప్పండి. అదే నా కోరిక."

"ఇక వాదాలతో కాలం గడపదలచుకోలేదోయ్. ఈ విషయంలో నువ్వు బాధపడి లాభంలేదు" అన్నారాయన.

× × × × × ×

"నేనింకొకరిని చేసుకోను నాన్నా. నా కసలు పెళ్లే వద్దు అలా అయితే" అని చిందులు తొక్కింది, సంగతి తెలిసిన సరోజ, అలవాటయిన గారంతో.

రెండురోజులన్నం మానేసింది. కోపం ప్రదర్శించటంలో లోటేమీ చేయలేదు.

"నాన్నగారూ, మనకున్నది చాలదూ అతనికి లేకపోతే" అని బ్రతిమలాడింది.

రామేశ్వరంగారు ఏ కళనున్నాడో వినీ వినగానే మండిపడ్డాడు. "నీ నిరసనవ్రతాలు అవీ ఉపయోగం లేదమ్మాయ్. నాదగ్గర మాళ్లా ఆ ప్రస్తావన రానీకు."

ఆయన్ని ధైర్యంగా సరోజ "నేనతన్నే చేసుకుంటా" నన్నా ఆయన కింత కోపమొచ్చేది కాదు. తన్నేదో సాధించాలన్నట్టు కూతురు చేసే సత్యాగ్రహం ఆయనకి చిరాకెత్తించింది. "నేనసలు పెళ్లేచేసికోనలాగయితే" ఆఖరిసారిగా అంది సరోజ.

"చేసికోక ఏ గంగలోనైనా దూకు" రామేశ్వరంగారి కనుకొలకుల్లోని ఎరుపు నామె భరించలేకపోయింది.

అల్లారుముద్దుగా పెరిగిన సరోజకీతిరస్కారం సమ్మెట పోటులా తగిలింది. రాజారావు, తనూ అల్లుకొన్న సుందర స్వప్నాలు, అతనిలో తాను రచించుకొన్న అమృతగానాలూ భగ్నమయిపోతాయనుకొనగానే ఆమె తట్టుకోలేకపోయింది. తనని ప్రాణానికి ప్రాణంగా చూసుకొనే రాజారావు దూరమవుతాడనగానే ఆమె సుకుమార హృదయం తల్లడిల్లిపోయింది.

'నాన్నగారి నెలాగయినా ఒప్పించగలను' అనుకున్న ఒక్క ఆశ కూడా దూరమవగానే సరోజకిక గత్యంతరం లేదనుకుంది.

పైగా ఆయనే అన్నాడు "ఏ గంగలోనైనా దూకు" అని.

'ఎందుకు దూకకూడదు' అనుకొంది.

అంతే............. దూకింది.

దొడ్లో నూతిలో సంజవేళ వెలుగుచేకట్లు పెనుగులాడుతున్న సమయంలో.

× × × × × ×

రోండోరోజు శవం తేలడంగాని, ఇంట్లో వాళ్ల ఆర్భాటాలు గాని ఏవీ జరగలేదు.

ఇన్నాళ్లనుండీ జరుగుతూన్న భాగోతం కడుపు నిండా చూస్తూ హర్షిస్తూనే వున్నాడు రామారావు. సరోజపై ఓ కన్ను వేసి ఉంచాడు.

రామేశ్వరంగారు సరోజతో కఠినంగా మాట్లాడిన రోజున ఆమె కనుచీకటి వేళ దొడ్లోకి వెళ్తూంటే అనుమానపడి వెంటవెళ్లాడు.

గిలకనూతి తాడు చేతులకి కట్టుకొని నూతిలో దిగుతూన్న సరోజని చూసి అంతమనిషికి అమాంతం కంగారెత్తి గావుకేక లెట్టాడు. ఇంట్లో పనిచేస్తూన్న నౌకర్లువచ్చి పైకి తీసేరు.

"ఎంత గండం తప్పిందీ. నీళ్ళు తోడుతూంటే తాడు చేతి కడ్డంపడింది. అంతే. కాళ్లు పైకి లేచిపోయాయ్" అని వీలయినంతదూరం వినబడేటట్టుగా వీధిలో కొచ్చి కేకలెట్టాడు, పరువు ప్రతిష్ఠ అసత్యాలతోనూ, ఆడంబాచారంతోనూ ఇన్నాళ్లూ నిలుపుకొచ్చి అనుభవం గడించిన రామారావు.

అసలు సంగతి తెలిసి నాయనమ్మ నెత్తి నోరు బాదుకొని "మన ఇంటా వంటా లేవే. ఈ పనులేమిటే" అంది ఎవరికీ వినపడకుండా.

రామేశ్వరంగారికి ఈ పరిస్థితుల్లో రామారావు మాటలు బాగా తలకెక్కాయి.

"బావగారూ మీ రంతలా బాధపడక్కరలేదు. ఏదో చిన్నపిల్ల, వాడి ప్రోత్సాహంతో చిలిపిగా ప్రవర్తించింది. స్కూలు మానిపించి వాణ్ణి కలుసుకోకుండా చేయండి. రాజా లాంటి సంబంధం నే తీసుకొస్తా రెండు రోజుల్లో" అన్నాడు.

ఇన్నాళ్ల నుండి ఆఖరి తరుణోపాయంగా కన్పిస్తూన్న ఒక్క ప్రయత్నం చేయడానికి రామారావు వెళ్లిపోడంతో సరోజకి వీలుచిక్కింది.

రాత్రి పన్నెండు గంటలకు తెగించి రాజారావు రూముకి వెళ్లింది.

తలుపు తెరవగానే కొద్దిగా శబ్దం చేస్తూ తలుపు ఓరగా తెరచి వుంది.

గదంతా చీకటిగా వుంది. మూల ఓ గుడ్డి దీపం వెలుగుతూంది.

తల టేబిల్ పైన అన్చివున్న రాజారావు తలుపు శబ్దంతో తలెత్తి దీపం హెచ్చించి వెనక్కి వంగాడు.

సంస్కారంలేని జుట్టు, శుష్కవదనం - రూపమే మారిపోయిన అతణ్ణి అంత సులభంగా

గుర్తుపట్టలేకపోయిందామె.

ఒక్కమాటు అతన్ని చూడగానే బావురుమంది.

"తప్పు కాదూ" రాజారావు శుష్కహాసంతో, రుద్ధకంఠంతో ఓదార్చాడు.

"చచ్చి ఎవరిని సాధిద్దామనుకున్నావ్. మనలాంటి జీవితాలు ఒక్కమాటే నశిస్తే, మీ నాన్న గారిలాంటివాళ్లు ఎలా మారతారు. మనం విడిగా జీవిస్తేనే, ఆ జీవితాల తాలూకు ఉపద్రవం, చేదూ నరకం వారికి వంటబట్టేది."

"నువ్వేనా ఈ మాటలు రాజా. మామయ్య సంబంధం చూడటానికి వెళ్ళాడు పోనీ..."

"పెళ్ళి ముందు సిగ్గు ఇప్పుడే చూపిస్తే ఎలా. 'ఆపేవే కానీ'.

"ఎవరిమీద కసిలేదు చెప్పుమరీ."

"............."

"నేను వింటా నీ ఉద్దేశం చెప్పకూడదూ".

"పోనీ... మనం యిద్దరం ఎక్కడికైనా వెళ్ళి పెళ్ళిచేసుకుంటే రాజా."

"ఎంత తేలిగ్గా అన్నావామాట సరోజా. అందరూ అలాగే అనుకుంటారా. దానికి చాలా చక్కటి పేరు సృష్టింపబడి వుందే. లోకుల దృష్టిలో కలక్టరుగారి అమ్మాయి లేచిపోయిందన్నమాట. ఈ విషయం నీ ఎదుటే నీకు ఇతరులు సూటీపోటీగా అంటూంటే భరించగలవా నువ్వు. పైగా ఈ విషయం గురించే మీ నాన్నగారికి నాకు వివాదం జరుగుత. ఎవరికో భయపడి నిన్ను తీసుకుపోయి ఎక్కడో జీవించి సుఖిద్దామనే ఆశయం నాకు లేనే లేదు. మీ వంశగౌరవాన్ని, పరువు ప్రతిష్ఠల్నీ, కలక్టరు హోదాని నిన్ను లేవదీసుకుపోవడమనే దానితో నేను మలినపరచ దలచుకోలేదని చెప్పబోగా, మీ నాన్నగార్కి దురభిప్రాయం ఏర్పడింది; మనమీ స్థితిలో వున్నాం. మనం ఈ వూళ్లోనే పెళ్లిజేసుకుందాం. మీవాళ్ల నీ విషయంలో ధైర్యంగా ఎదుర్కోలేవూ?"

"ఈ వూళ్లో నా, నాన్నగారు, మామయ్య, మామ్మ వీళ్లుండగానే" సరోజ మనస్సులోని భయం మాటల్లో గూడ ప్రతిఫలించింది.

వారిద్దరి మధ్య అంతేలేని నిశ్శబ్దం ఆవరించింది. అంత నిశ్శబ్దంగా వున్నా ఆలోచనా సమాధిలో మునిగి వున్నవారిద్దరూ గుమ్మం బయట అలికిడి గుర్తించలేదు. నిశ్శబ్దాన్ని చీలుస్తూ రాజారావే అన్నాడు. "ఇంత రాత్రి ఒక్కతివీ వచ్చావు. నే దిగబెడతాలే ఇంటిదాక. ఆలోచించు" అని అనునయించి ఇంటిదగ్గర

దింపి వచ్చాడు.

అడుగులో అడుగు వేసుకుంటూ పిల్లిలా గదిలో అడుగు పెడుతున్న సరోజ, రామేశ్వరంగార్ని చూసి పై ప్రాణాలు పైకే పోయాయి. తెల్లబోయి బిక్క చచ్చిపోయింది.

'నేను నీ వెనకాలే వచ్చి అంతా విన్నాను. ఈ వూళ్లోనే జరుగుతుంది పెళ్లి. తొందరెందుకు. పెళ్లి అయేంతవరకు ఈ గదిలో వుండు, షికార్లు మాని" అని ఆయన వెళ్లిపోయాడు.

ఆ రాత్రి రాజారావు రూముకి నలుగురు కట్టెలతో వచ్చి, అతణ్ణి చూసి "పెళ్లి కావాలా ఈ వూళ్లో? జాగ్రత్తగా వుండవోయ్, లేకపోతే 'పెళ్లే' జరుగుతుంది" అని కట్టె చివర్లతో భూమి గట్టిదనాన్ని పరిశీలించి మరీ వెళ్లిపోయారు.

రామేశ్వరంగారన్నట్టు ఆ వూళ్లోనే కొద్ది కాలానికి సరోజ వివాహం జరిగింది. వధూవరుల్ని చూసి 'చిలకా గోరింకల్లా' వున్నారన్నారు పెళ్లికొచ్చినవాళ్లంతా.

× × × × × ×

రాజారావుకు భవిష్యత్తే శూన్యమయిపోయింది. అతడాశించిన సురుచిర సుందర స్వర్గం వికలమై చూస్తుండగానే అట్లా జారిపోయింది.

రెండు సంవత్సరాలు పిచ్చిగా తిరిగాడు తోచిన చోటికల్లా. ఓసారి రైల్లో రామేశ్వరంగారు కనబడి ఆయనే పలకరించి మాట్లాడాడు. ఈ రెండేళ్లలో ఆయన బాగా మారిపోయాడు. అదోవిధంగా దిగజారిపోయినట్టున్నాడు. భార్య, తల్లి ఒక్క మాటే పోయారుట, కలరా తగిలి. సరోజకో మగపిల్లాడుట. అల్లుడు దగ్గరే నాగపూర్లో వుంటున్నాట్ట. ఈ సంగతులు ఆయన మాటల్లో తెలిసింది రాజారావుకు.

కొన్నాళ్ల తర్వాత రాజారావు స్థిమిత పడి జీవిత శేషాన్ని మధుర్మృతుల ఆనందంతో గడిపాడు. ఏ ఒక్కనాడూ జీవితం వ్యర్థమవుతోందని మధనపడలేదు, సరిగదా అతడు జీవితంలో అనుభవించదగ్గదీ, ఆశించదగ్గదీ పొందినవాడిలా గడిపాడు.

పందొమ్మిది నిండు సంత్సరాలు అలాగే నిశ్చలంగా సాగించాడు, లోకం పోకడతో పట్టించుకోకుండా.

వేసవి సెలవుల్లో దేశం తిరగడం అలవాటయిన రాజారావుకు బెజవాడ చేరినతర్వాత్త ఎటుపోడానికి పాలుపోలేదు. ఏదో రైలు బయలుదేరబోతోంది.

"ఆ ట్రెయిన్ ఎక్కడవెళ్తుందండీ"

"మెడ్రాస్"

"మెడ్రాస్ ఓ టిక్కట్టివ్వండి"

"ఇది సెండ్ క్లాస్ బుకింగ్ ఆఫీస్ సార్"

"సెకండ్ క్లాసే ఇవ్వండి"

టిక్కెట్టు పుచ్చుకొని కదుల్తూన్న రైలెక్కాడు.

'కదుల్తున్న రైలెక్కడం, అందులో సెకండ్‌క్లాస్ దొరకడం, ఆ పెట్టెలో ఒంటరిగా ఏదో ఇంగ్లీషు పుస్తకం చదువుకొనే పిల్ల వుండడం, ఇద్దరూ మొదట్లో ముభావంగా వున్నా చివరకు సంభాషణలోకి దిగడం, పెట్టెలో ఎక్కినవారు వీరిద్దర్నీ దంపతుల్లా జమకట్టి మాట్లాడ్డం, అది విని ఆ పిల్ల చిరు కోపంతో సిగ్గు ప్రదర్శించడం, చివరకు హృదయాలు తెలిసికొని పెళ్లిజేసికోడం, ఇంకా ఇలాగా' ఇలాంటి కథలు జ్ఞాపకానికొచ్చాయి రాజారావుకు.

"ఎంత సులభంగా అల్లేస్తారు కథలు. రెండో క్లాసు పెట్టె దొరకడం, అందులో పిల్ల వుండడం చాలామాట్లు జరుగుతుంది. అలాంటి కథలు వాళ్ళిద్దరూ కూడ చదివి వుండడం మూలాన్న వాళ్ల కసలు అలా కలుసుకోవడంలో కొత్తదనం ఏం ఫీల్ అవరు. అలా కలుసుకున్న వాళ్లు ప్రేమించుకొని తీరాలని మొదట యువకుడికి తట్టుతుంది. మాటలు కలుపుకుని కుప్పిగంతులు వేస్తాడు. ఆమె అతడేదో తన్ని ప్రేమించేస్తున్నాడని మొదటే తీర్మానించుకొని ఆ పిల్ల చాలా రిజర్వుడుగా వుంటుంది.

అసలు సొంతంగా ఆలోచించడం మానేసి ఎరువు తెచ్చుకొన్నట్టుగా ప్రవర్తించడం అలవాటయింది. అంతేగాని ఆ ఇద్దరూ స్వేచ్ఛగా మాట్లాడుకొని ఆ జ్ఞాపకాల అనుభవంతో వేదనాపూరితమైన జీవితాన్ని చిగురింపజేసికోలేరు. ఇందాక ఆయనెవరో అంటున్నాడు, 'ఏం వర్ణించాడండి నేచర్‌ని ఈ పుస్తకంలో'' అని. రైలు కదుల్తూంటే పరిగెత్తి వెంట వస్తున్నట్టుగా వున్న ఈ ప్రకృతిని చూసి ఆనందించగల శక్తి పోయింది. సముద్రపు నీలిమను, నబ్జుగా మబ్బుల్లో దోబోచులాడే చందమామనీ వదిలేసి, సినిమాలో చూస్తే "ఎంత డైరక్టరండీ" అనడం మిగిలింది. ఈ విధంగా సాగాయి రాజారావు ఆలోచనలు.

× × × × × ×

ఆగిన స్టేషన్లో కాఫీ తాగడానికెళ్లి రాజారావు తిరిగి రాగానే 'బోగీ' పరీక్షించకుండానే, సందడిగా వున్నట్టు పీలయాడు. మధురంగా పిల్లల గొంతు వినపడినయ్. తన సీటులో కూచుని పేపరు చదువుకుంటున్న రాజారావు పిల్లల గొడవతో కొద్దిగా చలించాడనే చెప్పాలి. అవతల బెర్తులో ఓ ముసలాయన గుండెల మీద

పుస్తకంతో సహా నిద్రపోతున్నాడు. తన ఎదురు బెర్తులో ఒకావిడ కిందకి వంగి మరచెంబు సద్దుతోంది.

రాజారావు పేపరు చదవడం ఎదురుగా చూశాడు.

ఆరేళ్ళ ఆడపిల్ల ఎదురు కిటికీలోగుండా పరిగెడుతూన్న చెట్లనీ, టెలిగ్రాఫ్ స్తంభాల్నీ వింతగా చూస్తోంది.

రాజారావు ఉలిక్కిపడ్డాడు. ఆ పిల్ల కళ్లు ఎక్కడో చూశాడు. అలాంటి కళ్లనే తనొకప్పుడు ఆరాధించాడు.

ఆ పిల్ల ప్రక్కనున్న ఆవిడను చూసి రాజారావు అకస్మాత్తుగా ఓ అంగుళం లేచినట్టుగాఅయి, మాట్లాడబోయి, కంఠంలోంచి మాటలు రాక తబ్బిబ్బు అయ్యాడు. ఆవిడ ఎత్తిన కళ్ళని 'ఠక్కున' వాల్చింది, రాజారావుని మాట్లాడొద్దని ఆర్డరు వేసినట్లుగా. కంఠం దాకా వచ్చిన మాటల్ని బరువుగా లోపలికి దించేసుకుని ఆశ్చర్యంగా చూశాడు. ఆవిడ పిల్లలకి బిస్కట్లు పెడుతోంది. ఆ మూడేళ్ళ వెధవ మారాం చేసి ముద్దులు గుడుస్తూ మరీ తింటున్నాడు. ఈ 'ఒక్కటీ తిను బాబు' అంటోందావిడ.

రాజారావుకు వళ్ళంతా దహించుకు పోతున్నట్టు మంటలు సెగలుగా లేచాయి.

తన సరోజేనా ఇలా మారింది. పిల్లల్ని చూడొద్దనీ గాదూ అతని అభిప్రాయం. ఇన్నాళ్లకి కనబడిన తనని ఒక్కమారు పలకరించగూడదు? పైగా తను మాట్లాడబోతే, ఒక్క కనుసంజ్ఞతో వారించి నిలిపేసింది. ఆమె తన పచ్చటి సంసారాన్ని ముక్కలు చేసికొని, తనని ఆప్యాయంగా ఆదరించి ఏదో చేయాలన్న ఆశ అతనికెప్పుడూ లేదు.

ఇన్నాళ్ళకి కనబడిన ఆమె నుండి ఓ చల్లని చూపు, ఓ మెత్తటి కమ్మని మాట, శాంతిని మాత్రం అతని హృదయం వాంఛించింది.

మాట్లాడకుండా తనని అన్యాపదేశంగా ఎలా కట్టేసింది సరోజ! తమ చిన్ననాటి గుట్టంతా పెట్టెలోని వాళ్లని లేపి చెప్పాలనిపించింది అతనికి.

వెంటనే తమాయించుకొని "ఎక్కడుంటున్నావు" అన్నాడు.

సరోజ అది వినగానే ఆ పిలుపేమిటన్నట్టుగా విసురుగా చూసి, చట్టున నవ్వి "మీ నాన్నగారు ఎక్కడుంటున్నారమ్మా" అంది.

ఆ మూడేళ్ల కుర్రాడు "నాన్నగారి పేలు ఇస్సేసరరావు" అంటున్నాడు. ఆరేళ్ళ పిల్ల ఏదో చెప్తోంది.

రాజారావు తెల్లబోయి చూశాడు. పిల్లల చేత వాళ్ళనాన్నగారి ఉనికి చెప్పించడంలోగల భావం అతని కర్థం కాలేదు.

సరోజ వెంటనే "మీకు ఎంతమంది పిల్లలు" అంది రవ్వల నెక్లెస్ సద్దుకుంటూ.

పెళ్లే జేసికోని తనకు పిల్లలేమిటి! ఎవరికోసం మానేశాడు? ఎవరిని తనిన్నాళ్ళే హృదయంలో ప్రతిష్ఠించుకొని ఆరాధిస్తూ గడిపాడు. ఇంత అన్యాయంగా మాట్లాడుతోందేం సరోజ!

ఆమె కోసం తనిన్నాళ్ళూ మరో ఆశ, ఆనందం లేకుండా బ్రతికానని ఆమె ముందు ఎందుకు చెప్పాలనిపించింది రాజారావుకు.

అవును! తనకెంత మంది పిల్లలుందురు ఇప్పటికి?

తను ఆమె కంటే సంసారంలో సుఖంగా వున్నట్లు చెప్పి ఆమెకు అసూయ కల్గిస్తే?

"ముగ్గురు పిల్లలు. పెద్దదానికి రెండేళ్ళ కిందటే పెళ్లి చేశాను. దానికో ఆరు నెల్ల పిల్లాడు. తల్లి రంగూ, తండ్రి కళ్లూ వచ్చాయి. చాలా బావుంటాడు" అనేశాడు రాజారావు, గుక్క తిప్పుకోకుండా నోటికొచ్చినన్ని అబద్ధాలు చెప్తూ.

"అయితేం ఇంకేం. తాతగారయ్యారన్న మాట" అని ఫక్కున నవ్వింది సరోజ, గవ్వలు గుమ్మరించినట్టు.

కలుక్కుమంది రాజారావుకు.

"నీ పిల్లలనుకుంటా వీళ్లు" అన్నాడు రాజారావు కొంచెం అక్కసుగా.

"ఆ మా పిల్లలే"

పిల్లలు కొత్త వ్యక్తిని గురించి ఆలోచించడం మాని వాళ్ల గొడవలో పడ్డారు.

సరోజ పెద్ద ఫామేదాగా మాట్లాడుకుపోతోంది.

"మిగతా పిల్లల వయస్సెంత? పెద్దవాడు ఏం చదువుతున్నాడు. మా పెద్ద వాడు అచ్చంగా వాళ్ల నాన్నగారి పోలిక. సూటిగా ముక్కు, వెడల్పాటి నోరూను. బి.ఏ. జూనియరు చదువుతున్నాడు. నాటకాలంటే చాలా ఇష్టం."

ఏదేదో మాట్లాడదామనుకున్న రాజారావు నోటికి మొదటే తాళం పడింది. దాన్ని విప్పడానికి అతని తరం కాలేదు. ఒక్క మాటు పరీక్షగా చూశాడు సరోజని.

బాగా పుష్టిగా వుంది. కళ్లల్లో మునపటంత భరించలేనంత కాంతి లేదు గాని తగ్గలేదు! మాట్లాడితే గలగలా నవ్వుతోంది. తన యీ జీవితంలో సంతోషం తప్ప మిగతా వేటికీ స్థానం లేనట్టు ఆమెకు 20 ఏళ్ల కొడుకున్నాడంటే ఎవ్వరు నమ్మేట్టు లేదు.

రాజారావు ఆమె సంసార జీవితంలో హాయిగా వున్నందుకు మనస్ఫూర్తిగా సంతోషించాడు. కాని తాను ఎవరికోసమై జీవితాన్ని బలిపెట్టి మరో వాంఛ లేకుండా గడిపేడో, ఆమె నుండి అతను ఆశించిన శాంతి లేకపోవడంతో, తను 'చేతకాక' జీవితంలో తప్పటడుగు వేసినట్టు గ్రహించాడు.

పిల్లలు హాయిగా నిద్రపోతున్నారు. వాళ్లని చూస్తూ హాయిగా మాట్లాడుకు పోతోంది సరోజ.

రాజారావుకు ఏ మూల నుండో తళుక్కున ఓ ఆలోచన మెరిసింది!

తనకీ భార్య వుంటే?

"ఇంకో రెండు స్టేషన్లలో మా వూరు వస్తుంది. ఒక్కమాటు దిగకూడదండీ" అంది సరోజ.

"ఇప్పుడు కాదు, ఇంకా పైకి వెళ్లాలి"

"అలా అయితే కుటుంబంతో రావాలి."

కుటుంబంట! ఏదీ, ఎక్కడుంది? తను తల్చుకుంటే!

రైల్లోంచి దిగుతూ "మీరు ఒక్కరే గాదు, ఆవిడ గూడ రావాలి" అని మరీ మరీ చెప్పింది సరోజ.

"తప్పకుండా."

× × × × × ×

**ఇం**టికి వచ్చిన రాజారావు తన పెళ్ళి ప్రయత్నాల్లో ఆలస్యం చెయ్యలేదు.

వయస్సుతో నిమిత్తం లేకుండా పిల్లల్నిచ్చే యీ పుణ్యభూమిలో పుట్టి పెరిగిన ఓ పద్దెనిమిదేళ్ళ పిల్ల రాజారావు భార్యఐ వూరుకుంది.

ఆ పిల్ల యిష్టానిష్టాలు, వరుని వయస్సు ఆలోచించడానికి ఎవరికీ టైం లేనట్టుగా ప్రవర్తించారు.

రాజారావు ఇన్నాళ్లూ పెళ్లి చేసికోకపోవడం తప్పు పట్టినవాళ్లే, ఈనాడు ఇంకో కోణం ద్వారా తప్పులెంచారు.

పెద్దలు "పిచ్చి పట్టిందా రాజారావుకు" అనుకున్నారు.

"ఈనాటితో పిచ్చి వదిలింది" అనుకున్నాడు రాజారావు.

విమర్శలనతడేమీ పట్టించుకోదల్చలేదు. తన నిజభావాలెలా వున్నా, సరోజకు మాత్రం వాటిని మరుగుపర్చి, తనూ పండంటి సంసారయాత్ర సాగిస్తున్నట్టు, ఆమె తనకు దక్కకపోయినా, ఆమెకుమల్లేనే అతడు నిశ్చింతగా జీవిస్తున్నట్లు ఆమెకు తెలియాలని అతని తాపత్రయం.

రాజారావు భార్య పేరు సుగుణ. తల్లిదండ్రులేముహూర్తాన ఆ పేరు పెట్టారోగాని అక్షరాల ఆమెకు సరిపోయింది. నెమ్మది, ఓపిక ఎటువంటి పరిస్థితుల్లోనైనా సర్దుకుపోవడం, ఈ లక్షణాలు ఆమెలో మూర్తీభవించాయి, ఆమె ఎప్పుడూ తన స్థితికి విచారించినట్టు కనబడలేదుగాని, ముభావంగా, యాంత్రికంగా కొత్త పద్ధతులకు భానిస అయిపోయినట్టు వ్యవహరిస్తున్నట్టు కనిపెట్టాడు. ఆ విషయాన్నాట్టే పట్టించుకోదల్చుకోలేదు. మనసులోని ఆ ఊహకు రూపమిచ్చి బాధపడకుండా ప్రయత్నించి సఫలుడయ్యాడు.

ఎంత కాదనుకున్నా ఎందుకో మళ్లా రాజారావు సరోజ దగ్గరకు వెళ్లాలనుకున్నాడు. మొత్తానికి ఒక్కడే బయల్దేరాడు.

"అక్కగారేరీ?" అంది సరోజ నవ్వుతూ, రాజారావు వొక్కణ్ణీ చూసి.

"ఏదో పిల్లలూ వాళ్లూనా. తీరుబాటు లేకపోయింది."

"ఆయన ఆఫీసు కెళ్లారు. ఓ గంటలో వస్తారు. ఇలా కూర్చుని ఈ పుస్తకాలు చూస్తూండండి" అవి లోపలికెళ్ళిందామె.

వెళ్ళిన ఆమె గంటసేపూ అయింతర్వాతే వచ్చింది. ఈ లోగా విశ్వేశ్వరరావు రానూ వచ్చేడు.

"మా నాన్నగారికి తెలుసునీయన" అని భర్తతో చెప్పింది, కాఫీలిస్తూ సరోజ.

పెద్ద ఆదరంగా కాకపోయినా విశ్వేశ్వరరావు బాగానే మాట్లాడాడు. రాత్రి భోజనాల దగ్గర కూడా సంభాషణ చాలా చురుగ్గా, హుందాగా సాగించాడు. విశ్వేశ్వరరావుకు మంచి సంభాషణా చాతుర్యం వున్నదని, మంచి తెలివైనవాడని గ్రహించాడు రాజారావు.

తమలపాకులు నములుతూ ముగ్గురూ హాల్లో కూర్చున్నారు. కావాలనే రాజారావు "మీ మేనమామ రామారావు గారు ఏం జేస్తున్నారు?" అన్నాడు.

"ఆయనా, ఈ మధ్యనే పక్షవాతం వచ్చి పోయాడు. కాని మహా లెక్కల్లో మనిషి లెండి.

మంచివాడండీ. ఆ" అన్నాడు విశ్వేశ్వరరావు.

"మరే"

పడుక్కోబోయే ముందు "మీరిక్కడో వారం రోజులైనా వుండాలి. కులాసాగా వుందాం" అని మరీ చెప్పాడు విశ్వేశ్వరరావు.

ప్రొద్దుటే 10 గంటలకి విశ్వేశ్వరరావు ఆఫీసుకు వెళ్లాడు. పనులు తెముల్చుకొని 12 గంటలకు వచ్చింది సరోజ.

"మా చంటివాడికి మారాం ఎక్కువండీ. వాణ్ణి సద్దేటప్పటికి తాతలు దిగొస్తారు. ఇప్పుడే నిద్రపోయాడు.'

ఏం మాట్లాడ్డానికీ తోచక దిక్కులు చూస్తున్నాడు రాజారావు.

"మీ నాన్నగారెక్కడుంటున్నారు?"

"ఆయన పోయి రెండేళ్లయింది. ఆయన పేరే పెట్టాం మా పెద్దబ్బాయికి" అని కొంగుతో కళ్ళు అద్దుకొంది.

"ఏం చదువుతున్నాడు?"

"బి.ఏ. చదువుతున్నాడు. వాడి వన్నీ విచిత్ర భావాలండీ?"

"ఏం?"

"ఏం చెప్పం. ఏమిటో సాంఘిక విప్లవం రావాలంటాడు. వెర్రిమాటలూ వీడూనూ".

"పెళ్లయిందా అతనికి."

"ఏదీ చేద్దామనుకుంటున్నాం. మీరు చెయ్యడమేమిటి నా పెళ్లి అంటాడు. ఈ మధ్య నింకో అవతారం లేవదీశాడు.తనకి నచ్చిన బీద పిల్లను చేసుకుంటాట్ట".

"అలాగా"

"చెప్తే వినడు. మొన్నో సంబంధం అన్ని విధాలా మాకు నిచ్చతే ససేమీ పిల్లని చూడ్డానికైనా వెళ్లలేదు. కారణం అడిగితే చివరకు నాతో చెప్పాడు. ఓ పిల్లని రైల్లో చూశాట్ట. తర్వాత వాళ్ల ఊరు వెళ్లి మాట్లాడి వచ్చాట్ట. ఆ పిల్లకి తండ్రి లేదు. మేనమామ దగ్గిర వుంటోందిట."

కావాలనే చెప్తోందా సరోజ ఇదంతా? దేనికి ఉపోద్ఘాతం ఇది అని ఆశ్చర్యపడ్డాడు రాజారావు.

"ఏమిటో ఉడికే రక్తం. ఇప్పట్లో అలాగే వుంటాయి భావాలు. ప్రేమేమిటి పిచ్చిగాని'" అంది సరోజ.

ఆమె ఎందుకీ గాధంగా మొదలుపెట్టిందో రాజారావుకు గ్రాహ్యమయింది. తను మంచి పనే చేశాడు, పెళ్ళిజేసికొని ఇన్నాళ్ళూ వుండి.

"పైగా రాత. ఆ అమ్మాయి ఫోటో గూడా తీసికొచ్చాడు" అని డ్రాయరు తీసి ఫోటో తీసి చూపిస్తోంది.

తలెత్తి చూశాడు రాజారావు ఫోటోను.

తల తిరిగిపోయిందాతనికి, ఎక్కడికో అధః పాతాళానికి కుంగిపోతున్నాడు.

ఇంకోమాటు ఆ ఫోటోకేసి అలాగే చూసి "ఏ వూరు వాళ్ళది" అన్నాడు.

అతని కంఠస్వరానికామె ఓ క్షణం ఆశ్చర్యపడి "ఏదో చెప్పాడమ్మా, ఆ, తాడేపల్లి గూడెం" అంది.

ఆపాదమస్తకం కంపించిపోతున్నా లేని ధైర్యం తెచ్చుకుని కుర్చీలోంచి లేచి నుంచున్నాడు.

సరోజ ఏమన్నది కూడా వినిపించుకోకుండా ఆ ఇంట్లోంచి బయటపడ్డాడు. కాళ్లు ఈడ్చుకెళ్తున్న రీతిగా వెళుతున్నాడు.

తనేదో సరోజ మీద పగతీర్చుకోవడం కోసం ఇద్దరి తరుణ జీవితాల్ని నాశనం చేశాడు.

తన భార్యలోని ముభావం ఈనాటి కర్థమైంది. ఎంత అమాయకంగా వుందా ఫోటోలో సుగుణ. ఆమె మీద అతనికి కోపమేమాత్రమైనా లేదు. తనోనాడు సరోజ నుండి విడివడ్డానికి ఎంత కుమిలిపోయాడు. ఈనాడు తాను తెలియక జేసిన పాపానికి, ఆ తరుణ ప్రేమైక జీవుల బాధనతడర్థం జేసికోగల్గాడు.

"చస్తావేమిటయ్యా. బండి కడ్డంగా నడుస్తున్నావ్" గుర్రబ్బండి వాడి అదలింపుతో ప్రపంచంలో పడ్డాడు రాజారావు.

ఆవేశంతో ఆలోచించకుండా చేసిన పనికి, ఇద్దరి కమ్మటి భావిజీవితాల్ని మొదలంటా త్రుంచేశాను.

తను తెలిసిచేయకపోయినా ఈ పాపానికి ప్రాయశ్చిత్తం?

"అవును. చస్తేమాత్రం ఎవరికి లోటు" మూలుక్కున్నాడు రాజారావు.

× × × × × ×

ఆ రాత్రి సరోజ ఎదలో రగిలే అగ్ని గుండానికి కన్నీళ్లతో తడిసిముద్దయిన ఆమె తలగడే సాక్షి.

రాత్రి ఒంటి గంటకు లేచి దీపం వేసి టేబుల్ దగ్గర కూర్చుంది కాగితం కలం తీసికొని.

రాజా,

ఈ ఉత్తరం నేనెందుకు రాస్తున్నానో తెలీదు. రాయడం మాత్రం రాస్తాను.

పిచ్చిరాజా! ఎంత బడబాగ్ని మనసులో పెట్టుకొని పైకి కక్కలేక అబద్ధాలాడేవు. ఏ సంగతి నాకు పూర్తిగా తెలుసు. నీవు పెళ్లి జేసికోలేదన్న సంగతీ తెలుసు. ఎలా తెలుసునని ఆశ్చర్యపడవక్కరలేదు. ఎలా తెలిసికొనేవాడో గాని మామయ్య చచ్చేదాక పగ సాధించచాలన్నట్టుగా ఏ సంగతులన్నీ చెప్పేవాడు నాకు. నా ప్రవర్తన నీకెంత బాధ కలిగించిందో నాకు తెలుసు.

అయినా నా ప్రవర్తన నా యీ స్థితిలో వున్న స్త్రీకి అన్నివిధాలా సమంజసమే కాకుండా అవసరం కూడాను.

నువ్వు నన్ను చూసిన తర్వాతే బాధ పడ్డావు. నా సంగతెవరితో చెప్పుకోను. నా సంగతి చెప్తా. కాస్త వినవూ.

కాపరానికి వచ్చిన కొద్దిరోజుల్లోనే నాకో సంగతి పూర్తిగా తెలిసొచ్చింది. ఆయనకు పెళ్లికి ముందే కొందరు స్త్రీలతో పరిచయమున్నట్టు. కోరి చెప్పకపోయినా ఆ విషయంలో ఆయనేమీ దాచడానికి ప్రయత్నించలేదు.

ఆయన నన్నెప్పుడూ జీవితభాగస్వామిననే దృష్టితో చూడకపోయినా ఆలక్ష్యం చేయలేదు. ఇంట్లో అందమయిన వస్తువును చూసినట్టుగా చూసుకునేవారు. జీవిత లక్ష్యం తప్పిన నాకు ఆయనన్నా నాకింకా ఆవేశం, గాయపర్చాలనీ వుండేది. ఆ మాత్రం సందుకూడా నాకీయక, ఆ మాటలాట్టే పట్టించుకోక, నన్ను లాలించి, ఓదార్చి, వాదిస్తుంటే చిరునవ్వు నవ్వి వూరుకునేవారు. ఆ నవ్వులోని లోతు తెలిసికొనడానికి నాకాట్టే కాలం పట్టలేదు. ఆయన నోటితో చెప్పకుండా, గదమాయించకుండా నన్నెంత నేర్పుగా వంచించారని, పురుషులకు ఇంత నేర్పుగా స్త్రీకి సంకెళ్లువేసి వంచించడం తెలుసు గాబట్టే ఇన్నాళ్లు ఆడదాన్ని అధికారంలో వుంచుకోగలారు. ఆ నేర్పునే ఆయన పుణికి పుచ్చుకొని తు.చ. తప్పకుండా ఆచరణలో పెట్టి విజయానికి సోపానాలు ఏర్పరుచుకొన్నారు.

ఓరోజున నిన్ను గురించే ఆలోచిస్తూంటే "రాణీగారు ఆలోచిస్తుంటే ఎంత ఠీవిగా వున్నారు"

అన్నారాయన.

ఎంత మోసముంది ఆ మాటల్లో. ఆయన అలా రాణీ గారని సంబోధించిన స్త్రీలెంత మందో? కాకపోతే భార్యగా వున్న దాన్ని నేను. పైగా అలా పొగిడి చెప్పించకపోతే 'ఆలోచిస్తున్న దేమిటీ' అని సూటిగా అడక్కూడదూ?

"మీరే చెప్పుకోండి ఏం ఆలోచిస్తున్నానో" అన్నాను. ఆ మాటలంటూంటే ఎదురు గుండా అద్దంలో నేను కనబరివిన సిగ్గుకీ, లాలనకీ నాకే ఆశ్చర్యం వేసింది.

అంతలా హృదయాలు వేరయ్యాయి గాబట్టే మా నోటంట అంత మధుర సంభాషణలూ, ఆయనని లోబరుచుకోడానికి నా నేర్పు నేను సిగ్గులో ప్రదర్శించడం జరుగుతోంది. అలా మాట్లాడుకుంటూంటేనే ప్రజలందరూ ఆదర్శదాంపత్యమనుకుంటారు.

మాలో ఎన్నాళ్లకీ పైకి కక్కలేక ఘనీభవించిన ఈ మిధ్యా సామరస్యమే మమ్మల్ని బలంగా బంధించి, ఇంకా దగ్గరగా తీసికొచ్చి జీవితమంతా ఇలా అపమార్గాన్ని సత్యాన్ని చెప్పనీకుండా నడిపిస్తుంది కాబోలు. దీనికి తిరుగులేదు.

ఆనాటి నుండీ లోని దావాగ్ని భరించి ఆ రంపపు కోత భరిస్తున్నాను. నువ్వు నా కోసం జీవితాన్ని పణంగా పెట్టి ఇతర ఆశలు లేకుండా జీవిస్తున్నావని తెలిసి హృదయం వ్రక్కలవుతున్న నాకు శాంతి లభిస్తుందా?

సంఘం దృష్టిలో మాది పవిత్ర దాంపత్యం. అది విస్మరించలేము. ఓసారి మన మీద ఆ బిరుదు పడ్డాక మనం విస్మరించినా లోకం మరవదు. కారణం - నేను ముగ్గురు బిడ్డల తల్లిని. నా యీ పరిస్థితిని తిరస్కరించి ఎదిరించగల శక్తి నాలో ఏనాడో పోయింది. ఓ వేళ ఎదిరించిన భవిష్యత్తు శూన్యం.

ఒకే మాట చెప్తున్నా. స్త్రీ ఓసారి ప్రేమించిన పురుషుని జన్మలో మరువదు, మరువలేదు. గతాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని పరిస్థితులను మార్చుకుందామనుకోవడం వెర్రిమాట. నీ వానాడు కలుసుకున్నప్పుడు కావాలనే నిన్ను గాయపర్చేను. అదే అక్షరాల చేయవలసిన పని నావంటి స్త్రీకి. మనసులో అలా మాట్లాడు తుంటే దుఃఖం ఆగదు. పైకి నవ్వుతూ మాట్లాడుతూ కనిపించాలి. నా పరిస్థితి నీకంటే అన్ని విధాలా అధ్వాన్నమయినదే. విషాదం పొంగి పొరలుతున్నా నవ్వుతూ మాట్లాడవలసివచ్చినప్పటి బాధ నీకెప్పుడూ అనుభవమయి వుండదు. అంతకంటే ఏ శిక్షనైనా అనుభవించవచ్చు.

బంగారవు పంజరంలోని చిలుకనెప్పుడైనా చూశావా? పంజరం బంగారపుదైనా మునుపు స్వేచ్ఛ

నెరిగిన చిలుక ఎప్పుడైనా సుఖంగా వుంటుందా? పంజరపు జీవితానికలవాటుపడి ముద్దుగా నేర్పిన చిలుక పలుకులు పలుకుతుంది. ఆ చిలక్కి ఆ మాటలు ఇష్టంగా వుండి అంటోందా అన్న ప్రశ్న లేనే లేదు. నేర్పారు గాబట్టి అనడం కంటే వేరే గత్యంతరం లేక అంటుంది.

ఒక్కటే తేడా ఆ చిలక్కీ నాకూను. ఏనాటికైనా విడిస్తే అది ఎగిరిపోగలదు. నాకు అదికూడా సాధ్యం కాదు. కారణం చెప్పనవసరం లేదనుకుంటా.

బంగారపు కటకటాల్లో బంధింపబడిన నాకు విముక్తి ఏనాటికీ లేదు - చిలుక పలుకులు పలుకుతూ మిధ్యా వినయం, సంతోషం, అనుకూల దాంపత్యానికి గీచిన గీట్లు దాటకుండా నడవడం, ఇవన్నీ నేర్చుకొని ప్రకటించడం మినహా.

లోకం నెత్తిన రుద్దిన ఈ కుహనా సామరస్యాన్ని దాంపత్యంలో నిర్వహిస్తూ, చిరకాలం పుత్ర పారంపర్యంగా జీవించాలి-జీవిస్తాను గూడ. అది తప్పంటే అనొచ్చు నీవు. 'ఏంగిల్' నుండి ఆలోచిస్తే ఇదే వక్రమైనా, లోకం దృష్టిలో సరైనబాట. అడుగు పక్కకి వేసినా అగాధంలో పడాల్సి వస్తుంది మరి!

ఇక వుంటాను

సరోజ

ఉత్తరం పూర్తిచేసి చూసుకుంటే అంతా కన్నీటి చారికలే.

"ఈ బాధ ఇలా భరించి ప్రొద్దుటే నవ్వుతూ లేవాలి. ఇది వినా శరణ్యం నాస్తి" అనుకొని సరోజ ఎడ్రసు రాసి దగ్గిర వున్న డబ్బాలో వేసి రాగానే తొలికోడి కూసింది.

ప్రొద్దుటే విశ్వేశ్వరరావు "కళ్లు అంత ఎర్రగా వున్నాయే నిద్రలేదా" అన్నాడు.

"అబ్బే. పొయ్యి వూదుతుంటే పొగ చేత గాబోలు."

"ఏదీ నన్ను చూడనీ" అని విశ్వేశ్వరరావు దగ్గరకొచ్చి బుగ్గ గిల్లాడు.

"పోదురూ. ఎవరైనా చూస్తారనైనా లేదు" నవ్వుతూ లోపలికెళ్ళింది సరోజ.

× × × × × ×

ఇంకో వారం రోజులకు పేపరు చూస్తూ విశ్వేశ్వరరావు అన్నాడు.

"పాపం, ఎవరో రైలు క్రింద పడి చనిపోయాడు. కావాలనే చేసినట్టు తెలుస్తోంది".

సరోజ ఒక్కసారి వణికింది.

"రాజారావు కాదుగదా?"

సరోజ ఊహ మాట ఎలా వున్నా ఆమె రాసిన ఉత్తరం మాత్రం రాజారావుకందలేదు.

ఇక సరోజ మాట అడుగుతారా?

ఆమెకేం?

సుఖంగా వుంది. అరవై ఏళ్లు బతికింది. భర్త వుండగానే ఆయన చేతులమీదుగానే వెళ్లిపోయింది.

"మహాసాధ్వి" అన్నారంతా ఏకగ్రీవంగా.

(ఆంధ్ర వారపత్రిక : 16-2-1955)



# వరహీనం

ఈ శజీ ఛైర్‌లో పడుకుని "టాగూర్" మహాశయుని "హోమ్ కమింగ్" అనే కథను చదువుతున్నాను. 14 సంవత్సరముల వయస్సుగల బాలుని మనస్తత్వం కవి మహర్షి "టాగూర్" రూపిస్తోంటే, ఇంత సూక్ష్మ వివరాలను గూడ పరిశీలించి, అంత హృద్యంగా రచించిన రవీంద్ర కవీంద్రుని రచనాచమత్కృతిని, భావ పరిశీలనని ఊహించి ఎంత ఆనందించినా, వెనువెంటనే అసూయ కూడ కల్గింది నాకు. నేనూ నా స్కూల్ ఫైనల్ రోజుల్లో, ఆ వయస్సులో ఆ విధంగానే ప్రవర్తించానుగా అన్న ఊహ నా అసూయకు తావిచ్చింది. కాని ఇప్పుడు పరిస్థితి దాటింది. స్కూల్ ఫైనల్ ఒక ఏడు డింకీ కొట్టడంతో అప్పుడే మూడేళ్ళుపైన దాటింది, ఆ వయస్సు గడచి.

ఇంతలో గది గుమ్మం దగ్గిర గాజుల గల గల శబ్దం, ఆలోచన కంతరాయం కల్గించింది. తలెత్తి చూసేను. ఎవరో కొత్త అమ్మాయి ముఖం మాత్రం కనపడ్తోంది. అప్రయత్నంగా ఇద్దరి కళ్లు కలుసుకొన్నాయి. వెంటనే, ఆ అమ్మాయి సిగ్గుతో పక్కగా నిలబడింది. నేను అక్కడ వుండడం మూలాన్న లోపలికి రావడానికి సంశయిస్తోందని నాకు తట్టింది. ఇంతలో మా వదిన నా గదిలోకొచ్చి, ఆ అమ్మాయిని చూసి, చిరునవ్వుతో, "రావమ్మా, అంత సిగ్గుపడతావేమిటి? ఇంట్లో మగవాళ్ళెవరూ లేరులే! మామగారు వూళ్లోలేరు, ఆయనేమో షికారు వెళ్లారు" అంది.

నాకు మా చెడ్డ తిక్కెత్తుకొచ్చింది. 'చెట్టంత మనిషిని కుర్చీలో కూర్చుని వుంటే పరాయి మనిషితో మగవాళ్లెవరూ లేరంటుందేమిటి! పైగా నన్నా అమ్మాయి చూసిందిగూడాను. ఇంట్లో మగవాళ్లంటే మా వదిన దృష్టిలో మామగారు, అన్నయ్యే కాబోలు కనబడుతూంటారు" అనుకుంటూ కోపం ఇలా దిగమింగుకుంటూ అలానే కూర్చున్నా.

ఇలా అందో లేదో మా వదిన, ఆమె మాటే వేదవాక్యం అయినట్టు, కుర్చీలో చెట్టంత మనిషిని వుండడం చూసి గూడా నన్నేదో అచేతన పదార్థంగా భావించినట్టుగా ఆ కొత్త అమ్మాయి ఠీవిగా

అంగలేసుకుంటూ, మధ్య మధ్య చీర సర్దుకుంటూ వదినతో లోపలికి వెళ్లింది. వదిన మాటలొక ఎత్తుగాను, ఆ మాటలు పట్టుకొని నీలెక్కేంత అన్నట్టుగా నా ముందు నుండీ పోయిన ఆ అమ్మాయి ప్రవర్తన దానికి పదింతలుగాను నన్ను గాయపరిచాయి. పైగా, ముందు నన్ను చూసినప్పటి సిగ్గు, జంకు కూడామాయమయిపోయాయేమో. పోనీ నాకంటే వయస్సులోనైనా అధికురాలా అంటే అదీగాదు. ఏదో కొత్తగా కొన్న బెంగుళూరు సిల్కు చీర లాంటిది ఆ వంటి మీద చూసేవాళ్లకి కాస్త నదరుగా కట్టుకుంది గాని, ఆమె వయస్సు నా లెక్క ప్రకారం, అధిక మాసాల్తో వేసుకొన్నా, ఇరవై సంవత్సరాలు లోపే కాని ఎక్కువ వుండదు. నా వయస్సు దాదాపు అంతేగా. మరింకేం జాసుకొని ఆ తెగ నీల్గుడు అని నాకు పట్టుకొంది.

పోనీ మనకెందుకు బయటికి పోదామని, అద్దం చూసుకొని తల దువ్వుకుంటున్నా, స్పష్టంగా అద్దంలో కనపడ్తుంది. మొన్న నే కత్తిరించిన నా మీసకట్టు. మరి ఇంతలా మీసకట్టూ, అదీ అర్థం కాలా! ఆలోచిస్తూ వీధిలో నడుస్తున్నాను. ఎవరో వెనకనించి భుజం పట్టుకులాగితే, ఆశ్చర్యంతో వెనక్కి తిరిగేను. ఆయనెవరో తలంతా ముగ్గుబుట్టలా వుంది. నాకేసి చూసి, "నువ్వు సత్యనారాయణగారి మూడో అబ్బాయివి గాదుటోయ్" అన్నాడు. "అవునండి" అన్నా. "అలాగే అనుకున్నాలే, చిన్నప్పుడు చూశాను నిన్ను. నిన్ను అప్పుడంతా "చిన్నాడు" అని పిల్చేవారోయ్" అని ఆగాడు.

"కాదండి, ఇప్పుడాపేరు కాదు. మారిపోయింది, నేను మారేను" అని నిష్కర్షగా ఆయనేమనుకున్నా అనేద్దామనుకుంటూండగానే, ఆయన నా మాట పైకి రాకుండానే, అందుకుని, "నువ్వు ఏమీ మారలేదోయ్, చిన్నప్పటిలాగే వున్నావ్. మీ నాన్నగారిని కలుసుకోలేకపోయాను, ఏమీ అనుకోవద్దని చెప్పు" అంటూ సాగిపోయాడాయన.

ఈయన నోరు విప్పుతోనే చిన్నవాడననేమాట తప్ప ఇంకొకటి మాట్లాడడేమిటిరా భగవంతుడా అనుకున్నా, పైగా చిన్నప్పటిమాటెందుకీయనికి? ఇప్పటి వేషం చూసి మాట్లాడాలిగాని, అనుకుంటూ ఓ సేఫ్టీరేజర్ కొందామని ఫాన్సీ షాపులోకి పోయా. అకస్మాత్తుగా మా ఇంగ్లీష్ లెక్చరర్ కనపడ్డాడు. ఇష్టం లేకపోయినా ఓ నమస్కారం పారేసి నమ్రతతో నించున్నా. ఆయనైనా నమస్కారం గూడా పెట్టననైనా వూరుకోవచ్చా! అలాగాకుండా, "ఏమిటోయ్, నువ్వంత పాడుచేశావు మొన్న పేపరు? మీ అన్నయ్య చదివేటప్పుడు ఇలాగే రాశేవాడా? చిన్నవాడివిగనుక చెప్తున్నా, ఈ ఇంటర్‌మీడియటేనోయ్ ఫ్యూచర్ డిసైడ్ చేసేది అంటూ మధ్యలో ఇంగ్లీషు ముక్కలు చెరిగి మధ్య మధ్య మా అన్నయ్య రాసే శైలి, విధానం విపులంగా విశదీకరిస్తూ, మొత్తం మీద నువ్వో చవటవని తేల్చాడు. అలా సూటిగా అన్నా బావుండును. కాని మా అన్నయ్యతో కలపడమేమిటి నన్ను, నాకు వేరే అస్తిత్వం లేనట్టు? ఈ వేళ లేచిన వేళ మంచిది కాదనుకుంటూ షాప్ యజమాని 'ఏం కావాలండీ' అంటున్నా వినిపించుకోకుండా బయటపడ్డాను ఆ ఉక్కిరి బిక్కిరిలోనుండి.

ఇలా తిరుగుతూ వుంటే ఇంకా ఎంత మంది ఏమంటారో అని ఇంటిదారి పుచ్చుకున్నా. ఇంటికొచ్చి ఈ విషయమే ఆలోచిస్తున్నా. ఎప్పుడు చీకటి పడిందో కాని వదిన నా గదిలోకొచ్చి దీపం పెట్టి వెళ్లిపోతోంది.

"ఏవమ్మా, ఇందాకవచ్చిన అమ్మాయి ఎవరు" అన్నా.

"ఏం" అంది వోరగా వెకిలిగా చూస్తూ నీకెందుకు అన్నట్టు.

"ఆ, ఊరికేలే, ఎన్నేళ్లుంటాయేమిటి" అన్నా నా కంటే ఏమాత్రం పెద్దదో తెలిసికుందామని.

"కొంపదీసి పెళ్లి చేసుకుందామనుకుంటున్నావేమిటి? వరహీనమవుతుంది గూడాను" అంది ఆవిడ.

"వరహీనమేమిటమ్మా. నాకన్న పెద్దదా ఏమిటి?" అన్నా. ఆ అమ్మాయికంటే చిన్నవాడవని నన్ను అనడం చేత ఇలా అడిగేశాను.

"కొంపదీశావు. నిజంగా పెళ్లిజేసుకొందామనుకుంటున్నావేమిటి? ఈపాటికే ప్రేమించివుంటే జీవితమంతా విరహతాపంలో గడపాలోయ్ బాబు! ఆ అమ్మాయికి పెళ్ళయిపోయింది. వాళ్ళాయన్ని చూపిస్తానుండు. ఈ వీధిలోనే వాళ్లుంటున్నది." అంటూ నవ్వుతూ వెళ్ళిపోయింది.

ఇంతకీ నేను ఆమె వయస్సడిగి నాకంటే ఏమాత్రం పెద్దదో తెలిసికొందామని మాటవరసకడిగితే, ఇలా పెళ్లితో ముడిపెడుతుందేమిటీవిడ? కథంతా అడ్డం తిరిగింది అనుకుంటూ, "నిజంగా చెప్పవమ్మా ఎన్నేళ్ళుంటాయి" అన్నా ఆమె దగ్గిరగా వెళ్లి.

"నాకు సరిగ్గా తెలియదు గాని, 18 ఏళ్లు వుంటాయి షుమారుగా" అంది.

ఓస్. ఇంతేనా, నా వయస్సు కూడా అంతేగా! మరి నాకంటే ఏ మెక్కువని ఆ అమ్మాయి కాదర్పం? ఒక్క పెళ్లి మాత్రం అయింది నాకంటే ఎక్కువగా! పోనీ నేనూ చేసుకుంటాను, ఈ బాధ తప్పుతుందేమో. ఛీ ! అయినా ఇప్పుడే పెళ్ళేమిటి, అని అనుకుంటుండగా, "సత్యన్నారాయణగారున్నారాండీ" అని పైనించి ఎవరో పిల్చారు. గబగబా వెళ్లి చూశాను ఎవరా అని. రోల్డ్‌గోల్డ్ ఫ్రేమ్ కళ్లద్దాలు, జరీ అంచు ఖండువాతో ఎవరో కొత్తాయన నించుని వున్నాడు. "రండి లోకపలికి రండి" అని ఆహ్వానించాను. ఇద్దరం తాపీగా కూర్చున్నాము.

"మీ నాన్నగారు లేరనుకుంటా. వారితో మాట్లాడవలసిన పనుంది లెండి" అన్నాడాయన.

"అవునండి, వూరు వెళ్లారు. ఇవాళ రావచ్చు. మీరేమైనా చెప్పదలిస్తే నాతో చెప్పండి. నేను వారి అబ్బాయినే లెండి" అన్నా.

"అబ్బే, ఏమీ లేదోయ్. మా తమ్ముడు గారి పిల్లొకత్తె వుంది. దానికి పెళ్లి చేయాలనుకుంటున్నాం. పెళ్లికొడుకువి నిన్ను చూశానుగా! తక్కిన విషయాలు మీ నాన్నగారితో మాట్లాడుతాలే" అంటూ వెళ్లిపోయాడు. ఎంతమంది చెప్పినా ఇప్పుడప్పుడే పెళ్లిచేసుకోకూడదు అనుకున్నా. ఇంతలో మా నాన్న, అమ్మ వూరినుంచి వచ్చారు. లోపలికి తీసికెళ్తూ అమ్మతో నవ్వుతూ చెప్తోంది వదినేదో.

★ ★ ★ ★

రెండో రోజున కాలేజి నుండి ఇంటికొచ్చి భోజనానికి కూర్చున్నాను.

"బొట్టు పెట్టుకోవోయ్" అంది వదిన.

"ఎందుకు బొట్టు, నాకలవాటు లేదు?" అన్నా.

"అందుకే అలవాటు చేసికోమంటున్నా పెళ్ళి కూడా కాబోతోంది" అంది ఆవిడ.

"పెళ్లేమిటి?" అన్నా తలెత్తి.

"అబ్బా, ఏమీ తెలియదండి అబ్బాయిగార్కి, నిన్న మనింటికొచ్చినాయన తమ్ముడి పిల్లనే నీకిస్తారుట. ఇప్పుడే ఆయన మాట్లాడి వెళ్లాడు. రేపే పిల్లని చూడ్డానికి వెళ్లేది" అంటూ వదిన నేతిగిన్నెలో నెయ్యంతా విస్తట్లో గుమ్మరించి నవ్వుతూ నిల్చొంది.

పోనీలే, ఇదీ బాగానే వుంది. పెళ్లి కొడుకులా పోజు వేసి కూచున్నంతకాలం మనకీ హోదా, దర్జా వస్తాయి. పోనీ అంతగావస్తే పిల్లని చూసి, నచ్చలేదని చెప్పేద్దామని నిశ్చయించుకొన్నా.

పెళ్ళికూతురిని చూడడానికి వెళ్ళాం. మేము కూర్చున్న గది రమ్యంగా అలంకరించబడి వుంది. ఉక్కగా లేకపోయినా జేబు రుమాలుతో విసురుకుంటూ కూర్చున్నా. ఇంతలో ఘల్లు ఘల్లున అందెల చప్పుడు మందంగా, శ్రావ్యంగా వినబడ వచ్చింది. ఎంత చక్కగా వుందా శబ్దం! మృదువుగా నేలకు తాకించి వినేవారికి విచిత్రానుభూతిని కలిగించేటట్టుగా నడిచే ఆ పాదాలు ఎంత సున్నితంగా వుండాలి! ఆలోచన మాని, తలెత్తి చూసి, ఆ పాదాల శబ్దం, అందెల రవళులు పెళ్లికూతురువేనని గ్రహించి ఆశ్చర్యపడ్డాను. ఎన్నాళ్ళు నేర్చుకుంటే అంత నేర్పుగా హృద్యంగా పదవిన్యాసం అలవడుతుంది! మెల్లిగా వచ్చి చీర బుట్టలా పరుచుకొనేటట్టుగా కూచుంది. గంపెడు గులాబీపూలు, రంగుల బుట్టలో పోసి ఎదురుగా పెట్టినట్టయింది. ఎంత చక్కగా కూర్చుంది, చీర నలగకుండా, అంచులు కనబడుతూను! చిన్న నోరు, పొందికయిన పెదవులు, చిన్న కళ్లు వుంటే ముఖానికి అందంగా అమరుతాయన్న విషయం ఆమెను చూసిన తర్వాతే గ్రహించాను.

అంత దీక్షగా ఆమెనలా చూడడం భావ్యం కాదేమోననిపించింది. చూపు మరల్చి, గోడలు, గోడలకున్న జపాను వనితల బొమ్మలు, గడియారంలో తిరుగుతున్న ముళ్ళు చూస్తూ కొంతకాలం గడిపా. అలా ఎంతసేపో చూడలేక, మెల్లిగా కళ్ళుదించా కిందకు. దొంగ! వోరగా నన్ను చూస్తూ నేను చూడగానే తల దించేసింది. ఎంత నేర్పుగా చూసింది! మళ్ళా ఇంకొక్క సారి చూస్తే ఎంత బావుండును! ఇద్దరి కళ్లు కలిసినప్పుడు ఆమె ఎడం కంట్లో చిన్న పుట్టుమచ్చ వుండడం చూశా.

"ఓ పాట పాడమ్మాయి" అని ఎవరో అన్నారు.

పాడడం ప్రారంభించింది. అబ్బ ! ఆ చిన్న నోరు, ఆ రెండు పెదవులు ఎంత నాజూకుగా ఉన్నాయి! కొంతమంది పాట మొదలు పెడుతూ కక్కడానికా అన్నట్టు నోరు తెరుస్తారు. అప్పుడే విడిచిన లేత గులాబీ మొగ్గలా వుందామె నోరు. మృదు మధుర్వరాలు ఆమె కంఠం నుండి వస్తున్నయ్. పాట ఆపడంలో కూడా సొగసు కనబరిచింది ఆమె.

"ఇంకా లోపలికి తీసికెళ్ళండమ్మా" అని ఆ అమ్మాయి నాన్నగారన్నారు. ఇప్పుడు చూశానామె పూర్తి వాలుజడ. ఆ జడ ఆమె ముందుకు వేసికొని వుండగా, ఆ జడ చివరలు, నా వేళ్ళతో సవరిస్తే ఎంత బావుండును, అనిపించింది.

"రారా, పోదాం" అని నాన్న తట్టి లేపారు. ఇంటికి పోయాం. పెళ్ళి చేసుకోకుండా వుందామన్న పట్టుదల ఇట్టే సడలిపోయింది. చెప్పొద్దూ, చచ్చి చెడి, ఓ పద్యం కూడా కట్టేనామె మీద.

"పిల్ల ఎలా వుందోయ్" అని మా వదిన అడిగింది.

"పిల్ల బావుంది కాని ఓ కంట్లో పుట్టుమచ్చ వుంది" అని ఎవరో ఇంకా ఏదో చెప్పబోతున్నారు. ఆ అంటూన్న వాళ్ల మిగిలిన మాటలు వినిపించుకోకుండానే, "ఆ పుట్టుమచ్చే ముఖానికి మరింత శోభనిచ్చింది. పైగా అదృష్టం గూడాను పుట్టుమచ్చ వుండడం" అని అప్రయత్నంగా అనేశాను. "ఇంకేం! పిల్ల నచ్చిందన్నమాటే! అయితే మాతోటి కోడలు వస్తుందన్నమాటే. నాలుగైదు రోజుల్లో వారి దగ్గరనుండి శుభలేఖ వస్తుందిలే" అని వదిన అంటూంటే తల దువ్వుకుంటూ మీసమొకమాటు చూసుకున్నా.

★ ★ ★ ★

ఇలా పది రోజులు గడిచాయి. అక్కడ నుంచి వచ్చే వుత్తరానికి ఎదురు తెన్నులు చూస్తూ కూచున్నాను. ఓ రోజున కాలేజీ నుండి వచ్చేటప్పటికి వదిన, "మీ మామగారి దగ్గిరనుండి, ఉత్తరం వచ్చిందోయ్" అంటూ వెటకారంగా నవ్వుతూ ఓ ఉత్తరం అందించింది.

ఆత్రంగా ఉత్తరం చదివాను. కాళ్లు భూమి మీద లేనట్టుగా తేలిపోతున్నయ్. ఇంతకీ ఉత్తరం సారాంశం ఏమిటంటే, "వరహీనమవుతుందేమోననే భయంచేత మీ సంబంధం వదులుకున్నాము" అని. నాకు నోట్లో తడి ఆరిపోయింది. పైకి ఏమన్నా అంటే బావుండదని వూరుకున్నా. పైగా వరహీనమవుతుందంటాడేమిటి, ఆయన  సంబంధం మానుకోడానికి? ఇంకో కారణం ఏం చెప్పినా బావుండేది, నే నింత బాధపడకపోదును. ఇంతట్లో అమ్మ "నేనప్పుడే అనుకున్నాను. వీడికప్పుడే పెళ్లేమిటి అని. ఇంకా ఒక చెంప కొడితే పాలు, ఇంకో చెంప నీళ్ళు కారుతుంటేను" అంది. మా అమ్మ మళ్ళా మొదటి కొచ్చింది. నాకు చెంపను పాలు కారడమేమిటి కొడితే? సాచి నేను కొడితేనే ఎదుటి వాడికి రక్తం వచ్చే వయస్సు వచ్చినప్పుడు?

"పాపం, ఇంత చిన్నప్పుడే పెళ్ళొద్దని వాడు చెప్పనే చెప్పాడుగా! ఇంతకీ ఆయనొప్పుకొన్నా, మనవాడు ఒప్పుకొనేవాడుగాడులే" అని అన్నయ్య అన్నాడు. "కాదురా బాబూ; పరిస్థితులు మారాయి అమ్మాయిని చూడటంతోనే చేసుకుందామనుకున్నాను," అన్న మాటలు నోటి దాకా వచ్చినా బలవంతాన ఆపుకున్నా.

"ఏమిటోయ్ నువ్వు చూసుకున్న ప్రతీ సంబంధం వరహీనమవుతోంది? మొన్నో అమ్మాయిని చూస్తే వరహీనమే గాకుండా ఆ అమ్మాయికి పెళ్ళి కూడా అయిపోయింది. పోనీ పెళ్ళి గాని పిల్లని చూసుకుంటే మళ్ళా వరహీనమయి వూరుకుంది" అని మా వదిన నోట్లో చీరకొంగు కుక్కుకుంటూ వస్తున్న నవ్వు ఆపుకుంటూ అంటోంది.

"ఇంతెందుకు పట్టు పంచ అయినా సరిగ్గా కట్టలేడు, అప్పుడే పెళ్ళేమిటి వీడికి! కట్టబోతే తెరచాపలాగ లేస్తుంది వెనకాల" అని నాన్న అన్నారు నవ్వుతూ.

"అయితే వోపని చేయవోయ్. ఇవాళ నించి పట్టు పంచ కట్టుకోవడం అలవాటు చేసుకో. బాగా వచ్చిన తర్వాత పట్టు పంచతో నే పిల్లని చూడ్డానికెళ్ళు. పెద్ద వాడిలా కూడా కనబడతావు. దాంతో వరహీనం, గిరహీనం అన్నీ గూడ తప్పుకుంటాయి" అని వదిన వంటింట్లోకి వెళ్ళిపోతో అంది.

*(ఆంధ్ర పత్రిక - సచిత్ర వారపత్రిక 23-7-1952)*



# రంగుల కల

కామేశ్వరరావుకూ, నాకూ ఇరవై ఏళ్ళ పైగా పరిచయం. ఆ పరిచయం పరిచయంగానే ఉండిపోయింది కాని, స్నేహంగా మారలేదు. మారడానికి అవకాశమూ లేదు. అతనూ, నేనూ ఏనాడూ ఒక ఊళ్లో కలిసి పనిచెయ్యలేదు. ఆఖరికి పట్టుమని కొన్ని రోజులైనా కలిసి ఉండలేదు. కాని అతను సంవత్సరానికో, సంవత్సరంన్నరకో, ఆపైనో ట్రెయిన్‌లోనో, బస్సు ప్రయాణాల్లోనో, పెళ్ళిళ్ళలోనో, సినిమా హాల్లోనో, ఎగ్జిబిషన్స్‌లోనో కనబడేవాడు.

చిత్రమేమిటంటే అతను కనిపించినప్పుడల్లా మా ఇద్దరి మధ్యా సంభాషణ ఒక విషయం మీదే నడిచేది.

"మీ 'పాప' ఎలావుంది?" అని నేనడగడం, అతను మురిసిపోతూ వాళ్ళ అమ్మాయి 'లక్ష్మి' చేష్టలూ, అల్లరి, చదువూ వగైరా చెప్పడం.

ఇంకో చిత్రం - మా సంభాషణలో ఆ పిల్లని 'పాప' అని నేను, అసలు పేరు 'లక్ష్మి' అని అతనూ అనడం అలవాటైపోయింది.

అసలు మేమిద్దరం ఇరవై ఏళ్ళ క్రితం మొదటిసారిగా కలుసుకున్న ప్పటి తీరూ, సంభాషణా కూడా చిత్రంగానే సాగింది.

మా కజిన్ రామం ఓరోజు ఈ కామేశ్వర్రావుతో మా ఇంటికి వచ్చాడు. అతడు లావుగా, పెద్ద సైజులో వున్నాడు. వయసు చిన్నదైనా ఆకారం మాత్రం వికృతంగా పెరిగింది. ఆనాడు నేను కలిసినపుడు అతను జీవితంలో ఉత్సాహం నశించినవాడులా వున్నాడు.

పరిచయాలయ్యాక మా రామం అసలు సంగతి బైటపెట్టి నీకు ఫలానా ఆ పెద్ద ఆఫీసరు బాగా తెలుసు కనుక కామేశ్వర్రావును 'ఆ' వూరు బదిలీ చేయించమన్నాడు.

"మీది 'ఆ'వూరు స్వగ్రామమా?" అన్నాను.

"కాదు" అన్నాడు ముభావంగా కామేశ్వర్రావు.

"మరి అక్కడికే ఎందుకు బదిలీ?"

ఇద్దరూ మాట్లాడలేదు. మావాడు ఏదో చెప్పబోయి సంశయిస్తున్నట్టు ఆగిపోయాడు.

ఉన్నట్టుండి కామేశ్వర్రావన్నాడు "ఆ వూళ్లో ప్రకృతి ఆశ్రమం వుంది. అక్కడ వైద్యం చేయించుకుంటే పిల్లలు పుడతారని".

అనడం నా కళ్ళల్లోకి దీనంగా చూస్తూ అన్నాడు. అతని సమాధానం, ఆ మాట చెప్పే టప్పటి నిజాయితీ, తీరూ నాకు ఆశ్చర్యం కలిగించాయి. నవ్వూ వచ్చింది.

ఆ రాత్రి వాళ్ళిద్దరూ మా ఇంట్లోనే వున్నారు. భోజనానికి ముందు, ఎలా పోగు చేసాడో ఓ పది మంది పిల్లల్ని మా వీధరుగుమీద పోగుజేసి, అతడు ఓ గంటసేపు, వాళ్ళకంటే ఎక్కువగా, వాళ్లతో కలిసి ఆడాడు. మర్రోజు వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు.

ఆ తర్వాత అతడు రెండేళ్ళ తర్వాత బెజవాడ ప్లాట్‌ఫామ్‌మీద కనిపించాడు. మనషి బాగా సన్నబడ్డాడు. నన్ను చూడగానే కావలించుకున్నంత పనిచేసాడు. అతనిలో ఉత్సాహం ఉరకలు వేస్తోంది. పిల్ల పుట్టిందట. బారసాల చేసుకు వస్తున్నాట్ట. గుప్పెళ్ళు ముడిచి, అస్తమాటూ నిద్ర పోతుందట గానీ, తెరిస్తే కళ్ళు చాలా పెద్దవిట. నిద్రలోకూడా నవ్వుతుందిట. చివరిగా 'ఎంత ముద్దొస్తూందనుకున్నారు. నా పోలిక రాలేదు లెండి. చాలా చక్కగా వుంది లెండి' అన్నాడు.

అతని ఆనందం చూస్తూంటే నాకు చాలా సంతోషమైంది.

.... ఆ తర్వాత ఓ సంవత్సరానికి రాజమండ్రి సినిమా హాల్లో కనిపించాడు.

"పాప ఏమంటోంది?" అన్నాను.

"ఎన్ని కబుర్లు చెబుతూందనుకున్నారు? మా అమ్మ చేయించిన గొలుసు నోట్లో పెట్టుకొని భలే ఆనందంగా ఆడుకుంటుంది లెండి. గొలుసు నోట్లోంచి తీసేస్తే ఎంత ఏడుపనుకున్నారు - నిజం కాదండీ ఉత్తి దొంగ ఏడుపు. భలే దొంగ ! చిన్నప్పుడు సన్నగా వుండేదండీ, ఐదో నెల వచ్చేసరికి బంతిలా ఐపోయిందండీ. ఈ మధ్యనే గాజులు చేయించాము - పొట్లాం లాంటి చేతులకి భలే వున్నాయి లెండి....'
'

అతను చెప్పే విషయం కన్నా అతని ధోరణి నన్ను ఆకర్షించింది. ఆ ధోరణిలో అడ్డు వున్నతెర తొలగించి, స్పష్టంగా కనుపింపచేసేదేదో వుంది. నా కళ్ళ ముందు ఓ చిన్న పిల్ల ఆకృతి అతిమనోహరంగా

విస్పష్టంగా కనిపిస్తోంది.

ఆ తరువాత రెండేళ్ళకు ఓ పెళ్ళిలో కనబడ్డాడు.

"బాగా అల్లరి చేస్తోందా పాప?" అన్నాను.

"ఎంత ముద్దుగా అల్లరి చేస్తుందనుకున్నారు లక్ష్మి! మాటలన్నీ వచ్చేసాయి. వంటింట్లో మహా హడావిడి అనుకోండి...."

"పాప ఫోటో ఏదైనా వుందా?"

"ఉందండీ. మీ దగ్గర వుంచండి" అంటూ పర్సు అరలన్నీ వెతికాడు. కనబడలేదు. "అయ్యో ! మరచి పోయినట్టున్నానండీ...."

మూడేళ్ళ తర్వాత మెడ్రాస్‌లో కనబడి వాళ్ళ అమ్మాయి చదువూ, పొట్టి పరికిణీ కట్టుకుంటే వాళ్ళ లక్ష్మి అందం, పుస్తకాల సంచీ తీసుకు స్కూలుకు వెళ్లడం అన్నీ చెప్పాడు.

ఆ తర్వాత నాలుగైదేళ్ళ దాకా అతను నాకు కనబడలేదు. నా మనసులో ఆ పిల్ల రూపం నిలిచిపోయింది. పాప కబుర్లూ, ఎదగడం ఈ మధ్య వినక నాకు తోచేది కాదు. ఆ పాపని నేను చూడకపోయినా పుట్టిన లగాయతు ఆ పాప చేష్టలూ, విద్దాలూ, ఆటలు, ముద్దు మాటలతోపాటు స్పష్టమైన ఓ మోహన రూపం నా నమసులో మెదులుతూ వుండేది. ఆ పాప గురించి ఈ మధ్య ఏం తెలీకపోవడంతో నాకు ఆతృతలాంటిది కలిగి, పెరిగింది. ఒకసారి 'కేంప్'లో ఫ్రండగా కామేశానికి ఉత్తరం వ్రాసాను - కాని అతను ఉండేది ఎక్కడో, ఆ చిరునామా దొరక్క ఆ కార్డు ఈనాటికీ నా పెట్టెలో మూలుగుతోంది.

ఐదేళ్ళ తర్వాత కామేశ్వర్రావు హఠాత్తుగా కర్నూల్లో కనబడ్డాడు. నా దిగులంతా మాయమయింది.

"పాప కులాసా? బాగా చదువుతోందా?" నా మామూలు ప్రశ్న.

ఆ ప్రశ్న వెనకాల ఎంతో ఆతృత.

"క్లాసులో ఫస్టు మార్కులన్నీ దానివే అనుకోండి. అన్ని మార్కులు వద్దే తల్లీ - దిష్టి తగుల్తుందని చెప్పాను కూడానూ ! మరిచి పోయానండోయ్! డ్రాయింగ్ చాలా ఇష్టం - బొమ్మలు చక్కగా వేస్తుంది. మీ లాంటి వాళ్ళ దగ్గర ప్రత్యేకంగా నేర్పించి ఆ కళలో మంచి ప్రావీణ్యం తెప్పించాలని వుంది".

"అబ్బే! నాకు మాత్రం అంతగా ఏం వచ్చులెండి".

"అలా అనెయ్యకండి - మీ రామం గారు అప్పట్లో మీ గురించి చెప్పేవారు లెండి. మీ రామధ్య వేసిన

చిత్రానికి బహుమతీ వచ్చిందటగా?"

మాట మార్చాలని "పాపకు ఆడుకోటానికి ఓ తమ్ముడో, చెల్లెలో వున్నారా?" అన్నాను.

"ఇంకెందుకు లెండి. మా లక్ష్మే మా ఇలవేలుపు".

.... 6, 7 సంవత్సరాలు గడిచాయి. ఈపాటికి పాప మనోహరంగా, ముగ్ధత్వం ఒలికిస్తూ, పుత్తడి బొమ్మల్లే వుంటుందని ఆలోచన.

మా రాధ విశాఖపట్నం మా బంధువుల అమ్మాయి పెళ్ళికి వెళ్ళి వచ్చింది.

ఆ మాటా, ఈమాట చెబుతూ "పెళ్ళికి రమ్మన్నా రాలేదు మీరు. మీ కామేశ్వర రావుగారూ, భార్యా కూడా వచ్చారు పెళ్ళికి" అంది.

"అయితే మరి వాళ్ళ....."

నా ఆసక్తి ఎవరి గురించో మా రాధకు తెలుసు.

నవ్వింది.

మా ఇద్దరకూ తెలిసి, స్థిరపడిన విషయానికి మాటలెందుకు? ఆ నవ్వు చాటున వున్న అగాధం లోతు మాకు తెలుసు. ఎన్ని మాటలో ఆ అగాధాన్ని పూడ్చలేవనీ తెలుసు.

"పాప కూడా వచ్చింది. దంతపు బొమ్మల్లే వుందండీ. వయసులో ఉన్నదేమో, మెరిసిపోతూవుంది. కాలేజీలో చదువుతోందట, మీరు కూడా వస్తే బావుండేది."

ఎను ఏనాడూ చూడని, నా ఊహలో పెరిగి, నా మనసంతా నిండిన పాపకు 'ఆకృతి' ఇవ్వాలనిపించింది. ఏవిటో పిచ్చి!

ఆ తరావ్త మూడేళ్ళకు కామేశ్వర్రావు హైద్రాబాద్‌లో కనిపించేడు.

ఇద్దరం పెద్దవాళ్ళమయిపోతున్నాం. నా జుట్టు తెల్లబడుతోంది. అతని జుట్టు వెనక్కి పోయి నుదురు పెద్ద దయింది.

"పాప ఏం చదువుతోంది?"

"మెడిసిన్‌లో జేరిందండీ...."

తెల్లటి చీరలో దంతపు బొమ్మ. చీకటిలో మెరిసే కాంతి పుంజం. ఎడారిలో ఒయాసిస్.

"మీకు మా లక్ష్మిని చూపించాలని వుందండీ. కాని ఇప్పుడు సెలవులు గదా అని 'నార్త్' చూడటానికి వెళ్ళింది. ఢిల్లీలో మేనత్త వుంది...."

నాలుగేళ్ళ తర్వాత నాకు చాలా జబ్బుచేసింది. డాక్టరు విశ్రాంతి కావాలంటాడు. ఏమీ తోచనివ్వని వ్యధ. నా ప్రక్కన దిగులుగా రాధ.

"పాపని చూడాలని వుంది రాధా...."

"రామం గారికి ఉత్తరం రాద్దాం, ఆయనకి తెలిస్తే కామేశం గారి ఎడ్రసు తెప్పించి ఉత్తరం రాద్దాం.'

ఎడ్రసు తెప్పించి కామేశ్వర్రావుకు ఉత్తరం వ్రాసాను "పాపను చూడాలని వుంది. వీలైతే తప్పక తీసుకురండి. పాపకు ఓ చక్కటి బహుమతీ తయారుచేసాను."

రెండు నెలల దాకా ఏ సంగతీ తెలీలేదు. నా వంట్లో అసలు బాగుండలేదు. ఉన్నట్టుండి కామేశ్వర్రావు వచ్చాడు. మనిషి చాలా నీరసించి పోయాడు.

"పాప ఎలా వుంది? రాలేదా?....."

"పాప ఇప్పుడు..."

"మర్చిపోయా.... నా మాటగా చెప్పి పాపకీ పుస్తకం ఇయ్యండి" అని పుస్తకం ఇచ్చాను.

పేజీలు తిరగేస్తున్నాడు కామేశ్వరరావు. నామనసు ప్రశాంతంగా వుంది.

కామేశ్వర్రావు ఆ పుస్తకంలో చూసేది నా మనసులో సినిమా రీలు తిరుగుతోంది. చిన్ని, చిన్న బొమ్మల్లో పాపను రూపొందించాను.

చిన్న పాప... బుచ్చి నోటితో, గుప్పెళ్ళు ముడుచుకొని నిద్రపోతూన్న దేవుని వరం.

చిన్న గౌనుతో వంటింట్లో అమ్మకు పెద్ద గరిట అందించాలని ఆరాటపడే మూడేళ్ళ పిల్ల.

పొట్టి పరికిణీతో అరుగు మీద ఆటలాడుతూన్న బాల.

రెండ జడలతో, పెద్ద కళ్ళతో వింతగా లోకాన్ని చూస్తూ స్కూలుకు వెళ్తూన్న పిల్ల.

కొత్తగా యవ్వన ప్రాంగణంలోకి అడుగిడిన ముగ్ధ.

వయసు సంతరించిన లావణ్యంతో, పెద్ద చదువుతో పరిణితి చెందుతూన్న జవ్వని.

సరసన వున్న 'అతని' బుజం దగ్గరగా నిలబడి, తనని మెచ్చే విభుని రూపం మనసంతా నిండినట్టు, ఆనందమే తానైనట్టున్న యువతి.

వాళ్ళిద్దరూ పెంచి పోషించిన పూల మొక్కలు.... రెండే పూలు.

చివర 'నా పాప - నా ఊహ - ఊహే నా ప్రాణం - పాపే నా ఊపిరి' అని నేను వ్రాసింది చదువుతూ కామేశ్వర్రావు కళ్ళు తుడుచుకున్నాడు.

"పాపకు ఆ 'బహుమతి' ఇవ్వండి. మీకంటే ఆ పిల్ల నాకు ఎక్కువని మీకు తెలుసు. అదే చెప్పండి పాపకు" అని నేను ప్రక్కమీద ఒరిగాను. నాకు వంట్లో నీరసంగా వున్నా మనకు అతి ప్రశాంతంగా వుంది. నాకీనాడు ఏ బాధా లేదు. ఇది లేదూ అన్న వ్యథ లేదు.

మా రాధకు అన్నీ తెలుసు. అన్నీ తెలిసి నన్ను అర్థం చేసుకొని నా ఊహాజనిత ఆనందంలో పూర్తిగా పాలు పంచుకుంది.

రాధకు తెలుసు. కామేశ్వర్రావుకు తెలిసినా పైకి చెప్పడు - నా ఈ ఆనందానికీ, పాపలో నా ఈ ఉత్సుకతకూ కారణం.

.... కారణం మాకు పిల్లలు లేరు.

★ ★ ★ ★

ఆ రాత్రి కామేశ్వర్రావు ప్రయాణమై వెళ్తూ కళ్ళల్లో నీళ్ళు నింపుకుని, గొంతులో గాద్గద్యం ఆవహించగా రాధమ్మ గారితో మెల్లిగా అంటున్నాడు.

"నా కంటే ఎక్కువగా వారు ఆనందించేవారు. నేను ఏమని చెప్పను? నేనింక ఆపుకోలేక మీతో చెపుతున్నాను. ఆయనతో ఈ సంగతి ఏనాడూ అనొద్దు...... 'మీ పాప' మీకూ, మాకూ కూడా ఇకలేదు. క్రితం నెలలో రెండు రోజుల విష జ్వరంతో అంతే అయిపోయింది. ఆ సంగతి తెలిస్తే వారేమవుతారో అని నా భయం.

★ ★ ★ ★

వారం రోజులకు నాకు కామేశ్వర్రావు ఉత్తరం వ్రాసాడు.

"మా లక్ష్మి మీ బహుమతి చూసి ఎంతగా ఆనందించిందో మీకు ఎలా చెప్పగలను? తండ్రిని మించి

ప్రేమించే మీకు 'మీ పాప' తనయుగా తన ప్రేమ అందజెయ్యమంది..."

ఆ ఉత్తరం చదివి వినిపిస్తూ రాధ నా కళ్ళల్లోకి చూసింది.

నా కళ్ళల్లో వెలుగు. మనసంతా నిండిన అవ్యక్తమైన మాధుర్యం.

..... నాకు నిద్ర పట్టింది - చాలా ప్రశాంతమైన, ప్రగాఢమైన నిద్ర.

(ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక : 8-12-1967)



# ఫలశృతి

ఆదివారం.

వేసవికాలం.

సాయం సమయం.

నాలుగవుతోంది.

ఆ ఆదివారం నాలుగు గంటలవేళ ఎండ పేల్చేస్తోంది. భగ్గుమంటోంది.

వేసవికాలం ఎండ నిప్పులు చెరిగేస్తుంది. అది దాని 'రొటీన్'. మూడేళ్ళ బాబిగాడు అలవాటు ప్రకారం నోట్లో వేలేసుకొని నిద్రపోతూన్నడు. అది వాడి 'రొటీన్'.

గదిలో పంకా యాంత్రికంగా, శ్రుతి తప్పకుండా, 'రొటీన్'గా తిరుగుతోంది.

శ్రీమతి లోపల ఏదో పనిలో మునిగినట్టుంది.

ఏంచెయ్యడానికీ తోచడం లేదు.

చదివిన పుస్తకమే అందుకొని పేజీలు తిరగేస్తున్నాను.

విసుగ్గా వుంది. చిరాగ్గా వుంది..మహా 'బోరు'గా ఉంది.

మనసు ఉల్లాసం, అలరింపు కోరుతోంది..మార్పు కోసం మారాం చేస్తోంది.

ఇంతలో మా ఆవిడ మట్టెల చప్పుడు వినవచ్చింది. ఆవిడ నడుస్తూంటే మెడలోని మంగళసూత్రాలూ, కాలి మట్టెలూ వింత ధ్వని చేస్తాయి. ఆ చప్పుడు, ఆవిడ పదిమంది ఆడవాళ్ళతో కలిసివస్తున్నా నేను ఆనవాలు పట్టగలను. తల ఎత్తకుండా దగ్గరవుతూన్న మంగళసూత్రాల ధ్వని వింటున్నాను. ఆ చప్పుడు

నా దగ్గరగా వచ్చి ఆగింది. మా శ్రీమతి నా దగ్గరగా నిలుచున్నదని నాకు తెలుసు. ఆవిడను నేను చూడకపోయినా ఆవిడ నిలుచున్న తీరూ నాకు తెలుసు. అలా ప్రక్కగా నిలుచున్నదంటే ఏదో విశేషముందన్నమాటే.

నే నడగదలుచుకోలేదు.

నేను ఏమీ అడక్కుండా తలెత్తి ఆవిణ్ని ఓ మాటు చూసి చదువులో పడ్డాను.

నే చెప్పానుగా... నే నడగదలుచుకోలేదు.

ఇంకో కారణం కూడా వుంది... తర్వాత చెప్తాను.

"ఇదిగో...."

"..........''

"మిమ్మల్నేనండీ? ఇది విన్నారూ?"

"ఏదీ...." అన్నాను ఎటో చూస్తున్నట్టు నటిస్తూ.

"మన పక్కింటి అవతల ఉన్న 'డాబా ఇంట్లోకి' ఎవరో కొత్తగా వచ్చి దిగారు - సాయంత్రమే లెండి'

"ఉహూ..."

"నేనేం నచెప్పినాన మీరు 'ఉహూ', 'అలాగా', తప్ప కాస్తయినా ఉత్సాహం చూపించరేం? మీకా పుస్తకాలుంటే సరి - ప్రపంచ మేమైనా లెక్కలేదు. ఇంతకీ - ఆ 'డాబా ఇంట్లో' దెయ్యాలున్నాయని క్రితం సారి ఆ ఇంట్లో దిగిన 'ఇంజనీరు' గారు ఖాళీ చేసి వెళ్ళిపోలేదుటండీ? అలాటింట్లోకి ఎవరో కొత్తగా వచ్చారని నేనేదో విశేషం చెప్పబోతే మీకేం పట్టనట్టు 'ఉహూ' అని ఊరుకుంటారేవిటీ?"

"ఊహూఁ అని ఊరుకోకపోతే ఏం చెయ్యమంటావో చెబుదూ కాస్త. పోనీ ఇప్పుడే వెళ్ళి ఆ డాబా ఇంట్లో దిగినవాళ్ళని కాళీ చేసెయ్యండి, లేకపోతే ప్రమాదం అని చెప్పి రమ్మంటావా? నేనలా చేస్తే వచ్చినవాళ్ళనందర్నీ బెదర గొట్టేస్తున్నానని ఆ ఇంటిగలాయన మన మీద దండెత్తగలడు సుమీ."

మా ఆవిడకు కోపం వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి, ఆవిణ్ణి కాస్త కవ్వించాలని తోచింది.

చెప్పానుగా - కారణముందని.

ఆవిడ చెప్పవలసినదింకా వున్నట్టుంది. అంచేతే కోపం తమాయించుకొని మొదలెట్టింది.

"ఇద్దరూ చిన్నవాళ్లేటలెండి. పిల్లా పీచూ లేరట - మన 'రావుడు' చెప్పింది. సామాను దింపుతుంటే చూసిందట. ముద్దొస్తూ ఓ చిన్న 'గాద్రెజ్' బీరువా కూడా వుందిట. 'రావుడు' అన్నీ చూసింది లెండి."

"రావుడెవడే? 'రావుడు' చూసింది అంటావేమిటీ? స్త్రీ పురుష భేదం మరిచి అలా కలిపేస్తే ఎలా? నీ క్కొంచెం తెలుగు గ్రామరు చెప్పనా?" అన్నాను నవ్వుతూ.

"మీ వరస మరీ బావుందండీ. 'రావుడు ఎవడూ?' అంటారేమిటీ? అది మనింట్లో పనిచేసేదండీ. పదిహేను రోజుల క్రిందట ఆ 'అప్పి' మానేస్తే దీన్ని పెట్టుకున్నాం కదండీ, ఆఖరికి ఇంట్లో పనిచేసేదెవరో కూడా మీరు పట్టించుకోరు, ఇంకెలా ఈ మనిషితో సంసారం ఈదడం?"

"ఇంతకీ ఆ కొత్తగా వచ్చినవాళ్ళకి ముద్దొస్తున్న ఓ చక్కటి 'గాద్రెజ్' బీరువా వుందంటావ్? అంతేనా?" అన్నాను చిలిపిగా నవ్వుతూ.

"ఆ! అందరికీ అన్నీ నవుంటాయి. అలాటి బీరువా తెమ్మని ఎన్నాళ్ళబట్టో చెబుతున్నా - మీరు వింటేగా? పదేళ్ళబట్టి సంసారం చేస్తున్నా - ఓ సామాను తెద్దామని గాని, ఓ చిన్నం, చిదక సంపాదిద్దామని గాని మీకుంటేగా? నే చెప్పినవన్నీ విని, వేళాకోళంగా నవ్వడం ఒహటి మిగిలింది."

మా ఆవిడకు పూర్తిగా కోపం వచ్చేసింది.

నే కోరుకున్నది లభించింది.

మా ఆవిడ చిరుకోపంతో 'రుసరుస'లాడితే నా కంటికి ముగ్ధమోహనంగా వుంటుంది. కోపంతో పెదాలు బిగించి, మూతి ముడుస్తుంది. మూతి వంపులో ఎంతో అందాన్ని ఇముడుస్తుంది. నాకా ముడుచుకున్న నోరూ, పెదాల వంకర, ఆ మూతి వంపులోని అందం, మెరుస్తూన్న చెక్కిళ్ళ సొగసూ చూడాలని మరీ, మరీ అనిపిస్తుంది.

అదీ... నే చెపుతానన్న కారణం.

నేను నవ్వుతూ ఆ పెదాల వంపు చూస్తూంటే, ఆవిడ 'రుసరుస' లాడుతూ 'విసవిసా' వంటింటి వేపు నడిచింది.

ఆవిడ చెయ్యి విసురుతూ, జడ విసురుకుంటూ కోపంతో విసవిసా వెళ్తూంటే వెనకనించి చూడ్డం... అదో అనుభవం.

ఇక్కడ అసలు సంగతి కాస్తా చెప్పేస్తాను.

మా ఆవిడ సాంప్రదాయ సిద్ధంగా పెరిగింది. ఆమె పన్నెండో యేట నేను ఆమె మెడలో సూత్రధారణ చేశాను. నా పెళ్ళికి ముందు కూడా వాళ్ళకూ మాకూ బంధుత్వముంది. సాంప్రదాయంలో పెరిగినా ఆమెలో చాదస్తం లేదు.

ఆమె మాటల్లో విశాలమైన సంస్కరణ భావాలు పలకవు. కాని ఆమె అమాయకపు ధోరణిలో వింత సొగసుంది. ఆ సొగసు, ఆమెకు తెలీకుండానే, ఎన్నో రకాలుగా నాపై చిలుకుతుంది. అన్నిటిలోనూ సొగసైనది ఆమె చిరుకోపం - అది వచ్చినప్పటి రుసరుసానూ.

చేస్తున్న తప్పు ఒప్పుకొంటేనే మంచిది.

ఆమె నా ధోరణిలోకి కవ్వించడం నాకు అప్పుడప్పుడు అలవాటు.

ఆమె అలవోకగా ప్రదర్శించే ఆ అలకలో 'రొటీన్' లోని స్తబ్దత్వం మాయమై జీవసంచలనం నిండైన శ్రుతిలో పలుకుతుంది. ఆ అలకలో అలరింపు వుంది, మధురిమ వుంది.

రెండోరోజు నేనాఫీసు నుంచి ఇంటికి వచ్చేటప్పటికి, వంటింటి గుమ్మం చివర చీడీ మీద కూచుని, మా పనిమనిషి ('నిన్న మా ఆవిడన్న 'రావుడ'న్న మాట) వంటింట్లో పనిచేసుకుంటూన్న మా ఆవిడతో ఏదో చెబుతోంది. నన్ను చూడగానే మాట మధ్యలోనే ఆపేసి, లేచి పక్కకు తప్పుకొంది. చెబుతూన్న సంగతి ఆ డాబా ఇంటిలోకి కొత్తగా వచ్చినవాళ్ళ సంగతే అయి వుంటుందనిపించింది.

నేను వంటింటి గడప మీద కూర్చుని ఆవిడ సన్నగా తరుగుతూన్న దొండకాయ ముక్కలు చూస్తున్నాను. శాంత వంటింటిలో పీట వేసి, కాఫీ అందించింది.

"ఏవిటో అనుకున్నాను గాని - ఆ డాబా ఇంటిలోకి వచ్చినాయన వొట్టి 'షోకేళా' అండీ! నేను పెరటిలో పని చేసుకుంటున్నంతసేపూ, ఆ డాబా మీద ఏక పచార్లే" అంది శాంత.

నేను కాఫీ గ్లాసు తీసుకుని గదిలోకి వచ్చేశాను.

కాసేపటిలో చేతులు తుడుచుకుంటూ శాంత వచ్చింది. పేపరు మడిచి 'ఏవిటన్నట్టు?' చూశాను.

"ఎల్లుండి 'బాబు' పుట్టిన రోజు - ఓ రెండు కుంచాల సెనగలు తెండి. పేరంటానికి వచ్చే పిల్లలకి 'టాఫీలు' మర్చిపోకండేం? కావలసిన అరటిపళ్ళు, తమలపాకులూ నే తెప్పించేస్తాలెండి. మరిచిపోయా చెప్పడం - ఆ డాబా ఇంట్లోకి కొత్తగా వచ్చినావిణ్ణి కూడా పిలుద్దామనుకుంటున్నాను. మన రావుడే

వాళ్ళింట్లో కూడా పనికి కుదిరింది. సరదా అయిన పిల్లట.'' అంది శాంత.

'రెండు కుంచాల సెనగలంటున్నావ్ బాబు పుట్టిన రోజుతోపాటు నీ పుట్టిన రోజు కూడా కలిసివచ్చిందేవిటీ?'' అన్నాను నవ్వుతూ.

''మరే! నేనింక పుట్టినరోజు పండగ చేసుకోవడ మొక్కటే తక్కువైంది. మీకన్నీ వేళాకోళాలే. అయినా మా చిన్నతనంలో మా పుట్టిన రోజనగానే, మా అమ్మ నాలుగు కుంచాలు సెనగలు నాన బోసి' '...

"ఆలిస్యమెందుకు? సెనగలు ఇవాళే తీసుకొస్తాను'' అంటూ వీధిలోకి వచ్చాను. మా ఆవిడ పుట్టింటి సంగతి మొదలెడితే ఆపదని తెలిసి.

మా ఇంట్లో పేరంటం రోజున ఇంటి దగ్గర పేరంటం హడావిడి ఎలాగూ ఉంటుందని, అటు ఇటూ తిరిగి, చీకటి పడ్డాక ఇంటికి వచ్చాను.

హాల్లో తీవాసీలూ, చాపలూ పరిచి వున్నాయి. వాటినిండా శెనగలు, తమలపాకులూ, అరటిపళ్ళ తొక్కలూ - చాలా హడావిడిగా వుంది.

పెరటిలోంచి మాటలు వినబడుతున్నాయి.

"రేపోమాటు మా యింటికోసారి రండి'' అంటున్నారెవరో శాంతతో

పెరటి తలుపు వేసిన చప్పుడైంది.

ఇంతలో శాంత వచ్చింది.

"పేరంటం హడావిడి ఐపోయినట్టుందే" అన్నాను శాంతతో.

"ఐపోయింది లెండి. ఆ డాబా ఇంట్లో పిల్ల కూడా పేరంటానికి వచ్చిందండోయ్. పేరు లక్ష్మిట, ఎంతో కలివిడైంది లెండి. మనసిచ్చి మాట్లాడుతుంది. ఎంత చక్కటి చీర కట్టుకుందనుకున్నారు - నాకు పెళ్ళిలో మీవాళ్ళు పెట్టిన పెద్ద చీర ఉంది చూడండీ - ఆ రంగే కాని, పవింటంచు ఇంకా ధాతుగా మెరుస్తోంది....''

నిజానికి మా వాళ్ళు శాంతకు పెళ్ళిలో పెట్టిన చీరగాని, ఆ రంగు కాని ఇప్పుడు నాకు బొత్తిగా

జ్ఞాపకం లేదు. అలాగంటే శాంత నొచ్చుకుంటుంది. అర్ధమయినట్టుగానే తలూపాను.

"ఆ అమ్మాయి మెడలో చంద్రమారం ఎంత చూడముచ్చటగా ఉందనుకున్నారు! నా రాళ్ళ నెక్లెసు చూసి ఈసారి ఇలాటిది చేయించుకుంటానంది. వాళ్లింటికోసారి రమ్మనమని మరీ మరీ చెప్పింది. వీలు చూసుకు వోసారి వెళ్ళి రావాలి."

"మరి ఆ ఇంట్లో దెయ్యాలున్నాయన్నావుగా?" అన్నాను.

"నేనన్నానా ఏవిటీ? ఎవరో అనుకుంటే చెప్పాను. పైగా ఎవరి అదృష్టం వాళ్ళది. వీళ్ళు హాయిగానే వుంటున్నారు మరి. సరేగాని, మీరు కాస్త ఆ గదిలోకి వెళ్తారూ - ఈ హాలంతా నానా ఖంగాళీగానూ వుంది' ' అంటూ పెరటిలోనికి వెళ్లింది.

...పదిహేను రోజులు గడిచిపోయాయి. ఆ డాబా ఇంట్లో దంపతుల గురించి తనకి తెలిసిన సంగతులు, శాంత అప్పుడప్పుడు నాకు చెబుతూ ఉండేది.

ఆ రోజు ఆఫీసు నుండి వచ్చి భోజనం చేసి పడుకొని చదువుకుంటున్నాను. బాబిగాణ్ణి చిన్న మంచం మీద పడుకోబెట్టి వచ్చింది శాంత.

వక్కపొడి నా అరచేతిలో పోసింది. తాంబూలం వేసుకోడంలో నాకు పెద్ద ఆసక్తి లేదు. కాని శాంత ఆకుల ఈనెలు తీసి, చిలకలు చుడుతూంటే చూడ్డం నాకు ఎతో సరదా. దూమెరుగ్గా సున్నం రాసి, సన్నగా ఈనెలు తీసి, చిన్న చిన్ని చిలకలు చుట్టడం - శాంత చేతిలో ఒక కళగా మారింది. నేనూ అలా చక్కగా ఈనెలు తీద్దామని అప్పుడప్పుడు ప్రయత్నించడం, ఆకులో సగభాగం నా చేతిలోకి వూడి చాల మాట్లు అనుభవమై ఆ ప్రయత్నం మానుకున్నాను. ఆమె రెండు చిలకలు చుట్టి చిటికిన వేలికి గుచ్చింది. మిగతా అకుల ఈనెలు తీస్తోంది. ఆమె గోళ్ళు గోరింటాకు ఎరుపుతో మెరుస్తున్నాయి. ఎడం అరచేతిలో చిన్న చిన్న గోరింటాకు చుక్కలూ, అరచేతిలో బంతి పువ్వు తాలూకు రేఖలూ శోభతో మెరుస్తున్నాయి.

చిలకలు చుట్టి నాకు అందించి "ఆనాడనగా లక్ష్మి దగ్గరకు వెళ్దామనుకున్నానా - చివరకు ఈవేళ వెళ్ళడం పడిందండీ. ఓ గంట కూచుని వచ్చాను. వాళ్ళాయనకి టీ కంపెనీలో పనిట. పాపం అస్తమానూ ఇతర వూళ్ళు తిరగాలిట. లక్ష్మి ఒక్కతే ఉండాలి - పెద్దవాళ్ళెవరూ దగ్గర కూడా లేరు. పాపం, ఆయన్ని ఆ రోజున డాబా మీద పచార్లు చేసేడన్నానా - ఎంత మంచివాడనుకున్నారు. 'కేంప్'కు వెళ్ళి నేనక్కడ ఉండగానే తిరిగి వచ్చాడు లెండి. మంచినీళ్లు కావలసి, ఇంట్లో నేనున్నాని తెలిసి, అటు తిరిగి వెళ్ళి ఆయనే

తెచ్చుకున్నాడు. మర్యాద తెలిసిన మనిసే లెండి. చిన్నవాడే కూడానూ" అంది శాంత.

"ఎన్నేళ్ళుంటాయేవిటీ?" అన్నాను.

"ఓ పాతికేళ్ళు ఉండొచ్చు."

"ఆ వయసు కంటే ఒక్క ఏడాదే పెద్ద అయిన నువ్వు అంత పెద్ద తరహాలో మాట్లాడతావే మరీ? ఓ పిల్లా - నువ్వూ చిన్నదానివే" అన్నాను ఆమె సిగలో విచ్చుకుంటున్న పువ్వులు చూస్తూ.

"సరేలెండి...." అని సొగసైన ఓ చిన్న చిరునవ్వు నా మీద పారేసి మళ్ళా చెప్పడం మొదలెట్టింది. "ఆయన కథలు రాస్తారుట - లక్ష్మి చెప్పింది. కేంప్ నించి ఇంటికి వొచ్చిన రోజుల్లో డాబా మీద ఆలోచిస్తూ పచార్లు చెయ్యడం ఆయన కలవాటుట."

ఆయనెవరో కథకుడవగానే నాకు ఆసక్తి కలిగింది.

"ఆయన పేరేవిటో?" అన్నాను.

"మీరు భలేవారండీ... ఆ అమ్మాయి చెబుతుందా ఏవిటీ? అప్పటికీ వేళాకోళంగా అడిగాను. సిగ్గుపడి ఊరుకుంది. అయినా, ఆయన అసలు పేరుతో కథలు రాయరుట. ఏదో 'కౌపీనం' అనో ఏదో పేరు చెప్పిందండీ...ఆ పేరుతో రాస్తారుట."

నాకు నవ్వొచ్చింది.

"కౌపీనం" ఏవిటీ? పండితుల ఇంట్లో పుట్టావు - 'కౌపీనం' అంటే అర్థం ఈపాటికే తెలిసికొని ఉండాల్సింది.

"ఏమో బాబూ! నాకవన్నీ తెలియవు.

'కౌపీనం' అనో 'కౌండిన్యస' అనో ఏదో పేరు చెప్పింది. అయినా వెనకటి రోజుల్లో ఈ పేర్లన్నీ వుండేవా ఏవిటీ? మా పెద్ద మేనమామ గారు, పద్యకావ్యం రాసి సుబ్బరంగా 'వేంకట అప్పయ్య నృసింహ శాస్త్రి విరచితము' అని అచ్చు కొట్టించుకున్నారు. ఈ కుదింపు పేర్లన్నీ ఈ మధ్య బయల్దేరాయి - మునుపు వుండేవా ఏవిటీ?" అంది శాంత.

"మీ మేనమామ రాసింది మహా కావ్యం కాదులే వంద పద్యాల శతకం, పద్యకావ్యమని ఘరానా

మాటలెందుకు?" అన్నాను ఆవిణ్ణి రెచ్చగొడదామని.

చెప్పానుగా... మా ఆవిడ 'రుసరుస' నాకిష్టమనీ.

పుట్టింటి తాలూకు వాళ్ళ మీద ఆవిడ ఈగ వాలనివ్వదని నాకు తెలుసు.

ఆవిడ అప్పుడే మూతి విరిచింది. పెదాలు ముడిచి, మూతివంపులో అపూర్వమైన అందాన్ని దాచింది. కుర్చీ పీట మీద కూచున్నదల్లా, ఛుట్టన లేచింది విసురుగా రెండడుగులు వేసిందల్లా ఆశ్చర్యంతో వెనుదిరిగి చూసింది. ఆమె చీర చెంగు నా చేతితో వుండిపోయింది. ఆ చెంగు నా చేతికి చుట్టుకుంటూంటే ఆమె సిగ్గుతో ముడుచుకుపోయింది. చిరుకోపంతో మెరుస్తున్న ఆ బుగ్గల్లో సిగ్గుపూలు పూచి ఆమె సిగలో అమరిన పూలతో సరసమాడుతున్నాయి. చిన్న చిరునవ్వు నవ్వుతూ, మృదువుగా అతి లాలనగా నా చేతి పట్టులోంచి తప్పించి, బుజాల నిండుగా కప్పుకొని, వంటింట్లోకి వెళ్ళి మరచెంబుతో మంచినీళ్ళు తెస్తూ మనోహరంగా, మోహనంగా నడిచి వచ్చింది శాంత.....దగ్గరగా... నా దగ్గరగా.

రోజులు దొర్లిపోతున్నాయి. ఆఫీసు పని, నా ఇతర వ్యాపకాలతో కాలం గడిచిపోతోంది.

అప్పుడప్పుడు ఆ దంపతుల గురించి వివరాలు శాంత నాకు అందజేస్తూనే వుంది. ఆయనెవరో నేను చూడకపోయినా, సంగతులు తెలుస్తూనే ఉన్నాయి. ఆయన చిన్నవాడే. కథలు రాస్తాడు. మూతి కొద్దిగా ఎత్తు. ఎగదువ్విన జుట్టు, చిన్న మీసం. ఆయన తాలూకు దగ్గర బంధువు ఉద్యోగాలు కూడా నాకు తెలిసాయి. ఆయన పెద్దన్నగారికి రైల్వేలో పెద్ద ఇంజనీరునట. చిన్నన్న ప్లీడరు. మేనమామకి హైదరాబాదులో ఏదో టీ కంపెనీలో పెద్ద ఉద్యోగం.

మనిషిని నేను కలవకపోయినా యాధాలాపంగా నాకు తెలిసిన వివరాలకి నేనే ఆశ్చర్యపోయాను. నా గురించి కూడా ఆయనకు తెలిసే ఉంటుంది.

కాని ఇద్దరం కలుసుకోలేదు. వింతగానే అనిపించింది.

శాంత ఆయన్ని కలుసుకోమని ఓసారి చెప్పింది. వీలున్నప్పుడు కలుసుకుందామనే అనుకున్నాను. అనుకున్నానే గాని జరగలేదు. కలుసుకొందామన్న ఊహలోనే రోజులు గడిచిపోతున్నాయి. ఆయన నెలలో సగం పైన ఊళ్ళో ఉండడు. ఒకవేళ మేము కలుసుకున్నా, వివరాలన్నీ ఇది వరకే తెలియడం మూలాన, మాట్లాడ్డానికి కూడా ఏమీ ఉండదేమోననిపించింది.

ఆరోజు జలుబు చేసి, తలనొప్పిగా ఉండి ఆఫీసుకు వెళ్ళలేదు. పన్నెండింటికి తలనొప్పి తగ్గింది..

తగ్గింది కదా అని నిద్ర పోయాను. లేచేటప్పటికి తలనొప్పి ఎక్కువైంది. లేవకుండానే అమృతాంజనం రాసుకుంటున్నాను. ప్రక్కగదిలో శాంతతో ఎవరో మాట్లాడుతున్నారు.

ఆమె "ఇక వాస్తానక్కాయ్! బాబునోసారి సాయంత్రం మా ఇంటికి పంపండి" అంటోంది. శాంతా, ఆవిడ హాలులోకి వచ్చారు, శాంత ఆమెకు బొట్టు పెడుతోంది. ఆమె పక్కగా కనబడుతోంది నాకు. ఆమె వెళ్తూ నన్ను చూసింది. ఆమెను ఎక్కడో చూసినట్టుంది. కాని జ్ఞాపకం రావడం లేదు.

శాంత గదిలోకి వచ్చింది "లేచేరా?" అంటూ.

నేను అమృతాంజనం రాసుకోడం చూసి "మధ్యాహ్నం నిద్ర పోవద్దంటే విన్నారు కాదు గదా - మళ్లా ఎలా వుందో ఏవిటో;" అంటూ ఆదుర్దాగా వళ్ళు చూసింది. జ్వరం లేదని నాకు తెలుసు. ఆమె కూడా తృప్తిగా నిట్టూర్చింది.

"ఆ అమ్మాయి - లక్ష్మి వచ్చిందండీ. ఇప్పుడే వెళ్ళింది."

"ఏవిటి కబుర్లో?" అన్నాను.

"ఏవుంటాయి - ఏదో సంసార విషయాలు మాట్లాడుకున్నాం. పాపం వాళ్ళ చిన్నక్క కాపురం, సరిగా లేదుట. కట్నం సొమ్ము చాలదని అత్తగారు కాపరం పడనీయలేదుట. వాళ్ళ బావ మంచివాడేనట. ఏం లాభం? ఆ అత్తగారు కర్కోటక ఘటమైనప్పుడు! లక్ష్మి చెల్లెలికి పెళ్ళి చేయాలిట....కాలేజీలో చేరిందటలెండి. మన బాబిగాడంటే లక్ష్మికి ప్రాణమే అనుకోండి. లక్ష్మి వయొలిన్ ఎంత బాగా వాయిస్తుందనుకున్నారు. మొన్న వాళ్ళింటికి వెళ్ళినప్పుడు విన్నాను. మరిచిపోయానండోయ్! ఏం తోచడం లేదంటే లక్ష్మికి మీవి మూడు పుస్తకాలిచ్చాను..."

నాకు దగ్గు వచ్చింది. మంచినీళ్ళు తాగినా తగ్గలేదు.

"మీకు కాస్త మిరియాల కషాయం ఇస్తానుండండి... ఆ దగ్గు, జలుబూ తగ్గుతాయి" అంటూ వెళ్ళింది శాంత.

మర్రోజు నాకు నిమ్మళించింది. మళ్ళా ఆఫీసు, పుస్తకాలూ, స్నేహితులు. ఎన్నాళ్లు గడిచినా ఆ డాబా ఇంట్లో ఆయన్ని కలుసుకోడం పడలేదు. ఆ అమ్మాయి లక్ష్మిని మా ఇంటి దగ్గర ఐదారుసారులు చూశాను. ఛామనఛాయ, పెద్ద కళ్లూ - బొమ్మలా, చక్కగా ఉంటుంది. ఆమె నోరు అదో తీరులో చిరునవ్వు నిలుపుకుని ఉంటుంది. ఆ అమ్మాయిని నేకెక్కడో చూసాను. 'ఎక్కడ చూశానా?' అని తర్కించు కున్నాను.

ఉన్నట్టుండి జ్ఞాపకానికొచ్చింది.

మూడేళ్ళ క్రితం ఆ అమ్మాయిని పెళ్లిచూపులకని కూచోపెట్టినప్పుడు, మా రామంతో పాటు చూశాను. రామం మా బాబాయిగారి అబ్బాయి. వాడు పెళ్లికొడుకు. నేను పెళ్ళి పెద్దనన్నమాట. నాకలాటి విషయాల్లో అట్టే పరిజ్ఞానం లేదని చెప్పినా మా బాబాయి 'మేమందరం చూడ్డం ఐందిగా...మేము మళ్ళా ఎందుకు! నువ్వు వాడికి కాస్త తోడు వెళ్ళు' అని మరీ మరీ చెప్పి ఒప్పించాడు.

అవును. అప్పటికే ఈ అమ్మాయి వయొలిన్ చాలా చక్కగా వాయించింది.

అలాటి సందర్భాల్లో అలవాటు లేక నేను మరీ ముడుచుకుపోతాను. నా ముభావంతో పాటు, కాస్త సిగ్గుపడ్డానేమో గూడా! మొదట వాళ్ళు నేనే పెళ్లికొడుకునని భావించి మర్యాద ప్రారంభించి, తర్వాత సంగతి తెలిసి తప్పు దిద్దుకున్నారు. ఎంచేతనో, మా రామం ఈ పిల్ల నచ్చలేదన్నాడు. నాకీ నాటికీ సమస్యే - 'వాడెందుకు కాదన్నాడా?' అని.

అదీ కథ.

మొత్తానికి ఆమె నప్పుడు చూసాను. ఆమెకు నేను జ్ఞాపకముండి ఉండను. ఈ సంగతి శాంతకు నేను చెప్పలేదు. కారణం వుండి కాదు - ఊరికనే. ఈ సంగతి జ్ఞప్తికొచ్చాక లక్ష్మి భర్త ఎలా వుంటాడా? అనిపించింది. తప్పక కలుసుకోవాలని మళ్ళా అనుకున్నాను.

ఈ లోపున మా ఆఫీసు ఇన్స్పెక్షను వచ్చింది. ఊపిరి తిప్పలేనంతపని నెత్తిన పడింది. దానితో సతమతమై పోతున్నాను.

ఆఫీసు నుండి ఇంటికి ఆలస్యంగా వచ్చిన నాకు బోజనం వడ్డిస్తూ, శాంత ఈ ముక్కా, ఆ ముక్కా, లక్ష్మి సంగతి మొదలెట్టింది.

"ఎంత మంచి మనసనుకున్నారు లక్ష్మిది. 'అక్కా, అక్కా' అంటూ ఒక్క క్షణం వదలదనుకోండి. ఇక బాబు పగలంతా వాళ్ళింట్లోనే వుంటాడు గదా! పాపం, ఆ పిల్లకి అంతా కొత్తే సుమండీ. ఊరగాయలు వాళ్ళమ్మగారే పెట్టి పంపించారుట, ఆఖరకు అప్పడాలూ, వడియాలు పెట్టుకోడం కూడా చేతకాదు లక్ష్మికి. మొన్నామధ్య ఏదో మాటొచ్చి 'అప్పడాలు అయిపోయాయి అక్కయ్యా' అంది. ఆదో మహాపనా అని మొన్న దగ్గర కూచోపెట్టుకొని చెప్పి, ఓ మూడు వందల అప్పడాలు వత్తి ఇచ్చాను. మరిచిపోయా! మీ పుస్తకాలు తిరిగి ఇచ్చిందండోయ్ ఇవాళ" అంటూ శాంత రెండు పుస్తకాలు తీసుకొచ్చింది.

"మూడు పుస్తకాలిచ్చేనన్నావు - రెండే వున్నాయే" అన్నాను.

"మరేనండీ! లక్ష్మి కూడా ఎంతో నొచ్చుకుంటూ చెప్పిందండీ. వాళ్ళ పక్కింటి వాళ్ళు చదివిస్తామని ఆ పుస్తకం తీసికెళ్ళి వాళ్ళ చిన్నబ్బాయి అట్ట, పెద్దబ్బాయి మధ్య కాగితాలూ చింపేసారని, కొత్త పుస్తకం బజారు నుంచి తెప్పించి ఇస్తామని కబురు పంపించారుట. ఇచ్చేస్తారులెండి పుస్తకం."

నాకు తెలుసు ఆ పుస్తకం తిరిగిరాదని. నేను మనసులోనే అనుకున్నాను- రేపు ఆ పుస్తకానికి ఇంకో 'కాపీ' కొనాలని.

నేనీ మాటలేవీ పై కనలేదు. ఆ లక్ష్మి గురించి ఏదైన కష్టం కలిగించే మాట కూడా మా శాంత వినే ధోరణిలోలేదు. వాళ్లిద్దరి మధ్య ఆత్మీయత అంతలా పెనవేసుకుపోయింది.

ఆర్నెల్లు గడిచిపోయాయి. ఏ కారణం మూలానైతేనేమి లక్ష్మి భర్తని నేను కలుసుకోలేకపోయాను.

నాకా బుధవారం మా పెద్ద అన్నగారి దగ్గర నుండి ఉత్తరం వచ్చింది - ఆస్తి పంపకాల విషయమై వెంటనే రావలసిందని. ఆఫీసుకు సెలవు పడేసి బయలుదేరాను. అక్కడ పని అవలేదు. మూడో రోజున తిరిగి వచ్చాను.

ఆ రాత్రి శాంత చెప్పింది : "మీరులేని రెండు రోజులూ ఎలా గడపాలిరా అని ఎంత భయపడ్డానను కున్నారు! పాపం, లక్ష్మి వచ్చి తోడుగా పడుకొంది -...ళ్ళాయన కూడా 'కేంప్' కెళ్ళారుట సమయానికి. ఆ మధ్య ఓసారి చెప్పినట్టున్నాను - లక్ష్మికి పెళ్ళికెదిగిన చెల్లెలుందని... మీ ఎరికలో ఏదైనా సంబంధం వుంటే చూడండి".

"చూద్దాంలే" అన్నాను మా బాబు అల్లరి చూస్తూ.

"లక్ష్మి పెట్టే చాక్‌లెట్లు అలవాటయి బాబు రోజా అవి ఉంటే గాని పడుకోనంటున్నాడండీ".

"ఏరా అవునా?" అన్నాను బాబుని చూస్తూ.

వాడు నవ్వుతూ నోరు తెరిచాడు - ఎర్రటి పంచదారబిళ్ళ నోట్లో నానుతోంది.

..మళ్ళా పది రోజులయాక మా అన్నగారి దగ్గర నుండి ఉత్తరం వచ్చింది రమ్మనమని. నేను బయలుదేరి వెళ్ళాను. ఈసారి పని తొందరలో తెమలలేదు. కాగితాల్తో పనేమో, రాతకోతలూ అవీ పది పదిహేను రోజులు అనుకోకుండా పట్టాయి. పని పూర్తి చేసుకొని ఓ సాయంత్రం ఇంటికొచ్చాను.

శాంత బయటికి ఎక్కడికో వెళ్ళే ప్రయత్నంలో ఉంది.

నన్ను చూడగానే, కాళ్ళు కడుక్కోందుకు నీళ్ళిచ్చి 'వచ్చారా బాబూ, ఇన్నాళ్ళూ హడలి చస్తున్నాను' అంది.

"అంత భయమెందుకు? లక్ష్మి వుందిగా తోడుగా" అన్నాను శాంత ఇచ్చిన కాఫీ చప్పరిస్తూ.

"మీరు ఇలా వెళ్ళారా - వాళ్ళూ బదిలీ అయి వెళ్ళిపోయారండోయ్" అంది యాధాలాపంగా శాంత కాటుక పెట్టుకుంటూ.

నాకెందుకో కాఫీ తాగబుద్దేయ లేదు. గ్లాసు కిందపెట్టాను.

చివరకు లక్ష్మి భర్తను నేను కలుసుకోలేకపోయాన్న మాట. ఆ బార్యాభర్తలిద్దరితోనూ నాకు పరిచయం లేదు. కాని వాళ్లు వెళ్ళిపోయారనగానే నా కెందుకో దిగులైంది.

"ఏ వూరు వెళ్ళారో?" అన్నాను.

"ఏమోనండీ! ఏదో చెప్పింది - కాని నేనిప్పుడు మరచిపోయాను సుమండీ".

"అంత స్నేహంగా ఉన్నారు గదా - వాళ్ళ 'అడ్రసు' అయినా తీసుకోలేదూ?"

"నాకంత తట్టలేదు సుమండీ! ఐనా ఉత్తరాలు రాసుకోడానికి మాకేమంత సంగతులు వుంటాయి గనక! పైగా వాళ్ళు వెళ్లే రోజున బాబు జ్వరంతో మూసిన కన్ను తెరవలేదు. వాడితోనే సరిపోయింది నాకు. నేనవతల పేరంటానికి వెళ్ళాలి - సంగతులన్నీ వచ్చి చెప్తాను లెండి. కాస్త బాబుని పట్టుకోండి - నేనిప్పుడే వస్తాను" అంటూ శాంత గదిలోకి వెళ్ళి తలుపు వేసుకొంది.

శాంత మాటలు నన్నెంతో ఆశ్చర్య పరిచాయి. మరెంతో వింతగానూ తోచాయి.

ఏవిటో ఈ ఆడవాళ్ళ మనస్తత్వం!

లక్ష్మి ఇక్కడ వున్నప్పుడు ఇద్దరూ ఒక ప్రాణంగా కలిసిమెలిసి వున్నారు. ఒకళ్ళ కష్టసుఖాలు ఒకళ్ళకు చెప్పుకొని ఓదార్చుకొన్నారు. తోచిన సహాయాలు చేసుకున్నారు.వరసలు కలుపుకున్నారు. ఊహించలేనంతటి అనుబంధాలు ఏర్పరచుకొన్నారు. మనుషుల్ని చూడకపోయినా, ఒకరి తాలూకు చుట్టాన్ని మరొకళ్ళకి మనోనేత్రం ద్వారా పరిచయం చేసుకున్నారు. ఆ బంధువుల కష్టసుఖాలు కూడా కూడా కూడబలుక్కున్నారు. శాంత నన్నో మాటు లక్ష్మి చెల్లెలికి సంబంధం కూడా చూడమంది.

ఇంత ఆత్మీయత కుదుర్చుకొని, అంత సులభంగా బంధాల్ని దాటి విడిపోయారు. ఈనాడు వాళ్ళు ఎక్కడ ఉంటున్నదీ కూడా శాంతకు తెలీదు. మళ్ళీ ఏనాడైనా కలుసుకుంటే ప్రాణమిచ్చుకుంటారు.

చిత్రమేననిపించింది.

నేను అంత త్వరగా ఎవరితోనైనా స్నేహబంధం కుదుర్చుకొని, చేతనైన సాయం చేసి, వాళ్ళలా మనసులు పంచుకొని, మళ్ళా అంత త్వరగా ఆ బంధాన్ని, అంత సహజంగా వదులుకోగలనా? అనిపించింది.

నేనూ రెండూ చేయలేను.

శాంత ముస్తాబై వచ్చింది. పట్టుచీర కట్టింది. వెడల్పాటి పవిటంచు ధగధగా మెరుస్తోంది.

"ఎవరింట్లో పేరంటం?" అన్నాను.

"ఆ డాబా ఇంట్లోకి కొత్తగా ఎవరో వచ్చారు. ఆవిడ పిల్చింది" అంది శాంత బాబు కాళ్ళకి జోళ్ళు పట్టిస్తూ.

మా ఆవిడ నోమాటు కవ్వించి, 'రుసరుస' లాడితే చూడాలనిపించింది.

ఓ ఆలోచన వచ్చింది.

చప్పున అనేసాను.

"నీతో చెప్పడం మర్చిపోయాను. శాంతా - ఆ లక్ష్మి మొగుణ్ణి నేను ఊరికి వెళ్ళేముందు పది రోజుల ముందు కలుసుకొన్నాను. ఎవరో కొత్తవాడనుకున్నానా తీరా చూస్తే, మా వెంకటేశం బావ తోచదువుకున్నాడతను. మనకి దూరపుబంధువు కూడాను. ఆరోజుల్లో అప్పుడప్పుడు మా ఇంటికి వచ్చేవాడు కూడానూ...."

మా ఆవిడ మూతి బిగించి - నాకు తెలుసు చిరుకోపం వస్తోందని.

.... వచ్చేసింది.

పెదాలు వంకర తిరిగాయి. మూతి వంపులో అందం గూడుకట్టుకుంది.

"మీరన్నీ ఇలాటి పనులే చేస్తారు. ఆయన తెలుసుంటే మనింటికి రమ్మనమని పిలవలేదు సరిగదా

- నాకైనా చెప్పలేదు. వాళ్ళు ఇన్నాళ్ళు మన ఇంటి పక్కనున్నారు గదా - ఓమాటు భోజనానికి పిల్చుకోరూ? ఎటొచ్చీ, ఏదొచ్చినా ఇంట్లో ఆడదానిమీదికొస్తుంది. మర్యాద తెలియని మనిషని అందరూ నన్ననుకుంటారు గాని - మీకేం?.... మీరు మహారాజులాగే వుంటారు"... అంది రుసరుసలాడుతూ.

ఇక విసవిసా నడవాలి.

అదే తరువాయి.

నవ్వుతూ ఆవిణ్ణి చూస్తున్నాను.

"మీకన్నీ నవ్వుతాలుగానే ఉంటాయి లెండి" అంటూ బాబుని తీసుకొని, విస విసా బయలుదేరింది - చెయ్యి ఊపుతూ, జడ విసురుకుంటూ.

ఇంతలో "పిన్నీ, అమ్మ పేరంటానికి నిన్ను చప్పున రమ్మంటోంది" అంది ఆరేళ్ళ పిల్ల వచ్చి.

శాంత "వస్తున్నానని చెప్పు" అని రెండడుగులు వేసి, వెనక్కి తిరిగి, "మర్చిపోయానండోయ్! మన పాల మనిషి జున్ను పాలిచ్చింది పొద్దుట. మీరు వస్తారో, రారో అని కొట్టుకుపోయాను. మీకిష్టమని మిరయప్పొడి బాగా వేసి చేసాను. అలమారులో, మధ్య అరలో, వెండి కంచంలో పెట్టి మూత వేసాను. పక్కనే 'స్పూ' నుంది తినడం మర్చిపోకండే" అంటూ వెళ్ళిపోయింది.

సంధ్య చీకటిలోకి జారిపోతూండగా శాంత తిరిగి వచ్చింది. - విరజాజుల సువాసనలతో, మెడలో గంధం జీరా, కాళ్ళకి పసుపూ మెరుస్తుండగా.

ఆమె దగ్గరగా వచ్చాను. నా చిరునవ్వుకి అర్థం తెలుసుకొని, ఆమె సిగ్గుతో మోము దించుకొంది. కంటి కొసల నుండి ఆ పెద్ద కళ్ళు తొంగిచూస్తున్నాయి.

లజ్జాభారంతో అవనతమైన ఆమె మోము నా చేతుల్లో పద్మంలా వికసించింది. ఆమె మెడ దగ్గర సువాసనకు నాకు మత్తులాటిది కలిగింది. ఆ చెక్కిళ్ళ ఎరుపుకు నా పెదాలు ఎర్రగా పండాయి.

తన అనేకానేక సొగసులతో, సువాసనలతో ఆమె అలవోకగా నాలో ఒదిగిపోయింది.

ఇంతలో 'వాడు చూస్తున్నాడు' అన్నట్టు బాబుని చూపించి, ఆమె నా నుండి పారిపోబోయింది.

సంగతేవిటో తెలియని బాబిగాడు నోరు తెరుచుకుని చూస్తున్నాడు.

వాడు చిన్నవాడు. వాడికి నేనేం చెప్పగలను.?

వాడికే కాదు, వయసు వచ్చి జీవితాన్ని అలా అర్థం కానట్టు చూసేవాళ్ళకి మాత్రం నేనే చెప్పగలను?

అందుకే ఈ కథ చెప్పాను.

(జయశ్రీ మాసపత్రిక : ఫిబ్రవరి - 196

